# ఆమె సౌందర్యవతి...
# ఆమె పాండ్స్‌ను ఉపయోగిస్తుంది



మీ ముఖమును మృదువుగా మరియు మనోహరముగా ఉంచుకొనుటకు

## పాండ్స్ వ్యానిషింగ్ క్రీమ్‌ను వాడండి

తేలికైన మరియు మంచువలెనున్న పాండ్స్ వ్యానిషింగ్ క్రీము చర్మమునకు రక్షణనిచ్చి దానిని చక్కగా మరియు మనోహరముగా ఉంచుతుంది. అది జిగురుగా ఉండదు మరియు రాసుకొన్న మరుక్షణము లోనే కనపడకుండాపోతుంది పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును పౌడరు అద్దుకొనే ముందు వాడితే పౌడరును గంటలతరబడి అంటుకొని ఉండేలా ఉంచుతుంది.




**చర్మమును శుభ్రపరచే క్రీమ్**

ప్రతి రాత్రి మీ ముఖమునకు పాండ్స్ కోల్డ్ క్రీమును దిద్ది రాసుకోండి అది చర్మమును శుభ్రపరుస్తుంది మరియు మీ లావణ్యమును కాపాడుతుంది

చీస్‌బ్రో పాండ్స్ ఇన్‌కార్పొరేటెడ్ (పరిమితమైన బాధ్యతతో యు.ఎస్ ఎ లో స్థాపించబడినది)

# ఆంధ్రసచిత్ర వారపత్రిక



Founder
K Nageswara Rao

స్థాపితము
1908



సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్



సంపుటము 53
సంచిక 47

26-8-59

వికారి శ్రావణ బహుళ అష్టమి



విడిప్రతి వెల 25 న పై
సంవత్సర చందా 13-0-0



ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టివీధి
మదరాసు-1


# విషయానుక్రమణిక

ముఖచిత్రం:
పారశీవారి 'భాగ్యదేవత'లో
సావిత్రి





# ఉత్తరాలు

ఆర్యా,

'పెళ్ళయిన వారికి మాత్రమే' లోని ప్రశ్నలకు నాకు 38, మావారికి 32 మార్కులు వచ్చాయి సరి, మా స్వభావాలు ఎలా వుంటాయో చూద్దామని చదివేటప్పటికి నిజంగా నాకు ఆశ్చర్యమయింది ఒక్క అక్షరమైనా తప్పు కాకుండా మా స్వభావాలు సరిపోయాయి మిగతా వారికి వారి స్వభావాలను యివి సరిపోయాయో లేదో తెలుసుకోవాలనివుంది

మంగళాకుందూరి,
విశాఖపట్నం

*

'పెళ్ళయిన వారికి మాత్రమే' అన్న ప్రత్యేక శీర్షిక ప్రారంభించేకొక, నా స్నేహితులగూర్చి చూసినప్పుడు కూడా సరిగ్గా సరిపోయింది

టి ఆర్ శాస్త్రి,
జయపురం

శీర్షికలోని, నిబంధనల ననుసరించి, నేను, నా భార్య వేరువేరుగా, మార్కులు వేసుకొని, ఫలితములను చూచుకున్నాము అవి మాయొక్క స్వభావములను, నూటికి నూరుపాళ్లు యథార్థంగా స్పష్టపరచినాయని వ్రాయుటకు చాల సంతోషించుచున్నాను

ఎ వి రఘునాథరావు,
విజయవాడ

*

"పెళ్ళికానివారికి మాత్రమే" కూడా ప్రచురింపమని ప్రార్థన

పోమిశెట్టి, అనంతపురం

*

శాకోక సందేహము

చిలకను మగవాడుగాను, గోరువంకను స్త్రీగాను చిత్రించారు నాకు చిలక స్త్రీ అని, గోరువంక పురుషుడని అనుమానము చిలుక వ్యయంవరం పాటయందు "గోరింకరావని పెండ్లాడు కాదు" అని కవులు అనిపించారు అంతేకాక "చెంచులక్ష్మి" సినిమాలో ఒకపాటలో లక్ష్మిని చిలుకగా (నీవే చిలకవైతే ) వర్ణించారు ఏది రైటో ఎవరైనా తెలుపగలరా?

మైథిలి, విజయవాడ

"ప్రవీణ్ కృషి

ఆంధ్ర రాజధానినుంచి ప్రవీణ్ గారు ప్రతివారం వ్రాస్తున్న వ్యాసాలు చాలా బాగున్నవి వాటి వల్ల కొంతవరకు హైదరాబాదునగరం బాగుపడుతుందని మా ఆశ వారి విమర్శ వల్లనే చిక్కడపల్లి నుంచి నారాయణగూడా వరకు మార్గములో విద్యుద్దీపములు వెలిగినవి చిక్కడపల్లిలో ఇండ్లమధ్యగా కొందరు రోడ్డుమీదకూడా బద్దెలను కట్టివేస్తూ వచ్చేపోయేవారికి అడ్డంగా ఉంచుతూ చాలా గలీజు చేయుచున్నారు

[మిగతా 60వ పేజీలో]



# రాజధాని కబుర్లు

ప్రవీణ్

## శాసనసభ డయరీ

ప్రసిద్ధాంధ్ర విమర్శకుడొకాయన ఒకసారి ఒకనాటకం రాశాడు పిల్లలనాటకం, పిల్లనాటకం! ఆ నాటకంలో పాత్రలు ప్రవేశించి, నిష్క్రమించకుండానే పునః ప్రవేశం చేసేవి. మరికొన్ని పాత్రలు నిష్క్రమించి, తిరిగి ప్రవేశించకుండానే, మళ్ళీ నిష్క్రమించేవి. ఆ నాటకంలో పాత్రలు గుర్తుకొచ్చాయి ఈవారంలో.

ఈవారం రాష్ట్ర శాసనసభలో నిష్క్రమణలవారం. ప్రతిపక్ష సభ్యులు అధమం మూడుమార్లు తమ ప్రాతికూల్యం ప్రకటించి బయటకుపోయారు. ఆగస్టు ఒకటవ తేదీ ఉదయం శాసనసభా సమావేశ ప్రారంభంలో ప్రతిపక్ష నాయకుడు శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య లేచి, కేరళలో కేంద్రం కల్పించుకున్న జోక్యానికి నిరసన తెల్పుతూ ఉపన్యసించారు. ఉపన్యసించి తమ అనుచరులతో 'వాకౌట్' చేశారు. వారిని సోషలిస్టు డెమొక్రాట్, ప్రజాపక్షాలసభ్యులు, స్వతంత్రులు అనుసరించారు. అంతకుముందు సాయంత్రం శాసనపరిషత్తులో ప్రతిపక్ష సభ్యులు అదే విషయంపై "వాకౌట్" చేశారు.

మళ్ళా జిల్లాపరిషత్తు, పంచాయతీ సమితులబిల్లు చర్చ జరుగుతూన్నప్పుడు, శాసనసభలో ప్రతిపక్ష సభ్యులు వరుసగా రెండు రోజులు వాకౌట్ చేశారు. రెండు సార్లూ కూడా రెండునిమిషాలపాటు వదులుతున్నామని ముందే ప్రకటించారు. వెళ్ళేవాళ్ళను చూస్తూంటే తిరిగి వచ్చేవాళ్ళను చూడ్డం పడకపోయినందువల్ల కాబోలు వెళ్ళినవాళ్ళు వెళ్ళినట్టే కనబడ్డారు, మళ్ళీ చూస్తే అక్కడే ఉన్నారు.

ప్రభుత్వంవారు తాము చేసిన వాగ్దానాలను నిలబెట్టుకోలేకపోతున్నందుకు నిరసనగా మొదటిసారి వాకౌట్ చేశారు. రెండు నిమిషాలసేపు వాళ్ళందరూ పూర్తిగా బయటికి పోకముందే ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి ప్రతిపక్ష నాయకుల ప్రకటనను ఖండించారు. చేసిన వాగ్దానాలను తుచ తప్పకుండా పాలించామని, అన్నదేమిటో అర్థం చేసుకోకుండా ఆరోపణలు చేస్తే తాము బాధ్యులం కామని అన్నారు. ముఖ్యమంత్రి ప్రభుత్వానికి ఒక నిశ్చితమైన విధానం లేదని పరిశీలక సంఘంలో నిశ్చయించిన నియమాలకు సవరణలను ఆమోదించడం సబబుకాదని ప్రతిపక్షీయులు మరునాడు వాకౌట్ చేశారు.

### ఆందోళనకు ఫుల్‌స్టాప్ కాదు! కామా

ఆంధ్ర దినపత్రిక పాఠకులకు నాగార్జునసాగర్ ప్రాజెక్టు డామ్ ఎత్తు గురించి ఇటీవల జరిగిన రభస కొత్తగా కాదు. డామ్ ఎత్తు 590 అడుగులుండాలని మన ప్రభుత్వం నిర్ణయించింది. అంత ఎత్తు ఉంటే 30 లక్షల ఎకరాలకు నీటిపారుదల సౌకర్యాలు లభిస్తాయి. ఈ ఎత్తును 540 అడుగులకు తగ్గించమని, కావాలంటే శ్రీశైలం ప్రాజెక్టు ఎత్తు పెంచుకొమ్మని గాడ్గిల్ సంఘం తగునమ్మా అంటూ వచ్చి సూచించింది. శ్రీశైలం ఎత్తు పెంచితే, కర్నూలు పట్టణం తిరిగి చూడకుండా మునిగిపోతుంది. నాగార్జునసాగర్ డామ్ ఎత్తు తగ్గిస్తే మహారాష్ట్రులు కొంచెం కృష్ణనీళ్ళు ఎక్కువ తాగవచ్చు. ఇది గాడ్గిల్ గారి ఎత్తు.

గతవారం రాష్ట్ర శాసనసభలో నీటిపారుదల మంత్రి శ్రీ జె. వి. ఎట్టి పరిస్థితుల్లోనూ నాగార్జునసాగర్ ప్రాజెక్టు డామ్ ఎత్తు తగ్గించం అని హామీ ఇచ్చారు. దీనితో సంతృప్తులైన ప్రజలు, శాసనసభ్యులు తమ ఆందోళనకు ( ) పెట్టారు.

కాని

"మంత్రుల మాటలకేం? మాకు సాంకేతిక విషయాలు తెలుసు కూడా. పైమాట కావాలంటే, నదికి పై భాగంలో మైసూరులోనో బొంబాయిలోనో విద్యుచ్ఛక్తి తీసుకొమ్మనండి. శ్రీశైలాన్ని నీటిపారుదల పథకం చేసుకొమ్మనండి" అని వాళ్ళూ వీళ్ళూ ఇక్కడా అక్కడా అంటున్నట్లు వినికిడి. సాంకేతిక 'నిపుణుల' సలహాలు (ఇవ్వడం) ఉచితం. నిర్ణయాలు పరిపాలకులవిగా ఉండాలి. నాగార్జునసాగర్ ప్రాజెక్టు డామ్‌ను గురించి ఆంధ్రపత్రిక స్వాతంత్ర్య దినోత్సవ సంచిక చూడండి.

### సేవాతత్పరతకు స్వాతంత్ర్య దినోత్సవ సందర్భమున రాష్ట్రపతి పోలీసు మెడల్ బహుమతులను అందుకొన్న ఇద్దరు ఆంధ్ర ఉద్యోగులు



క్రైమ్‌బ్రాంచి పోలీసు సూపరింటెండెంటు శ్రీ ఇందుగుల శోభనాద్రి,



హైదరాబాద్ అసిస్టెంట్ పోలీసుఇన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ మాడా కృష్ణమూర్తి

# ★ రాజధాని కబుర్లు ★

ఎర్రకాలువ, బుడమేరు, తమ్మిలేరు వగైరాలు కలిసి చేసిన నేరాలు ఒకరోజు శాసనసభ్యుల చర్చకు కారణం అయ్యాయి వర్షపాతం రాజకీయ పక్షపాతాన్ని పారద్రోలింది కృష్ణా పశ్చిమ గోదావరిజిల్లాల ప్రతినిధులు ఆవేదన వ్యక్తంచేస్తూ ప్రసంగించారు 'వరద నిరోధక పథకాలు అసలు అమలుజరప సాధ్యంకాదనో, లేదా ఏదో దశవర్ష ప్రణాళికో శతవర్ష ప్రణాళికో వేస్తున్నామనో చెప్పెయ్యండి' అన్నారు శ్రీ సంబూరి శ్రీనివాసరావు

## గ్రుడ్డి, చెవిటి—'మాలోకం'

అనగనగా ఒకసారి కమ్యూనిస్టు శాసనసభ్యుడు శ్రీ బద్దం ఎల్లారెడ్డి, ఈ ప్రభుత్వాన్ని విమర్శించడం చెవిటివానిముందు శంఖమూదడమే అన్నారు అరగంట తిరక్కుండా సమాధానం చెబుతూ—ఆర్థికమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి ప్రతిపక్షాలకు ప్రభుత్వం చేసిన కార్యక్రమాలనుగురించి తెలుపడం గ్రుడ్డివానికి అద్దంచూపడమే అన్నారు ఈ రెండు చమత్కృతులు విన్నవారి ఆనందానికి ఎల్లలు లేకుండా పోయాయ్!

భయపడుతూ ఒదిగి ఓమూలకూర్చున్న 'ప్రవీణుడి'కి ఇలా అనాలనిపించింది—

ఇది మహాంధ్రప్రదేశమ ?
బధిరాంధ మహాప్రదేశమా ?



సమర్థుడు కలడొక సంజీవ మంత్రి!
అతనికి శిష్యుడు ఆర్థికేందుహాస మంత్రి!
కలడు కమ్యూనిస్టొకడు సుంద్రరామరెడ్డి!
అతనికి శిష్యుడు బద్దం సరిహద్దుల రెడ్డి!
అన్నాడా శిష్యుడు రెడ్డి
"ఈ ప్రభుత్వాన్ని విమర్శించడం—
శూన్యాన్ని ఆరాధించడం,
చెవిటివానిముందు శంఖు ఊదు—
దానివల్ల లాభంలేదు పోదూ!"
అన్నాడార్థికానందరెడ్డి,
కాసు ప్రహాసరెడ్డి
"ప్రతిపక్షాలకు నచ్చచెప్పడం—
చంద్రుణ్ణి క్రిందకు తెచ్చేందుకు యత్నం,
గ్రుడ్డివానికి చూపవోయ్, అద్దం—
దానివల్ల లాభంలేదోయ్, బద్దం!"
నిజానికిరువురు ధర్మకర్తలే
ఇరువురు 'నిజాని'కి ధర్మకర్తలే
ఇరువురు సత్యం పలికేవారే—
కారని అనేవారు లేరే!
మరి—యిది మహాంధ్ర ప్రదేశమా!
బధిరాంధ మహాప్రదేశమా ?

## సామెతలు—నుడికారాలు

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వెలువరించిన 'సామెతలు,' 'నుడికారాలు'—రెండు సంపుటాలను సరోజినీదేవీహాలులో గత శనివారం శ్రీ సంజీవరెడ్డి ఆవిష్కరించారు సభకు అకాడమీ అధ్యక్షులు డా బెజవాడ గోపాలరెడ్డి అధ్యక్షత వహించారు

ఆనాటి సమావేశంలో వీరిరువురేకాక, 'సామెతలు' సంపుటి ప్రధాన సంపాదకులు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, 'నుడికారాలు' సంపుటి ప్రధాన సంపాదకులు శ్రీ వార్ల వెంకటేశ్వరరావు, శ్రీ సంపత్ రాఘవాచారి, విద్వాన్ విశ్వం ప్రసంగించారు

నిర్ధనులై బాధపడుతున్న ఉత్తమరచయితలకు ఆర్థికసహాయం అందచేయవలసిన అవసరాన్ని గురించి, కవిసమ్రాట్ తనతో ప్రస్తావించారని, అకాడమీ కార్యవర్గ సభ్యులు ఈ పనులు చేయడానికి అకాడమీ ధర్మసత్రం కాదనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారని డా॥ గోపాలరెడ్డి ఈ సమావేశంలో వెల్లడించారు ఆపని చేయవలసిన బాధ్యత విద్యాశాఖదని, ఇదివరలోనే కేంద్ర విద్యాశాఖ అమలు జరుపుతున్న కార్యక్రమం సమన్వయంచేసి, రాష్ట్ర విద్యాశాఖ సహాయానికి పూనుకోవాలని డా॥ గోపాలరెడ్డి అన్నారు అతి వినయభూషణ భూషిత విద్యాశాఖ ఏం చేస్తుందో చూడాలి మరి!

సమావేశం టాగూరు నాటకానికి దాశరథి అనుసరణ 'చిత్ర'తో అంతమైంది పాత్రధారులు పాటలు మాటలు మరిచిపోతారని కాబోలు సంభాషణలన్నీ రికార్డుచేసి, పాత్రధారులచేత పెదవులు కదిపించారు దర్శకులు ప్రధాన పాత్రధారిణి కుమారి వాణి నిర్వహణను మినహాయిస్తే, ఈ దిశలో పాత్రధారుల ప్రయత్నాలు విజయవంతం కాలేదంటారు కన్నవారు, విన్నవారు యాంత్రిక సాధనాలకు బానిసలు కాకూడదన్న ప్రాథమిక సత్యాన్ని ఈ నాటకీయులు ఎన్నడు గ్రహిస్తారో తెలియదు

## 'నివేదికలగూరగంప'

రద్దీ రహదార్లు కొన్ని వారాల క్రితం 'రాజధాని కబుర్ల'లో వై ఎం సి ఎ నుంచి దీపక్ మహల్ వరకువచ్చే రోడ్డు పై రోడ్ బ్లాక్సు వంటివి నిర్మించవలసిన అవసరంగురించి వ్రాయడం జరిగింది అదే శీర్షిక క్రింద దీపక్ మహల్ సినిమా హాలునుంచి వచ్చే జనానికి వెనుకనుంచీ మరోదారి కల్పించాలని కూడా సూచించబడింది ఈ నెలలో - అనధికారవార్తలను బట్టి ఇక్కడ మూడు ప్రమాదాలు జరిగినట్లు తెలుస్తోంది ఒక ప్రమాదంవల్ల ఒక ప్రాణం వెంటనే ఎగిరిపోయింది మరో ప్రమాదం వల్ల గాయాలకు లోనైన ఒక వ్యక్తి ఆసుపత్రికి కొనిపోబడ్డాడు మేటినీ విడిచిన సమయానికి వచ్చే రద్దీలో ఒకకారు ఒక రిక్షాను గుద్దుకోవడం వల్ల రిక్షా నాశనమైపోయింది మూడో ప్రమాద ఫలితాలను నేను కళ్ళారా చూశాను అధికారులు ఇక మేల్కొంటారా ?

దైవాధీనం బస్ సర్వీస్ 7-బి, 7-సి బస్సులు ఇంకా ఎనిమిదులూ సున్నాలు చుట్టుకుంటూ తిరుగుతూనే ఉన్నాయ్ ఇంకా వేలకొలది గాలన్ల డీసెల్ నూనె ఖర్చౌతూనే ఉంది ఇంకా బస్సులు ఆలస్యంగా తిరుగుతూనే ఉన్నాయి ఉదాహరణకి ఆగస్టు 9 వ తేదీ సాయంత్రం దీపక్ మహల్ బస్ స్టాండువద్దకి ఐదుగంటల ప్రాంతానికి ఐదుబస్సులు వరదాగా చెట్టాపట్టాలు వేసుకువచ్చాయి బస్సులలో నాల్గింట నంబర్లు ఎ పీ జడ్ 1403, 1406 1416, 1421 ఐదోది ఏ పీ జడ్ 1431 అని గుర్తు ఐదింటికి అటూఇటూ ప్రయాణీకులు ఎంతెంతసేపు నిలబడి ఉన్నారో కనుక్కుంటే తమాషాగా ఉంటుంది

## శ్రీకృష్ణజన్మస్థానం చెప్పినకథలు

"షోకీలా - 420-వహీదా కథ చెబుతానన్నావ్ క్రిందటివారం" అంది నృసింహా జన్మస్థానం "ఓ! తప్పకుండా చెబుతా! నేనెప్పుడైనా మాటతప్పి ఎరుగుదునా?" అంది శ్రీ కృష్ణ జన్మస్థానం, అని "విను" అంది

"మొన్న మార్చి 29 వ తేదీ సాయంత్రం నాలుగు గంటలు ప్రాంతానికి చార్ మినార్ వద్దనున్న గుల్జార్ హౌజ్ లోనున్న సురాజ్ ఖాన్ అండ్ కంపెనీ ముందు ఖరీదైన ఒక హిల్ మన్ కారు వచ్చి ఆగింది రెపరెపలాడుతున్న ఒక జార్జెట్ చీర కట్టుకున్న పదెనిమిది సంవత్సరాల స్త్రీ దిగించి కారులోనుంచి, ఆమెకు సహాయంగా వచ్చింది ఒక ముదుసలి వనిత

"సురాజ్ ఖాన్ అండ్ కంపెని నీకు తెలుసు నగలవ్యాపారం చేస్తారు మనిషి చూస్తే రూపాయలు విసిరేటట్లు కనిపించింది మూడుగంటలసేపు నగలు ఖరీదించింది-చీకటి పడేవరకు తరవాత అంది నాకు ఫలానా ఫలానా నగలుకావాలి ఈ బంగారుగొలుసు ఆ అంగుళీయకం, ఈ ముక్కుపుడక, డైమండు పొదిగిన ఆ కర్ణాభరణం అంటూ నాతో ఎవరినైనా పంపించండి ఫలానా ఫలానా జాగీర్దార్ తీసుకున్నవి తీసుకొని డబ్బు ఇచ్చి పంపిస్తాను అంది

"పనిచేసే కుర్రాడితో సహా, జేబుగుమాలులో కట్టిన నగలతో సహా హిల్ మన్ కారు జియాబాగ్ లో ఒకతోటలో ఉన్న ఒక కంపౌండులో ఉన్న బ్రహ్మాండమైన భవనం ముందు ఆగింది వగల్ని మనుష్యుల్ని బయట అట్టేపెట్టి-లోపలికి పోకూడదు, ఘోషా!-స్త్రీలిద్దరూ లోపలికి పోయారు అరగంటతర్వాత బయటికి వచ్చి, నగలు తీసుకొని లోపలికిపోయి తలుపు వేసుకుంది కుర్రాడు డ్రైవరు చాలా అరుగు మీద కూలబడ్డారు

"ఎంతసేపైనా రాకపోతే కుర్రాడు తలుపు తట్టాడు తలుపుతోస్తే వచ్చేసింది లోపలహాల్లో ఇంకొక అరుగు ఉంది అరుగుమీద హరికేన్ దీపం వెలిగించి పెట్టిఉంది కొంసేపాగి, పిలిచి, చప్పట్లుకొట్టి లోపలి తలుపు తెరిచాడు కుర్రాడు తలుపు తెరిస్తే అంతా ఏమీలేదు భవనం అంతా అంతటితో నే ఆఖరు తర్వాత పాడుపడిన గోడలు, ముళ్ళకంపలు

"ఆ హిల్మన్ కారు ఒకటాక్సీ వాడి ఇద్దరూ గోలపెట్టారు రాత్రి ఎనిమిగంటలకు సురాజ్ ఖాన్ యజమాని గణేశ్ ప్రసాద్ నాలుగువేల రూపాయలు నగలు పోయాయని అసిఫ్ నగర్ పోలీస్ స్టేషన్లో మొరపెట్టుకున్నాడు సెంట్రల్ క్రైమ్ సెక్షన్ అసిస్టెంట్ కమీషనర్ శ్రీ జి హనుమంతరాయుడు విచారణ ప్రారంభించారు

"టాక్సీవాడి కథ గ్రాంథం మాటి మాటికి సవరించుకుంటూ ఒకకుర్రాడు వీళ్ళవెంట అఫ్జల్ గంజ్ టాక్సీస్టాండు వరకూ వచ్చాట్ట మరో టాక్సీవాడి కథ ఆ అమ్మాయిని ఎవడో గండిపేటవరకు తీసుకువెళ్ళాట్ట వాడు వాహబ్ అనే జాగీర్దార్ కుమారుడు అని తెలిసింది ఆ అమ్మాయి ఒక వ్యభిచారిణి అని తెలిసింది మెహిందీలో విచారణ అమ్మాయిపేరు వహీదా అని, వహీదా, వాహబ్ ఇద్దరూ అమీర్ పేటలో కొంతకాలం కాపురం ఉన్నారని తేలింది అక్కడ ముసలి పట్టుబడింది ముసలి చెప్పింది కథ వహీదా వాహబ్ ఇద్దరూ పాకిస్తాన్ పారిపోయారు

"ఆనాటి రాత్రి భవనం వెనకనుంచి రిక్షాపై అసిఫ్ నగర్ జంక్షన్ వరకు పారిపోయారట అక్కడ వహాబ్ నిలబడి ఉన్నాడు రిక్షాలపై నాంపల్లి చేరి, అక్కడ ముసలిదానికి రెండువందలరూపాయలిచ్చి వాళ్లు రైలెక్కేశారు తరువాత జబల్పూరులో వారున్నట్టు తెలిసింది కాని పోలీసుకు సమాచారం తెలిసేసరికి మాయమయ్యారు

"ఈకథ అసలు నేను చెప్పకూడదు లే, కాని ఎప్పటికైనా మనంద్దరం వల్సిందే కదా? ఏమంటావ్? ఇప్పుడు కుంభకర్ణుడి మారువేషం వేసుకున్న అలెగ్జాండరుడి కథవిను' అంది శ్రీ కృ జ స్థా

"కుంభకర్ణుడు? కుంభకర్ణుడి పునర్జన్మ!" అంది నృ జ స్థా



"ఇవాళ చెత్తా చెత్తకాయితాలూ ఎక్కువ పడ్డాయే! ఏం దబ్బ కథా"

"ఏముంది చిత్రం వచ్చినట్టు చెత్తకాయితాలు పడేసి వీధుల్ని గలీజు చెయ్యొద్దని బతిమాలుతూ నిన్న అందరికీ కాయితాలు పంచిపెట్టారుగా"

# శ్రావణ తగువు

వి. కామేశ్వరీకృష్ణ

ఆ సంవత్సరమే క్రొత్తగా పెళ్లయిన శారదకి శ్రావణ తగువు తెస్తారని ఘనంగా అనుకున్నారు అప్పటికి పెళ్ళయి రెండు నెలలే అయినా శారద భర్త గోపాలాన్ని చక్కగా అర్థం చేసుకుంది అందరికిమల్లే తన అత్తవారు కూడా సుద్దూ ముచ్చట తీరుస్తారని ముచ్చటపడింది

శ్రావణ శుక్రవారం, వరలక్ష్మీనోము, యింకా పదిరోజు లుందనగానే మామగారు పచ్చకాగితాన్ని క్రొత్తకోడలికి మనియార్డరు చేశారు తను సంతోషించినా యింట్లో వాళ్ళాపని హర్షించలేకపోయారు కారణం, తనకేమీ పాలుపోలేదు పక్కింటి పద్మకి తగువుతీసికొని భర్త అత్తా మామ, అంతా వచ్చారు తనకా పాటి అదృష్టం లేనందుకు లోలోపలే కుమిలిపోయింది భర్తపై చెప్పరానంత కోపం వచ్చింది మధ్యనెల్లాళ్ళు ఆషాడమాసం మూసుకు రావడంతో యిద్దరిమధ్య రాకపోకలు లేవు అత్తగారి గడప అల్లుడు దాటరాదని, అత్తాకోడళ్ళు ఒక చోట వుండరాదని, ఆనవాయితీగా వస్తూన్న ఆచారాన్ని పాటించాలన్నారు అందరూను ఆషాఢమాసంలో రానివారు యిప్పుడైనా ఎందుకు రాకూడదని కోపగించింది శారద

కాలం కరటం ఎవరికోసమూ ఆగేది కాదు నోములు పూర్తవగానే, అత్తవారి ఆజ్ఞననుసరించి, శారదను వారింట దిగవిడిచి వచ్చాడు తండ్రి

"ఇంట్లో తగువుపెట్టుకుని వచ్చినదానిలా అలా వున్నావేం?" అన్నాడు వేళాకోళంగా గోపాలం ఇంతకాలానికి కలుసుకున్నందుకిలా సముదాయించడం రుచించక, మాట్లాడలేదు శారద

"అమ్మగారికి కోపం కాబోలు వస్తారని తెలిసి సీమనుకి రాలేకపోయినందుకా!" అనునయించబోయాడు గోముగా

"నాకోసం ఎవ్వరూ కష్టపడడం నాకిష్టం లేదు నెలపైనుండీ కనిపించనివారు యినాడు కనికరించలేదే అని విచారమూ లేదు" అంది మూతి తిప్పుకుని క్రొత్తపెళ్ళి కూతురు శారద ఆ అలకలు, పలుకులు, అలవాటయిన గోపాలం తృప్తిగా నవ్వుకుని దగ్గరకు తీసుకొన్నాడు

శారదవచ్చి వారంరోజులయింది ఇల్లంతటికీ ఏదో మార్పు వచ్చినట్లు కలకలలాడుతోంది అన్నివిధాల అనువైన పిల్లగనుక ఎవరికెలా తృప్తిపరచాలో గ్రహించి మసలుకుంటోంది

ఆ వేళ భోజనాలయ్యాక అత్తాకోడళ్ళిద్దరూ కూర్చున్నారు మాటపై మాటగా అత్తగారు ప్రస్తావించింది "అబ్బాయికి మూడువందలు బోనస్ వచ్చింది వంద తను తీసుకొని రెండూ నీకు పంపమన్నాను పంపించాడా?" అని అడిగింది

నిర్ఘాంతపోయి తెల్లపోయింది శారద మనియార్డరూ లేదు, మంచిమాటా లేదు యీ నెల్లాళ్ళలోను ఆ డబ్బు ఏం చేశారో! తల్లికి తండ్రికి చెప్పి, తనకు పంపక ఆయనే వాడుకున్నారో, ఎక్కడయినా జారవిడుచుకున్నారో, తెలియక తికమకపడింది శారద మనస్సు తన తికమక అత్తగారు గ్రహించి యింకో ప్రశ్న వేయకుండా, "యిక్కడికెలానూ వస్తానని పంపలేదు కాబోలు నాకు అందలేదండీ" అంది తొణుకు బెణుకూ లేకుండా కోడలిపై నమ్మకం కుదరలేదు అత్తగారికి

[63-వ పేజీ తరువాయి]



గోపాలం తృప్తిగా నవ్వుకుని దగ్గరకు తీసుకున్నాడు.

# కొత్తరకం ప్రణయం

తనకి ఆఫీసుకి ఉత్తరం వచ్చిందనగానే, ఆశ్చర్యపోయింది జయంతి ఇదే మొదటిసారి ఉత్తరం చదవగానే, ఆశ్చర్యంతోపాటు భయం కలిగింది అది ప్రేమలేఖ అయినట్లయితే, విసురుగా చించి పారేసేదే! కాని అది తనగురించి తనకే తెలియని విషయాలనగురించి తెలియజేసిన విచిత్ర లేఖ! పక్క సీటులో కూర్చున్న నటరాజన్‌తో చెప్పి తొందరగా, కిందనే ఉన్న కేంటీన్‌కి వెళ్ళి, తొందరగా, ఉత్తరాన్ని మళ్ళీ చదివింది తనకి తెలియకుండానే కళ్ళంట నీరు కారడం ప్రారంభించింది తన మనస్సులో అటువంటి భావం లేదే! ఎవరీ సోదరి? ఎందుకు తనపై ఇలాంటి అభాండం వేసింది? సోదరి అని సంతకంపెట్టి ఉన్న ఉత్తరాన్ని జాగ్రత్తగా తన బ్యాగులో దాచింది తిరిగి సీటులోకి వెళ్లి కూర్చుంది పక్కనుంచి వెళ్లిపోతూ అరుణ్ పలకరించాడు

"హలో జయంతీ?" అరుణ్ మహారాష్ట్రుడు బొంబాయిలోనే ఆరు సంవత్సరాలై స్థిరపడిపోయిన జయంతికి మరాఠీ భాషంటే కొట్టినపిండి వడవడిలోనూ, అలవాట్లలోనూ ఆమె ఏ మహారాష్ట్ర వనితకీ తీసిపోదు "హలో" అనేసి ముక్తసరిగా తిరిగి ఫైలు చూసుకోవటం ప్రారంభించింది అరుణ్‌కి ఇది కొత్తకాదు ఆమెకి పని ఎక్కువగా ఉన్నప్పుడైనా, ఇంట్లో కాని, ఒంట్లో కాని బాగా లేనప్పుడు ఆమె ప్రవర్తన ఇలాగే ఉంటుంది పనిచేస్తున్నదన్న మాటేకాని, ఆమె మనస్సు మనస్సులో లేదు అందరూ తనవంకే చూస్తున్నట్లు ఫీలయింది ఇప్పుడామె మనస్సులో మిగిలేది ఒకటే ఒక ప్రశ్న ఎవరీ సోదరి? తనపైన తనకే సంశయం కలిగించే ఈ ఉత్తరం ఎందుకు రాసింది? ఆమెకి ఏం లాభం? తనజీవిత సర్వస్వాన్ని నాశనంచేసి ఆమె ఏం బావుకుంటుంది?

మూడున్నర అయింది అరుణ్ వచ్చాడు

"జయంతీ! టీకి వస్తావా?"

"క్షమించు ఇవాళ నేను టీ తీసుకోను నువ్వు వెళ్ళు అరుణ్" అరుణ్ వెళ్ళిపోయాడు జయంతి భయంగా గుండెమీద చేయివేసుకొంది ఆ ఉత్తరం ఆమెని అనుక్షణం బాధపెడుతోంది

ఆ రాత్రి ఆమెకి నిద్రపట్టలేదు ఈ విషయాన్ని తనెలా దాచుకోగలదు? ఎలాగ?

"ఇవాళ కాలేజీకి వెళ్ళవా అమ్మా" అన్నారు కామేశంగారు ఉదయాన్నే

"ఒంట్లో బాగులేదు నాన్నా" ఉద్యోగం చేస్తూ, బి ఏ కి కడుతున్నది జయంతి ఉదయం కాలేజీనుంచి నేరుగా ఆఫీసుకు వెళుతుంది ఇంటర్ ఆమె అలాగనే ప్యాసయింది తన పన్నెండవ ఏటనే తల్లిని పోగొట్టుకొన్న జయంతి, మెట్రిక్ పూర్తిచేసి బొంబాయిలో ఉన్న తండ్రి దగ్గరకి వచ్చేసింది తండ్రి ఆర్థిక పరిస్థితి తెలిసిన ఆమె, పనిచేస్తూ చదువుకుంటానంది ఆయన దానికి ఏవిధమైన అభ్యంతరం చెప్పలేదు

"ఒంట్లో బాగులేకపోతే ఇవాళ ఆఫీసుకి వెళ్ళకమ్మా"

"ఆఫీసుకి వెళతాను నాన్నా"

"నీ యిష్టం నేను వెళ్ళిపోతున్నాను అన్నట్లు రేపు బ్రాడ్వేలో 'మల్లీశ్వరి' వేస్తున్నారుట రెండు టిక్కెట్లు బుక్ చెయ్యి తెలుగు సినీమా చూసి చాలా కాలం అయింది"

"అలాగే నాన్నా" కామేశంగారు

తారామూర్తి

కొత్త సిగరెట్టు వెలిగించి మెట్లు దిగిపోయారు

* * *

జయంతి ఆఫీసులో అడుగుపెట్టిందో లేదో, అరుణ్ కనిపించాడు ఇంకా పదిహేను నిముషాలు టైముంది

"ఇవాళ క్లాస్‌కి రాలేదేం?" అన్నాడు మరాఠీలో

"మలా బరా నై" అన్నది జయంతి అంటే తెలుగులో నాకు ఒంట్లో బాగు లేదని

"ఈ చాక్లెట్ తిని కాఫీతాగు," అని చాక్లెట్ ఇచ్చి అరుణ్ వెళ్ళిపోయాడు ఆమెకి చాక్లెట్ ఇష్టంలేదు అప్పుడే వచ్చిన నటరాజన్‌కి ఇచ్చేసింది

ఓ! ఐ యామ్ సింప్లీ లకీ" అంటూ డ్రాయర్ లో దాచేశాడతను

"అన్నట్లు ఏక్ ఎఫైర్ టు రిమెంబర్ చూశావా మిస్ జయంతీ?" అన్నాడు నటరాజన్

"చూశాను చాలా బాగుంది," అన్నది సంభాషణ ఆపుదామని ఉద్దేశంతో ఇంతలో రజని వచ్చింది అక్కడికి తెల్లటి చీరమీద ఎర్రటి బ్లౌజు వేసుకొని, రెండు జడలతో, చాలా ఆకర్షణీయంగా ఉంది చూడడానికి ఆమెకి రాజకీయాలన్నా, సినీమాలన్నా తగని పిచ్చి

"హలో జయంతీ! నిన్ను చిన్న కోరిక కోరదామని వచ్చాను"

"బోలో సాబ్" అన్నది జయంతి

"రేపు సాయంత్రం మా సంయుక్తమహారాష్ట్ర సంఘం యాజమాన్యాన, దాదర్ లో చర్చ జరుగుతుంది నీవు రావాలి మాట్లాడాలి"

"క్షమించు రజనీ! నేను రాలేను నాకు వేరే పని ఉంది"

"ఎవరైనా ఇష్టులతో సినీమాకి వెళ్లాలా?"

"కాదు"

"అవును మీ ఆంధ్ర మీకు దక్కిందిగా మేము ఏమయితే నీకేం? అంతేనా?"

"నాకు అలాంటి భావం లేదు రజనీ; ఉంటే అన్యభాష వాళ్ళయిన మీ అందరితో ఇలాగుంటానా?"

"డోంట్ టేక్ మై టాక్ సీరియస్‌లీ డియర్! వస్తాను

రజని మాట్లాడిన అన్ని వాక్యాలలోనూ ఒక్కటే జయంతి మనస్సుకి హత్తుకుంది

"ఎవరైనా ఇష్టులతో సినీమాకి వెళ్లాలా?" అన్నది రజని మెరపులాంటి ఊహ తట్టింది జయంతికి ఈ సోదరి రజని కాదుకదా! ఎలాగైనా ఈ విషయం అరుణ్‌తో చెప్పాలి వారంరోజులు గడిపింది జయంతి ఈ రహస్యాన్ని తలచుకుంటూ ఆరోజున అనుకోకుండా అరుణ్ రైల్లో కలిశాడు సాధారణంగా ఆ రైల్లో అతనురాడు

"హలో అరుణ్! ఇవాళ ఈ రైల్లో వచ్చావేం?"

"పనుండి దాదర్ లో దిగాను అందుచేత!"

కంపార్ట్‌మెంట్ కలయచూసింది ఎవరో ఒక ముసలాయన పేపరు చదువుకుంటున్నాడు ఇంకెవరూ లేరు

"అరుణ్! నీతో ఒక విషయం చెప్పాలని వారంనుంచి అనుకుంటున్నాను కాని ధైర్యం చాలలేదు వారంక్రిందట నాకీ ఉత్తరం వచ్చింది చూడు" తన హేండ్ బేగ్ లోంచి తీసి ఇచ్చింది ఉత్తరం ఇంగ్లీషులో ఉంది సంతకం "నీమంచి కోరే సోదరి" అని ఉంది

అరుణ్ ఉత్తరాన్ని శాంతంగా చదివి ఆమె వైపు చూశాడు

"నన్ను పరీక్షిస్తున్నావా జయంతీ!"



"నన్ను పరీక్షిస్తున్నావా జయంతీ?"

"నిన్ను నేనేం అనలేదు లోకం సంగతి చూడు ఎవరీ సోదరి? నీతో నేను వేలం వెర్రిగా తిరుగుతున్నానుట అన్య జాతి వాడినైనా నాకు లక్ష్యంలేదుట నీలో ఉన్న సంస్కృతి, నడవడిక నచ్చాయి కనుక నే నీతో నేను మాట్లాడుతున్నాను లేకపోతే ఎందుకు మాట్లాడతాను

"జయంతీ! కుక్కలు మొరుగుతాయి ఏనుగు లక్ష్యపెట్టదు అని మా భాషలో సామెత ఉన్నాది"

"మా భాషలోనూ ఉన్నాది అరుణ్!"

"మన భారత దేశంలో భాషలు వేరయినా, భావాలూ, చాలామట్టుకు సంప్రదాయాలు ఒక్కటే జయంతీ"

"అందులో ఆంధ్రులకి, మహారాష్ట్రు

నీతో మాట్లాడటం మూలాన, నీపేరు చెడిపోతుందని నీకు అనిపిస్తే ఈ రోజునుంచీ నీతో మాట్లాడటం మానెయ్యడానికి నాకేం అభ్యంతరంలేదు నీ మంచి కోరే వాళ్ళలో నే నొకణ్ణి అని మరచిపోకు "

ఈ మాటలలోని గంభీరతకి జయంతి కదలిపోయింది ఆమెలో మారు మూలల దాగొన్న ఆత్మగౌరవం మేల్కొంది

"అరుణ్! నీవు చెప్పినట్లు కుక్కలు మొరుగుతాయి ఆ అరుపులకి నీ స్నేహాన్ని బలిచెయ్యలేను," అన్నది స్టేషన్ వచ్చింది ఆమె దిగిపోయింది ఆమె మనస్సులో ఏదో భారం తగ్గినట్లు ఫీలయింది లోలోపల భయంగా ఉన్నా పైకి చలాకీగానే ఉన్నది జయంతి

గానే, జయంతి ఆఫీసుకి వెళ్ళింది ఏదో వీక్లీ చూస్తున్నాది

"క్షమించు జయంతీ" వెనక్కి తిరిగి చూసింది అరుణ్ "హలో అరుణ్" అతను జేబులోంచి ఉత్తరం తీసి ఇచ్చాడు ఆమెకి

"ఇది చదువు "

"అరుణ్!

నీవు జయంతి వెనకాల ఎంగుకలా తిరుగుతావు? నిన్నే నేను ఆమెని కలుసుకున్నాను, బాగుండదేమోనని నీతో ఆమె మాట్లాడుతోంది మనస్సు, మంచితనం, లేని స్నేహం నీకేం తెచ్చిపెడుతుంది! ముఖప్రీతి కోసం నిన్నుచూచి లేని నవ్వు తెచ్చిపెట్టుకుంటుంది జయంతి స్త్రీ తన

# ★ కొత్తరకం ప్రణయం ★

వంతో కాదు ఎందుకు ఆమె ప్రేమను నీ వ్యక్తిత్వాన్ని ఒద్దుతావు నీ మంచికే ఇదంతా"

జయంతి మాట్లాడలేగు

"ఆమెను నువ్వు కలుసుకున్నావా జయంతీ!"

జయంతి చిన్నగా నవ్వింది ఆ నవ్వులో సంపూర్ణ విశ్వాసాన్ని వ్యక్తం చేసింది అరుణ్ మళ్ళీ అడిగాడు

"నిజంగా చెప్పు జయంతీ! ఈమె ఎవరు? ఈమెను కల్సుకున్నావా?"

"అరుణ్! నాపైన విశ్వాసం ఉంచు ఈమె ఎవరో నాకు తెలియదు ఇదంతా అబద్ధం నీమీదగౌరవం నాకెప్పుడూ ఒకటే అరుణ్! ఈ సంకుచిత జాతి భేదాలు, అభిప్రాయాలు నీపైన నాకున్న అభిప్రాయాన్ని మార్చలేవు" అరుణ్ ఆమె కనుకొలకుల్లో బాష్పబిందువు చూశాడు

"నీ మనస్సుని కష్టపెట్టాను జయంతీ! నిన్ను పూర్తిగా విశ్వసిస్తాను" ఆమె కృతజ్ఞతతో అతనివైపు చూసింది

ఈ సంఘటన జరిగినప్పటినుంచీ, అరుణ్ జయంతితో అంతగా మాట్లాడటంలేదు ఈ విషయం ఆమెని చాలా బాధపెడుతోంది ఒకనాడు రైల్లో అడిగింది

"నామీద నీకింకా విశ్వాసంలేదా! కోపం వచ్చినట్లుంది నీకు"

అరుణ్ తొలుత ఆకాశంవైపు తరువాత ఆమెవైపు చూశాడు ఆకాశంలోని నిర్మలత ఆమెముఖంలో కనిపించింది

"జయంతీ! నువ్వు పొరబడ్డావు మొదటిది నీమీద కోపం రావడానికి అవసరం లేదు రెండు వచ్చినా నేనేం చెయ్యలేను ఏమీ అనలేను అన్నా, పడడానికి నీకేం అవసరంలేదు"

జయంతి జీవితంలో తొలిసారిగా మనస్ఫూర్తిగా ఏడ్చింది









"నిన్ను ఎలాగ నమ్మించేనో నాకు తెలియదు అరుణ్! కాని ఒక్కమాట! నిన్ను కష్టపెట్టడం, అవమానించడం నా ఆశయం కాదు ఒక్కటి నమ్ము నా తండ్రి తరువాత, నీ అంతగా నేనెవర్నీ గౌరవించలేదు విశ్వసించలేదు ఒట్టువేసి చెబుతున్నాను"

"నువ్వు నాకిచ్చిన గౌరవాన్ని నిలబెట్టుకునేందుకు ప్రయత్నిస్తాను జయంతీ!"

ఆ వేళ రాత్రి భోజనాలయిన తరువాత జయంతీ కామేశంగారు ఏదో ఎచ్చాపాటి మాట్లాడుకుంటున్నారు

"అయితేనా నాన్నా! సంస్కృతి, సంప్రదాయం, ఒకటే అయిన రెండు జాతుల మధ్య సామరస్యం కుదురుతుందంటావా?"

అనుకోని ఈ పెద్దప్రశ్నకి కామేశంగారు ఆశ్చర్యపోయారు

"ఇంత పెద్దసందేహం కలిగిందేమిటి నీకు?"

"కొన్ని దినాలనుంచి నిన్ను అడుగుదామనుకుంటున్నాను"

"సామరస్యం ఎందుకు కుదరదో నాకు అర్థంకాదు మనిషిని తయారుచేసేవి పరిస్థితులు, పెంపకం ఉదాహరణకి, నువ్వు తెలుగు మాట్లాడకపోతే, అందరూ నిన్ను మరాఠీ దానివనే అనుకుంటారు"

"అనుకోనీ నాన్నా! మనం చెడ్డవాళ్ళం కానంత కాలం, ఎవరు ఏ జాతి పేరు పెట్టినా మనకేం?"

ఈ రకమైన సంభాషణలు జయంతినుంచి వినడం, కామేశంగారికి ఇదే మొదలు

"చాలా విచిత్రంగా మాట్లాడుతున్నావు జయంతీ!"

"అవొచ్చు మిమ్మల్ని ఒక కోరిక కోరదామని ఉంది నాన్నా! దానికి ఇది ఉపోద్ఘాతం"

"నీ పురోగమనానికి తోడ్పడే ఏ మంచి కోరికయినా నేను కాదనను"

"ఆ మాత్రం ధైర్యం ఇస్తే ఈ కుక్కల అరుపులన్నీ కట్టిస్తాను"

ఈ ఆఖరి వాక్యం కామేశంగారికి బోధపడలేదు అతను ఆ కుక్కల గురించి అడగనూ లేదు

* * *

"ఈవిడ మా అమ్మగారు!"

తనకి ఎదురుగా, తొమ్మిది గజాల చీరను దోపుకచ్చ కట్టుకొని, నుదటని ఎర్రటి కుంకుమబొట్టు పెట్టుకొని నిల్చున్న ఆవిడకి జయంతి నమస్కారం పెటంది మరాఠీ మాటలాడటంలో జయంతి నేర్పుకి అరుణ్ తల్లి ఆశ్చర్యపోయింది

"నువ్వు మద్రాసీవంటే ఎవరూ నమ్మరు"

"నేను మద్రాసీని కాను"

అరుణ్, తల్లికి ఆమె ఆంధ్రదేశపు పిల్లని,

ఆంధ్రులు వేరనీ, మద్రాసీలు వేరని వివరించి చెప్పాను.

"అయితే నువ్వు మాట్లాడే భాష, మా ఇంటపక్కన అయ్యర్ మాట్లాడే భాష వేరన్నమాట"

"ఔను"

లోపలనుంచి అరుణ్ టీ తీసుకొచ్చాడు

"నువ్వు తీసుకొచ్చావా "

"తప్పేం! అన్నపూర్ణా కెఫేలో మనటీ మనం ఎన్నిసార్లు తెచ్చుకోలేదు ? "

జయంతి సిగ్గుపడ్డాది

"నా గది చూపిస్తాను రా, జయంతీ!" తనగదికి తీసుకొని వెళ్లాడు

"ఇంగులో ఉన్న ఫోటోలు నీకు తెల్సివనే "

"అరుణ్ ఆయన కార్వే కదూ ?"

"ఔను స్త్రీ పునర్వివాహాన్ని ప్రచారం చేసి ఆచరించిన మహనీయుడు "

"మీ మరాఠీదేశంలో ఇతనంటే ఎంత గౌరవమో, మా ఆంధ్రలో కందుకూరి వీరేశలింగంగారు అంత గౌరవనీయులు ఏ దేశసులయితే నేం అరుణ్! వారందరూ చిరస్మరణీయులు అనుసరణీయులు "

"నీ విశాల హృదయానికి నా జోహార్లు జయంతీ! "

"నీ కోపాన్ని భరించగలను కాని, నీ పొగడ్తలని భరించలేను అరుణ్! వసాను "

"జయంతీ!" అరుణ్ తల్లి పిలుపు

"ఈ శ్రీఖండ్ తీసుకొని వెళ్ళు నీకు దీని రుచి తెలియదేమో! పూరీలలోకి ఇది పెన్నిధి "

జయంతి ఆమె చేతిలోని డబ్బా తీసుకుంది ఆ రోజు భోజనాల దగ్గర జరిగినదంతా చెప్పింది తండ్రికి జయంతి ఆయన శాంతంగా విన్నారు

"నీ ఉపోద్ఘాతం వెనక కథ నాకు అర్థం అయిందమ్మా"

"నాన్నా! "

"నీ వెనకాముందూ ఎవరూ లేరు నాకూ నువ్వుతప్ప ఎవరూ లేరు మీ అమ్మపోయాక అన్ని బంధాలు తెగతెంచుకున్నాను నీ సుఖంకోసం నేను కష్టపడటం నా కర్తవ్యం నా అనంతరం నిన్న లోకం వేలెత్తి చూపినా, ధైర్యంగా నిలబడగలిగే ఆత్మశక్తి నీలో ఉన్నదని నీకు తోస్తే, నీవు అరుణ్‌ని తప్పకుండా పెళ్లి చేసుకో "

జయంతి తన చెవులని తను నమ్మలేకపోయింది వివాహాలు స్వర్గంలో అవుతాయా ? నిజమే నేమో!

* * *

మిత్రులందరూ ఆనందించారు ఈ వివాహాన్ని ఆదర్శమైనదని వర్ణించారు నటరాజన్ అరుణ్‌ని, జయంతిని అభినందిస్తూ "లీడర్స్ ప్రీచ్ ఇమోషనల్ ఇంటిగ్రేషన్ యూ హేవ్ షోన్ ఇట్," అన్నారు

జయంతి తన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చింది అరుణ్‌కి ఎమ్ ఏ ప్యాసయినాక ప్రమోషన్ వచ్చింది

* * *

బాల్కనీలో జయంతి పిల్లాడిని ముద్దులాడుతోంది పక్కనుంచి అరుణ్ చూస్తున్నాడు అతనికి తెలుసు జయంతికి తనంటే సర్వస్వమనీ, తనంటే ఎంతో గౌరవం అని కాని కాని ఆ రెండు ఉత్తరాలూ రాసింది తనేనని ఆమెకి తెలియనివ్వలేదు ఆమెకి అతను ఏమీ కాడు . తన జీవితంలో జయంతికి చెప్పని రహస్యం ఇదొక్కటే ఇదొక్కటే! ★

# ఋణానందలహరి

గుర్నాథం దగ్గరలో ఉన్న గోడమీద ఒక మసిబొగ్గు గీత ఏరుకుని దానిని తేరిచూస్తూ పరధ్యానంలో పడిపోయాడు

అలా బుర్రని వేస్టు చెయ్యకపోతే కాస్త నాకైనా రెండు ట్రిక్కులు ఆలోచించి పెట్టరాదూ అన్నాడు అప్పారావు

ఆఁ? అన్నాడు గుర్నాథం తేరుకుని

ట్రిక్కు లాలోచించి పెట్టరాదా అంటున్నా అన్నాడు అప్పారావు

హుఁ, లైఫే ఓ పెద్ద ట్రిక్కులావుంది

హరినిదుంపతెగా! అడగ్గానే అప్పు దొరకా! ఎంత కోటేసన్నావురా టైము లేదుగాని, తలతాకట్టేసినా అక్షర లక్షలిప్పద్దును అన్నాడు అప్పారావు

ఉండా ఏమిటి నీకు?

అప్పారావు నవ్వాడు అందుకేగదా నీ బుర్ర అప్పడిగాను సరేగాని నువ్విలా నీరసపడి నీరుగారిపోతే ఎలా ఆరుంచావై పోయింది

భానుమతి లోపలికెళ్లి కూర్చుంది ఇంక సినిమా మొదలుపెట్టేస్తారు నువ్వింకా అప్పు గురించి ఆలోచించవు ఎలా?

గుర్నాథం పూర్తిగా మేలుకున్నాడు పరాకులోంచి చిరాకులోకి ఆ క్షణంలో కోపంలో అతనికి అప్పారావు పేరు గుర్తు రానందువల్ల ఇడియట్, ఫూల్ వంటి పేర్లతో వాక్యాలారంభించి, ఈ దుస్థితికి కారకుడు, స్నానం చేస్తున్న తన చొక్కాని తొడిగేసుకున్నవాడూ (చొక్కా స్నానం చేస్తుందా అని విట్టు వెయ్యడానికి అప్పారావు జంకాడు) అందులో డబ్బుని అప్పారావు నాన్నగారి సొమ్ములా ఖర్చుపెట్టేసినవాడూ అంటూ అప్పారావుని పేర్కొని ఇప్పుడు ఎక్కడో అక్కడ అప్పు తెచ్చి టిక్కెట్లుకొనేహక్కు అతనికే దత్తం చేస్తున్నట్లు ప్రకటించాడు ఉదారంగా

చాలా కృతజ్ఞుడని బ్రదర్ కాని ఒక్క పేచిక్కు నేను అప్పడగడం ఆరంభిస్తే ఆగడం తెలీదు అభిమన్యుడిలా అలా చెక్కేస్తూపోవడమే అలా వసూళ్ళు చేసుకుంటూ ఏ చిలకలపూడిలోనో ఆగుతాను అప్పటికి సినిమా మొదలైపోతుంది అదీకాక నాకు అప్పివ్వాలని తహతహలాడిపోతున్నవాళ్లతో ఈ సినిమాభూమి కిటకిటలాడిపోతున్నట్లు తోచదు కాని నీవే అందుకు ప్రయత్నించు వెనుక నా అండదండలు ఉంటూనే ఉంటాయి అన్నాడు అప్పారావు పదిఅడుగుల అవతల ఓ క్రూర అప్పులవాణ్ణిచూసి, హఠాత్తుగా వినమ్రుడై తలవంచుకొని

టిక్కెట్టుకి నేను సీట్లలో రుమాళ్ళు పడేసినవాళ్ళంత ఇవతలకొచ్చి సిగరెట్లు ముట్టించి, 'బుక్ చేసిన సీటు మాజీవితం' అన్నట్టు నిల్చున్నారు గరీవిగా

ఇంతజనాభావుంది లోకంలో నిలీసి తంతే ఒకొక్కడిదగ్గిరా బస్సు టిక్కెట్టుకు పోనూ ఒకటరెండున్నా ఉండకపోవు షూట్ వెళ్లు స్నేహితులనడక్కు పరిచయస్థులు వాళ్ళకన్న మెరుగు జాగ్రత్త నీపర్సు పోయిందట ఇవాళెవ్వరు మాసితీరాలిట ముసలివాళ్ళతో అయితే ఇది నీ షేక్స్పియరు అను పడుచువాళ్ళతో అయితే, కోల్మన్ నీ ఆప్తమిత్రుడని, నువ్వు చూడలేదని తెలిస్తే ఏలోకాన్నున్నా భోర్న ఏడిచేస్తాడని విట్టిగా చెప్పు కొంచెం మొండిఘటం తటస్థపడితే, మాటఅని దగ్గరకుపిలిచి సరస్వతి తోడు అనమని, నీ లవ్ స్టోరీ టూకీగా చెప్పేసి, నూటిగా అడిగెయ్

## ముళ్లపూడి వెంకటరమణ

నీ మహారహస్యం వాడొక్కడికే చెప్పావన్న కృతజ్ఞతకొద్దీ తక్షణం ఇచ్చేస్తాడు దీనికి ఢోకాలేదు నేను వాడిన మీదటే చెబుతున్నాను నాకూ నీకూ తెలిసినవాడైతే ట్రూస్టోరీ—ఏది—అప్పారావుగాడు నీ చొక్కా, దాని తాలూకు జేబూ, అందులో డబ్బూ సమిష్టిగా తగలేసి, ఇప్పుడు తప్పు గ్రహించి, ప్రేమకథలో విలన్ అయినందుకు బాధతో కటుకూ కటుకూ నాలిక్కొరికేసుకుంటున్నాడనీ అది మాన్పించి నాలుకను కాపాడుటకైనా రెండురూపాయలు అప్పు అవసరమనీ చెప్పు నమ్మకపోతే నీకళ్ళలోకి చూడమను వాట్? బట్ దేర్ విష్ యు లోన్ ఇఫ్ యూ టూర ప్లీస అంటూ గద్గద స్వరంతో వీడ్కోలు చెప్పి కంట తడిపెట్టుకున్నాడు అప్పారావు వాన చినుకొక్కసారి ముత్యపు చిప్పలా, తైలకోసం ఖలిం సెట్ మీద మజ్నూలా మనియార్డరుకోసం పోస్టలు గదిలో నీలా భానుమతికోసం బస్సుదగ్గిర మళ్ళీ నువ్వేలా, దిలీప్ కుమార్ కోసం ప్రొడ్యూసరులా, ఎదురుచూస్తూఉంటా కదులు

అని బాధగా తలవంచుకున్నాడు

కింపని గుర్నాథం కాళ్ళు లోభిజేబులో డబ్బులా స్థిరంగా పడిఉన్నాయి

హరీనీ ఇంకా కదల్లేదా ఈపాటికి అప్పు తెచ్చేసి ఉంటావు కథ కదులుతుందీ అనుకుంటూ ఉంటే?

నేను వెళ్ళను నాకు భయం నాకివ్వరు అన్నాడు గుర్నాథం ముక్తసరిగా

హారి పిచ్చివాడా అన్నట్టు నవ్వి హారిపిచ్చివాడా అన్నాడు అప్పారావు ఎందుకలా భయపడతావు వీరంతా మనుషులే మనుషులంతా మంచివాళ్ళే చాలామంది చేబదుళ్ళిస్తారు అదిగో ఆ కుండాయన చూడు అడగడం తడవు ఇచ్చేస్తాడు మళ్ళీ మనం తిరిగి మనం ఇచ్చేదాకా అడగడు ఆ చారల చొక్కావాణ్ని చూడు కనిపిస్తే అప్పు కావాలా అని తనే అడిగేస్తాడు (ఈమధ్య మానేశాడులే) మనం అడిగినపుడు చేత డబ్బు లేకపోతే బెగ్ బారో ఆర్ స్టీలు చేసైనా యిస్తాడు దొంగనోట్లు అచ్చుకొట్టైనా ఇచ్చేస్తాడు అంత మంచివాడు అందులోను ఎవ్వడూ అడగని నీవంటివాడు అడిగితే ఇవ్వననగలవాడెవడు? అడగడం తగవు తక్కువని భయపడకు అప్పులు మహామహావాళ్లు చేశారు జీవితమే ఓ పెద్ద అప్పు ధర్మరాజుగారికో గోజాన రొక్కం కావలసివచ్చి వేళకి జతపడక, భీమసేనుడిని కుబేరుడిదగ్గరకు పంపాడుట అప్పుతెమ్మని తీరా అతను అందాకా వెళ్ళి అడిగేసరికి కుబేరుడు హేమో, మీ అన్న వడ్డీ ఇస్తాడా మరి అన్నాడుట రణరంగంలోనే తప్ప ఋణరంగంలో ఏమంత ప్రతిభాశాలిగాని భీముడు తంపున జవాబివ్వలేక మళ్ళీ భూలోకం వచ్చేసి అన్నా వినమని కథ చెప్పాడు వడ్డీ పుచ్చుకోపోతే మనం అప్పుపుచ్చుకోము అని చెప్పు అని కబురంపాడు ధర్మరాజు— లెంగుకైనా మంగివని కుబేరుడు అప్పుయిచ్చాడు వడ్డీగద్దనీ అన్నాడు ఈట్రిక్కు బలేగా పనిచేసిందిలే అలాగే ఇంకా చరిత్రలో ఎన్నో ఎంచుతిరిగినాగొప్పవాళ్లలో అప్పుచెయ్యనివాడెవడూ? రాక్ ఫెలరుకి ఎంతడబ్బున్నా, జేబులో వేసుకుతిరగడుకదా ఓ అర్ధణా బఠాణీలు కొనబోయినపుడు చిక్కులిస్తే వాడు పుచ్చుకోడుగదా అప్పుచెయ్యకేం చేస్తాడు ఎవడిదగ్గిరా? కర్ణుడు, గుర్నాథనుడి దగ్గర అప్పుచేసి దానాలు ఇచ్చేస్తూ ఉండేవాడు హరిశ్చంద్రుడికి ఇరుగుపొరుగు చక్రవర్తులదగ్గర అప్పు చెయ్యాలన్న ఊహపోకనే, నక్షత్రకుడితో

---

"మిస్టర్ - నీ కుడిదవడ వాచి ఉందేం?"

"మరేంలేదు మా పక్కింటమ్మాయికి ఎడంచెయ్యి బాగా వాటం"

చదరంగం

# "దయచేసి నా మంత్రిని చంపండి"

చదరంగంలో మంత్రి మహా బలసమన్విత మైన మొహరా ఏ ఆటగాడూ దాన్ని పోగొట్టుకోవడానికి ఇష్టపడడు; అయితే చదరంగంలోని చరమాశయం ప్రతికక్షి ఆట కట్టడమే కనుక, ఆ ఆశయసిద్ధికి అనువుగా ఉన్నవాడు ఏ ఆటగాడైనా తన మంత్రిని బలిచేయవచ్చు

రసవంతమైన ఈ క్రింది పరిస్థితి చూడండి



పదిహేడు ఎత్తుల తరవాత ఈ పరిస్థితి ఏర్పడింది తెల్ల మంత్రి శకటు ఎగలో ఉన్నాడు దాన్ని తీసుకెళ్ళి మంత్రి పగలోనికి రాగు 4లో పెట్టడంలో చాలా కిల్లాడితనం ఉంది ఆట సాగిన క్రమం ఇది

18 మ – రాగు 4! మ–గు 4

(18 మ×మ అయితే 19 ఏ×ఏ షా, ఏ×ఏ 20 ఏ×ఏ షా ఆటకట్టు నలుపు తన రా 1లోని ఏనుగును రక్షిస్తూ మంత్రిని కప్పాలి అంతకుమించి ఆట లేదు)

19 మ – మశ 4!

తెలుపు రా 2లోని ఏనుగును కొస్తూనే దాడికి వెళ్ళి 'ధైర్యముంటే నా మంత్రిని చంపు'' అని సవాలు చేయాలి!

19 మ – మ 2

నలుపు రా 1 గడిని అలాగ కొస్తూనే ఉండాలి

20 మ – శ 7

తెలుపు మంత్రిని తీసుకువెళ్ళి జమిలి పగలో పెట్టాడు నలుపు ఏ ఒక్క దానితో కొట్టినా అతని ఆటకట్టు!

20 మ గు 4

21 బ – మఏ 4, మ×బ

22 ఏ – రా 4, మ – గు 4

23 మ×గుబ, రాజీనామా

నలుపు తన ఏనుగునో, మంత్రినో పోగొట్టుకోక తప్పదు దానివల్ల ఆట కూడా పోతుంది ఈ ఉదాహరణలో ఇంకో సొగసు ఉంది ఈ క్రమంలోనే తెలుపు ఎత్తులు వేయాలి పొరపాటు చేస్తే అతని ఆటకే పరిస్థితి ఉంది ఉదా 19 బ – మఏ4?? మ×ఏ 20 ఏ×మ??, ఏ శ 8 షా ఆటకట్టుకు దారి తీస్తుంది

### సమస్య 2కు పరిష్కారం

5 8 59 సంచికలో ప్రచురించిన సమస్యకి సరైన పరిష్కారం చాలామంది పంపించారు వాటిలో మొట్టమొదట మాకు అందినది శ్రీ ఎస్ వీరభద్రరావు (సికింద్రాబాదు) గారిది

కీలకం ఎత్తు 1 గు(రా 5) – గు 4 దీనికి జవాబుగా నలుపు మూడెత్తులలో ఏదో ఒకటి వేయవచ్చు ఏది వేసినా తెలుపు రెండో ఎత్తుతో ఆటకట్టవచ్చు ★

### సమస్య 4

రచన సూరంపూడి భాస్కరరావు

నలుపు (7)



తెలుపు (8)

2 తెగు 1 నశ 3/8/ తెరా తెగు నబ 5/2 నరా నఏ 4/ తెబ నబ నఏ నబ 4/ తె 2 తెఏ 4/5 తెఏ 2/6 తెశ/

తెలుపు ఆడి రెండెత్తులలో ఆటకట్టాలి

# క్రీడారంగం: హాకీ

చాలా ఏళ్ళనుంచి హాకీ ఆటలో అగ్రస్థానం మనదే అయితే 1958 లో టోకియోలో జరిగిన ఏషియన్ చాంపియన్‌షిప్‌లో మనదేశం ఆటగాళ్ళు ఈ కీర్తిని నిలబెట్టుకోలేకపోయారు టోకియోలో జరిగిన మూడవ ఏషియన్ చాంపియన్ షిప్ పోటీల్లో ఫైనల్సులో పాకిస్తాన్‌తో మనజట్టు ఆటగాళ్ళు డ్రా చేశారు అయినప్పటికీ గోల్ సరాసరిపైన పాకిస్తాన్ గెలుపొందినట్టుగా నిర్ణయింపబడింది మనం ఈ పోటీలో సరిగా చూస్తే ఓడిపోలేదని ఎంతో ఎంపదలిస్తే అది అల్పసంతోషమనే చెప్పాలి

ఏ ఆటలోనైనా సమఉజ్జీలయిన ఆటగాళ్ళు పోటీచేస్తుంటే, వారి ఆనాటి అదృష్టంపై జయాపజయాలు ఆధారపడుతాయి అందుచేత ఓడిపోయినంత మాత్రాన వారి శక్తిసామర్థ్యాలనుగూర్చి అవహేళనగా మాట్లాడడం భావ్యంకాదు

1956 లో జరిగిన ఒలింపిక్ ఫైనల్సులో భారతదేశం పాకిస్తాన్ను ఒకగోలు తేడాతో ఓడించారు ఆటలో రెండు పక్షాలవారు సమానమైన నేర్పరితనమునే చూపించారు అదృష్టవశాత్తు మనవారు గెలిచారు హాకీ ఫెడరేషన్‌వారు నెగ్గినదే చాలనుకొన్నారు మనజట్టువారు అవలీలంగా వచ్చే పోటీలలో కూడా నెగ్గుతాం అనే ధీమాతో వారు కూర్చున్నారు ఫెడరేషన్ సభ్యులు దేశంలో ఆట హాయి పెంపొందించేందుకు ప్రయత్నము చేయలేదు

విదేశ పర్యటన మూలంగా ఆటగాళ్ళలో సంఘీభావం, విదేశ వాతావరణంలో ఆడటం అలవడుతాయి అన్నిటికంటె ముఖ్యమైనది, రోజూ మాచ్ ఆడవలసినందున ఆటగాళ్లు అలవాటులో ఉంటారు ఇన్ని లాభాలున్నప్పటికీ మన ఆటగాళ్లను హాకీ ఫెడరేషన్‌వారు



తూర్పు ఆఫ్రికా వెళ్ళిన భారతీయ హాకీ జట్టుకు కాప్టెన్ ఉదమ్‌సింగ్

ఏషియన్ చాంపియన్‌షిప్‌కి ఏ దేశానికి పంపలేదు ఇదేసమయంలో పాకిస్తాన్ జట్టు న్యూజిలెండును పర్యటన చేశారు టోకియో పోటీలకి ప్రఖ్యాతి ఆటగాడైన దిగ్విజయసింగ్ వెళ్లలేకపోయారు వీటినిబట్టి చూస్తే టోకియోలో జరిగిన ఏషియన్ పోటీలలో మనదేశం జట్టు మన ఘనతను నిలబెట్టుకోలేకపోవడం ఏమంత ఆశ్చర్యకరంగాదు

అయితే ఈ పోటీలలో మనం నెగ్గకపోవడం ఫెడరేషన్ సభ్యులలో చాలా ఆందోళన కలుగజేసింది వీరు 1960 లో జరగబోయే ఒలింపిక్ పోటీలలో మన జట్టువారు నెగ్గుటకు వీలయిన ప్రయత్నములన్నీ చేస్తున్నారనే చెప్పాలి ఉన్నత పాఠశాలల్లో చదువుతున్న బాలురలో కూడ ఈ ఆటలో ఆసక్తి పెంపొందించుటకు ప్రయత్నం చేశారు కిందటి ఏడాది హైదరాబాదులో జరిగిన అఖిల భారత హాకీ పోటీలలో మొట్టమొదటిసారిగా ఉన్నత పాఠశాలల జట్టు పాల్గొన్నది

అఖిల భారత పోటీలలో ప్రజ్ఞను కనబరచిన వారిని తర్ఫీదుకు పిలిచారు వీరిలో బాగా నైపుణ్యం చూపిన కొందరిని సెలక్టు చేసి తూర్పు ఆఫ్రికా పర్యటనకు పంపారు ఈజట్టుకు పంజాబు ఆటగాడైన ఉధామ్ సింగు కాప్టన్ ఇతడు ఆటలో మనదేశపు అగ్రగణ్యులలో ఒకడు తూర్పు ఆఫ్రికాలో మనవారు 8 టెస్టు మాచ్‌లు, 18 ఇతర మాచ్‌లు ఆడారు ఆడినవన్నీ గెలిచారు మనజట్టు ఆటగాడైన ఎర్మన్ ఈపర్యటనలో మొత్తం 58 గోలులు చేశారు

ఈపర్యటనలో బాగా ఆడిన వారిని, ఈ మధ్య మనదేశంలో జరిగిన మాచ్‌లలో బాగా ఆడిన వారిని మొత్తం 32 మందిని తర్ఫీదుకు సెలక్టుచేశారు ఇంకా 8 మందిని సెలక్టు చేస్తారు వీరికి తర్ఫీదు ఈనెల మూడవ వారమునుంచి పాటియాలాలో కాని, మద్రాసులో కాని యివ్వబడుతుంది మనదేశంనుంచి ఒక జట్టు సెప్టెంబరులో యూరప్‌లో పర్యటన చేస్తుంది

మనదేశం 1960 సంవత్సరములో జరగబోయే ఒలింపిక్ పోటీలలో నెగ్గుటకు హాకీ ఫెడరేషన్‌వారు తగు ప్రయత్నాలు చేస్తున్నారు

—రావు ★

## ఋణానందలహరి

(13-వ పేజీ తరువాయి)

లేదా పోనీండి అలా నిష్ఠురంగా చెప్పాలి ఐతే క్ యూ ఒక్కయ్యూనే ఏమిటి ధ్రాంతుగా సూటిగా నిర్మొహమాటంగా నిజం చెప్పేవాళ్ళన్నా సత్యాన్ని పాలించేవారన్నా అడపాతడపా ఐదూ పది సర్దేవారన్నా నేను ప్రాణం పెడతానంటే నమ్మండి

నమ్మను అన్నాడాయన

అరే! నిజం? మీ మీద నాకు గౌరవం క్షణక్షణానికి పెరిగిపోతోంది చక్రవర్తిగారూ నన్ను నమ్మకపోతే పోనీ గాని సూర్యాధాన్ని నమ్మండి గొడ్డు జెంటిల్‌మన్ అప్పు కావాలా అని అడిగినా పుచ్చుకుందికి సిగ్గుపడతాడు మనసబుగా రబ్బాయి ఏ వూర్లో గుర్తులేదు లెండి ఇపుడతనికి అర్జెంటుగా టూరుపీస్ కావాలి టి ఎం వో రాగానే ఎడ్రసిస్తే మీకు నేనే తెచ్చిస్తా ఇస్తారుగదూ

ఇవ్వను అన్నాడాయన అప్పారావుని ఎగాదిగా చూసి

ఇవ్వరా! హా! మీకు నిర్మొహమాటమే కాక మంచి హాస్యమురుకూడా ఉందే! చూట్టానికలా ఉన్నా! లెండి బలేవారే టైమైపోతూంది అన్నాడప్పారావు చనువుగా

ఇవ్వను

అదేమిటండీ హాస్యం అయిపోయిందిగా నిజంగా ఇవ్వరేమిటి నన్నెరగరా

ఎరగను

దానికేముంది మనమంతా ఒకే కథలో వాళ్లం ఆపాటి నమ్మకపోతే ఎలా?

నాకు తెలీదు

మీ రిస్తారని చెప్పి పంపాడే!

ఎవడువాడు

ఈకథ రాస్తున్నవాడు

వాడి మొహం ఇవ్వనన్నానని చెప్పు

ఎక్కడో పోకిరి రౌడీ కారెక్టర్లా ఉన్నావయ్యా దాచుకో నీదగ్గర ఎంత డబ్బున్నా ఖర్చు పెట్టేందుకు వీల్లేకుండా చేయించేస్తానుండు హుఁ అంటూ అప్పారావు ఇంకో కాత్రీనిచూసి హలో అని అటు తిరిగి ఓటూరు పీసు—అన్నాడు

"యూంగ్రూ బాషార్ ఒన్‌ఫోర్" అన్నాడు వాడు

ఆలస్యం తగదని, రూపాయపావలా టిక్కెట్లు రెండు, తమ దగ్గిరున్న మూడు రూపాయిలకీ క్లాసులోకా నేసి గుర్నాథం అతనూ హాల్లోకి వెళ్ళిపోయారు అక్కడ స్థిమితంగా ప్రయత్నించి ఇంటర్వెల్‌లోనైనా రూపాయ పధ్నాలుగణాలు కొనుక్కోవచ్చునని (ఇంకా వుంది)



# కథ కాని కథ



## ఎనిమిదేళ్ళనాటిమాట

(మొదటి బహుమతి రూ 10/-)

అప్పటికి మా బాబ్జీ ఏడేళ్ళవాడు మా వారు రాజకీయరంగంలో ఎన్నికైన మనిషి అవడంచేత తరుచుగా ఏ సభకో అధ్యక్షత వహించడమో, ఏ సభకో ప్రారంభోత్సవము చెయ్యడమో జరుగుతూ ఉండేది అలాటి రోజున ఆయన ఏ చంకీదండో, పూలదండో ఇంటికి తెస్తూండడం మామూలు ఆ రోజు ఆయన రెండు సభలకు అధ్యక్షత వహించడం జరిగింది రెండు గులాబీ దండలతో సాయంకాలం ఆరుగంటలకు ఇంటికి వచ్చారు నేనూ, మా బాబ్జీ వీధి వరండాలో నిలబడి ఉన్నాము ఆ పూలదండలు చూడగానే మా బాబ్జీ కేం బుద్ధిపుట్టిందో, "ఏది నాన్నా, ఒక దండ ఇల్లా ఇయ్యి" అని పుచ్చుకుని నా చేతిలో పెట్టాడు మా ఇద్దరికేసీ చూసి నవ్వుతూ "మీ రిద్దరూ పెళ్ళి చేసుకున్నప్పుడు నేను చూడలేదుగా, అందుకని ఈ దండలు మీరు ఒకరి మెడలో ఇంకొకరు వేసుకోండి, చూస్తాను," అన్నాడు కొడుకు కోరినదే తడవుగా మా వారు తన చేతిలో ఉన్న పూలదండ నవ్వుతూ నా మెడలో వేశారు నేను సిగ్గుతో తలవంచుకున్నాను "అదేమిటే, పసిపిల్లవాడు చూస్తానని మురుసుపడితే కొత్త పెళ్ళికూతురిలా సిగ్గుపడుతున్నావు!" అన్నారు మా వారు దానితో నాకు అభిమానంవచ్చి నా చేతిలోని దండ ఆయన మెళ్లో వేశాను అంతలోనే రిక్షావచ్చి గుమ్మంలో ఆగింది మే మిద్దరం అటువైపు తిరిగాము. అప్పుడే ఎక్స్కర్షన్ నుంచి తిరిగి వచ్చిన మా తమ్ముడు చేతిలోని కెమేరాను మా వైపు తిప్పి క్లిక్ మనిపించాడు ఈ వింత చూస్తూ దారే పోయేవాళ్లు పదిమందిదాకా రోడ్డుమీద ఆగిపోయారు. ఇంక లోపలికి వడితే బాగుంటుందని మే మిద్దరం ఇంట్లో అడుగుపెట్టబోతుంటే మా ఆడబడుచు "ఆగండి, కుడిపాదం ముందుంచు వదినా!" అని గట్టిగా నవ్వడం మొదలుపెట్టింది అంతవరకూ ఈ గందరగోళమంతా తెల్లబోయి చూస్తున్న మా అత్తగారు "ఇంకో వయసే తక్కువయింది! మంగళహారతిచ్చి పేర్లుకూడా చెప్పించాలో కాదు," అని పొట్ట చెక్కలయేటట్టు నవ్వడం మొదలెట్టారు. నేనూ, మా వారూకూడా గొల్లున నవ్వేశాం మా బాబ్జీమాత్రం ఉసూరుగా ముఖంపెట్టి "అయితే మా పెళ్లి అచ్చుగా ఇల్లాగే జరిగిందన్నమాట," అన్నాడు

ఎమ్. అన్నపూర్ణ కాకినాడ

* * *

## రమణారెడ్డి కాని రమణారెడ్డి

[రెండవ బహుమతి రూ 5/]

అవి మేము కాలేజీలో చదివేరోజులు మార్చినెల యూనివర్సిటీ పరీక్షలు దగ్గర కొస్తున్నాయి ఒక సోమవారంనాడు మా ఫ్రెండు 'ఆచారి' మా రూముకు వచ్చాడు కాలేజీకివెళ్ళి హాలు టిక్కెట్టు తెచ్చుకుందాం రమ్మన్నాడు సరే వెళ్ళక తప్పుతుందా! బద్ధకంగానే బయలుదేరి కాలేజీ చేరుకున్నాం హాలు టిక్కెట్లిచ్చేచోట అంతా క్యూలో నుంచున్నారు మావాడు ఆ క్యూలో జొరబడ్డాడు నేను ఆ ప్రక్కనే నుంచున్నాను ఒక ఆసామి (హైస్కూలు టీచరట ప్రైవేటు అభ్యర్థిగా బి ఎ పరీక్షకు వచ్చాడట!) హాలు టిక్కెట్లిచ్చే క్లార్కు దగ్గరకువచ్చి "ఏమండీ! రమణారెడ్డిగారూ! నా పేరు భాస్కరరావు, బి. ఏ ఎక్జమినేషను నా హాలు టిక్కెటిప్పిస్తారా" అని అడిగాడు అక్కడ ఉన్న మేమంతా పొట్ట చెక్కలయ్యేటట్లు గొల్లున నవ్వాము దానికి కారణమేమిటంటే ఆ క్లార్కు ముమ్మూర్తులా అచ్చు సినిమా యాక్టరు రమణారెడ్డిని పోలిఉంటాడు కాని అతని పేరుమాత్రము రమణారెడ్డికాదు అంతలో ఆ క్లార్కు తోక తొక్కిన పాములా లేచి ఆ ఆసామిని నానా మాటలు అనేశాడు అంతలో ఆ ఆసామి దిక్కుముఖం వేసి అసలు జరిగిన సంగతి ఇలా చెప్పాడు! అతను కాలేజీకి క్రొత్త హాలు టిక్కెట్లెక్కడిస్తారో తెలీదుపాపం, ఎవరో స్టూడెంటును అడిగితే కౌంటర్ వైపు వేలు చూపిస్తూ అక్కడ హాలుటిక్కెట్లిస్తారని, అక్కడి క్లర్కును 'ఏమండీ రమణారెడ్డిగారూ', అని పేరుపెట్టి సంబోధించాలని చెప్పాడట.

ఇప్పటికీ పత్రికలో రమణారెడ్డి పేరుగాని, రమణారెడ్డి నటించిన చిత్రం చూచినప్పుడుగాని ఈ ఉదంతం జ్ఞాపకంవచ్చి నవ్వుకుంటూనే వుంటాం.

ఆర్. వెంకటరావు—విజయవాడ.

• • •

## నూతన జీవితం

[రెండవ బహుమతి రూ 5/-]

నాకు ఉద్యోగం దొరకగానే మా ఆవిడ కాపురానికొచ్చి కూర్చుంది మా నూతన జీవితంలోని తొలి రోజు జరిగిన సంఘటన నా మధురస్మృతుల్లో ఒకటి ఆ రోజున ఉదయం మా ఆవిడ వంట ప్రారంభిస్తానంది 'సరే' నని బజారుకెళ్ళి కూరలు వగైరా తెచ్చిపడేశాను

పదిగంటలకు వంట పూర్తి అయి, భోజనానికి కూర్చున్నాను అన్నిటితోపాటు కూరకూడా వడ్డించింది రామ, రామ! ఆ కూర నోట్లో పెట్టుకోగానే వాంతివచ్చినంతపనయింది 'ఏంకూర చేసిందా? ఏం వేసి చేసిందా?' అని తెచ్చిన కూరలన్నీ గుర్తుకు తెచ్చుకున్నాను ఊహుఁ 'సరే మొదటిరోజుకదా వంట యింకా చేతకాలేదు కాబోలని మెల్ల మెల్లగా దిగమింగాను. చేసిందేదో చేసింది చాలక 'కూర ఎలాగుం'దని కూడా అడిగింది 'బాగులేదంటే బాధపడుతుం దేమోనని 'బ్రహ్మాండంగా వున్న'దన్నాను ఆమె మరి మాట్లాడలేదు

ఆ వేళ సాయంత్రం యింటికి రాగానే అందిగదా 'మీ నాలికకి రుచీ పచీ తెలియదటండీ? లేకపోతే వెధవకూర తిని బాగుంది బాగుంది అంటారా! మీరు ఆఫీసు కెళ్ళిన తరువాత భోజనానికి కూర్చోగానే కూరతిని వాంతి చేసుకున్నాను,' అని నిలదీసి అడిగింది 'ఓసి పిచ్చిపిల్లా! మొదటిరోజున మొట్టమొదటిసారి నువ్వు వండిన కూర బాగులేదంటే, నువ్వు బాధపడతావేమోనని అలా అన్నాగానీ, నాకూ వాంతి జరిగినంత పనయింది తెలుసా?' అని చెప్పాను

'అది నేను వండిందే మన ప్రక్కింటి (లావుపాటి) పిన్నిగారేమో యిచ్చారు, మీకు తెలీదేమో ఆవిడో కూర యిచ్చింది కదా మరో కూర వండట మెందుకనీ, వంట త్వరలో తెములుతుంది గదా అనీ నే నసలు కూరే వండలేదు' అంది

ఇంక నా బాధ చూడాలి!

పార్నంది వెంకటరత్నం,

—సరివింకాడ అగ్రహారం

పిఠాపల్లి పోష్టు)



# శరత్ చెప్పిన కథలు

## తెనిగింపు. సాంబశివరావ్ బొంబోట్ల



# అయ్యో! నా చెప్పుజోడు!

ఆ రోజుల్లో శరత్ బాబు కలకత్తా లోనే వుంటూండేవాడు. యతీన్ బాసు రోడ్డులోవుండే చిత్రకారుడు సతీశ్ సింహుడి యింట్లో ప్రతీ ఆదివారం సాయంకాలం అనుకున్నటయినుకల్లా అందరూ కలుసుకునేవాళ్లు. ఈ సమావేశాన్ని "రసచక్రం" గోష్టి అంటూ పిలిచేవాళ్లు. శరత్ బాబు తాలూకు ఇల్లుకూడా ఆదరిదాపుల్లోనే వుంది. అందువల్ల అప్పుడప్పుడాయన తరచుగా ఆగోష్టిలో పాల్గొంటూండేవాడు.

ఆవేళ "రసచక్రం" తాలూకు ప్రత్యేక సమావేశం విందుభోజనాల బందోబస్తు కూడా జరిగింది. కులాసాగా-దిలాసాగా విలాసాలతో ఆవేళ సభ్యులంతా కాలంగడిపేందుకన్ని యేర్పాట్లూ జరిగినై. ఈ సమావేశానికి పైవాళ్లుకూడా కొంతమంది ఆహ్వానింపబడ్డారు. శరచ్చంద్రుడు కూడా హాజరయ్యాడు. అప్పుడే మరో కాయన వచ్చారు నటవిహారీముఖోపాధ్యాయ, ఆయన లోపల అడుగు పెట్టూండగానే, "ఏంచిటండీ మీ యేర్పాటు! బయటచూస్తే ఇంతమంది జోళ్లు పడున్నాయి. రాదారీ పక్కనియిల్లు-ఏతల మాసినవాడేనా తప్పి జారి కంటికి నదరుగా వుండే జోడేదయినా కాజేసి, చక్కా యెత్తుకుపోవడంటే మన గతేంకావాలి?- అందుకని బయట గుమ్మంముందు రెవడో బంట్రోతు నొకణ్ని కూచో బెడ్తే సరి!" అన్నారు ముఖం కొంత చిట్లిస్తూ.

వెంటనే శరత్ బాబు అందుకుని, "అవునండోయ్, అదీనిజమే ఆ బంట్రోతును ఇవ్వాళే యీతుణంలోనే యిక్కడ కాపలా వుంచడం మంచిది" అంటూ ఆయన చెప్పిందానికి ముక్తాయింపు వాయించాడు.

ఆతర్వాత మరి కొంతసేపటిదాకా అన్య విషయాలపైని యేవేవో చర్చలు కొనసాగాయి. నటవిహారీ లేచి శరత్ బాబువద్దకు వచ్చి, "శరత్ దా, సభ ఆరంభమయ్యేందు కింకా కొంతసేపు పట్టేలావుంది. అంతవరకూ మీకథే యేదయినా చెప్పండి వింటాం" అన్నాడు.

"అయితే యేకథ చెప్పమంటారు చెప్పండి" ఎదురుప్రశ్న వెంటనే వేశాడు శరత్ బాబు.

"మీచిత్తం వచ్చింది"

"అలాగా! అయితే మీరింట్లో అడుగు పెడుతూనే ఓఅపశకునంమాటన్నారు జ్ఞాపకముందా? జోడు దొంగతనం సంగతి. అదే కథ చెప్తా వినండి" అంటూ శరత్ బాబు కథ నిలా ఆరంభించాడు:

"అప్పట్లో నేను శివపురంలో వుంటూండే వాణ్ని. ఓనాడక్కడి మనోమ్హన్ థియేటరుకి సినిమాచూడాలని వెళ్లాను. ఆవేళ వేస్తున్న చిత్రం నేనురాసిన "అంధేరేఆలో" కథ ఆధారంతో తయారైన ఫిల్ము. నన్ను చూడగానే ఆ సినిమా థియేటరు యజమాని ఖుద్దున్న వొచ్చి నన్ను ప్రశంసాపరంపరలతో ఆకాశం పైకెత్తేయటం మొదలెట్టాడు. "బాక్స్" సీట్లో దిండూగిండూ అంతాపరిచి నేను కూచునేందుకు కావలసిన జాగ్రత్తలన్నీ తీసుకున్నాడు. నాకు సినిమాహాల్లో కూచున్నట్టు లేదంటే నమ్మండి. ఏదో మాయింట్లో మంచంమీద కోరగిల బాగ వాలి నట్టుంది. అంత హాయిగావుంది. వాసీటు రెండు కాళ్లూ పైనిపెట్టి విశ్రాంతిగా కూచుని సినిమా చూశాను.

కాని ఆట ఇక పూర్తయిపోతుందనగా, చూసుకునేసరికి, దానిల్లు బంగారంకాను, నా చెప్పుజోడొకటి కనిపించలేదు. అంతకు రెణ్ణాళ్లక్రితమే డిజైను బావుందిగదా అని యెంచుకుని, యెంచుకుని కోరి కోరి దాన్ని కొన్నాను. అందువల్ల అది కాస్త కనిపించకపోయేసరికి నా ప్రాణం కొంచెం పోయినంత పనయింది. మనసంతో చివుక్కుమంది.

సినిమాహాలు యజమాని కీథోరట్టా తెలిసి గబగబా ఒక్కదౌడులో నడిగత్తు కొచ్చి, నుమషుల్ని పిలిచి ఆ హాలంతట్నా కలయ వెతికించాడు. కాని అదసలు అక్కడుంటేగా కనిపించడానికి! ఏ మహానుభావుడో అదివరకే ఎప్పుడో దాన్ని పుణ్యం కట్టుకున్నాడు. కాని ఒక్కజోడు తీసుకెళ్లి యేంచేసుకుంటాడు వాడిబొంద! ఇది అక్కడున్నవాళ్లందరికీ ఆశ్చర్యమనిపించింది.

సినిమాహాలు యజమాని పాపం సిగ్గుతో చచ్చిపోయినట్టున్న మొహంతో నాదగ్గర కొచ్చి, "పోన్లెండి బాబూ, ఏదవజోడు పోతేపోయింది-ఇంతకన్న మంచిజోడిప్పుడే కొని తెప్పిస్తానుండండి" అన్నాడు.

"అబ్బే-మీదగ్గర వున్న కొత్తవదేం కావుంటుందండీ?" అన్నాను.

"అదేమిటండీ అలా అంటారు! మీజోడు మాహాల్లో వుంటూండగా పోయింది, గాబట్టి కొత్తది కొనివ్వడం పూచీ మాది. ఇందు కభ్యంతర పెట్టకండి" అన్నాడాయన.

ఊహూ, వీల్లేదండీ. జోడు కొట్టేసిన వాడెవడో దొంగ వెధవ. అలాంటిది నాకి తెలు మీరనుభవిస్తామంటారేమిటి?-నేనొప్పుకోను సుమండీ మరోమాట-అన్నట్టు మిగిలిపోయిన రెండోజోడు నేనే పట్టుకెళ్తాను-

ఇది విని అక్కడున్నవాళ్లంతా నిర్ఘాంతపోయి—"శరత్ దా, ఈ వొక్కజోడూ పట్టుకెళ్లి యేంచేసుకుంటారు? ఇదేం పనికొస్తుందా, పోదూ!" అంటూ పెదిమలు విరిచారు.

"అబ్బే—అదికాదు. పోయినజోడు కాజేసిన పెద్దమనిషెవడో యిక్కడే ఎక్కడో వుంటాడు. ఆ వొక్కజోడూ వాడికెక్కడా ఎందుకూ పనికిరాదు. అందుకని నేను మిగతా జోడుకూడా ఇంకెందుకని ఎప్పుడు పారేసి పోతానా, ఎప్పుడు దాన్నికూడా కాజేద్దామా అని ఎదురుచూస్తూ వుంటాడు. కాని నేనంత మీదుమీదుగా వాడి కందనిస్తానా? దార్లో ఏ గంగానదిలోనో పారేసి మరీ పోతాను" అన్నాను.

నా మాట లాలకించి అక్కడున్న వాళ్లంతా పక్కున నవ్వారు. కాని నేను మాత్రం తామర్లా అనుకోకుండా ఆ మిగిలిపోయిన రెండోజోడు నా చంకలో పెట్టుకొని చక్కాపోయాను. దార్లో దాన్ని గంగానదిలో పడేసి మరీ ఇంటికెళ్లాను. అప్పటికి గాని నా జోడు దొంగతనం చేసినవాడిమీద కసితీరలేదు.

ఆ మర్నాడుదయం, నేను పక్క... నుంచి అప్పుడే లేచి హాల్లో కూచుని ... తాగుతున్నాను. అంతలో ఎవరో ఆసా...

# శరత్ చెప్పిన కథ

వొచ్చి "శరత్ బాబుగారిల్లు ఇదేనాండీ"? అంటూ అడిగాడు.

"ఆ— నేనే శరత్ ని" అన్నాను.

అతగాడు వెంటనే నాకు నమస్కరించి, నా చేతికో వుత్తరం అందించాడు. ఆ వుత్తరాన్ని సినీమాహాలు యజమాని పంపించాడు. దాంట్లో ఇలా వుంది

"పోయిన రాత్రి హాల్లో మీ జోడొకటి కనిపించలేదు అందుకని నేనుపడ్డ అవమానం అంతా ఇంతా అని చెప్పలేను. రాత్రంతా కంటిమీద కునుకు లేదంటే నమ్మండి. తెల్లవారడంతోనే థియేటరుకి పరుగెత్తుకెళ్లి కళ్ళు గ్యాస్ లైట్లు చేసుకుని హాలంతా మళ్లీ కలయ వెదికాను మీ జోడు మీరు కూర్చున్న సోఫాకి కాస్త దూరంలో పడుంది. దాన్ని భద్రంగా ఈ ఆసామీ చేత పంపిస్తున్నాను మీ జోడు మా సినీమాహాల్లో పోయిందనే అపఖ్యాతి మాకు తప్పింది అది మాకు కాస్త సంతృప్తి కలిగించింది. తతిమ్మా జోడను మీరు గంగానదిలో పారేయలేదనే అనుకుంటాను"

వుత్తరం చదవడం పూర్తికాగానే అతగాడా దిక్కుమాలిన జోడుని నాకందించాడు. దాన్ని చూసేసరికి నా వొళ్లంతా పాములూ, తేళ్ళూ పాకినట్టయింది. నా తెలివి తెల్లారినట్టే అయింది రాత్రి కాస్త నిదానించి, ఆ జోడు గంగానదిలో పారేయకుండా వుంటే ఇప్పుడెంతో పనికొచ్చేది గదా అయినా ఇప్పుడదంతా ఆలోచించి ప్రయోజనమేమిటి?

దాన్ని మళ్ళీ ఆ మనిషికే ఇచ్చేస్తూ, "యిదుగో అబ్బాయ్, ఇప్పుడీ జోడు నాకెందుకూ పనికిరాదు నిన్న రాత్రి సినీమాహాలు దగ్గర్నుంచి ఇంటికొచ్చేప్పుడు దీని జత జోడుని గంగలోకి విసిరేశాను నువ్వెళ్ళేటప్పుడు దీన్ని కూడా దాంట్లోనే పారేసిపో, నీకు పుణ్యముంటుంది" అన్నాను విసుక్కుంటూ అర్జున విషాదయోగాన్ని అనుభవిస్తూ."

ఒకరు "మా అమ్మాయి సంగీతం మా యింటి భాగ్యం అనుకోండి"

ఇంకొకరు అదెలా?"

"దాంట్లోనే గదండీ మరి ఇరుగుపొరుగు వాళ్లు కొంపలు తెగనమ్మింది, తక్కువలో నేను కొన్నదీను.."

# కీటక పత్రిక

# ఫ్లిట్ విషముతో లక్షలాది నల్లుల మృతి!



దాలమంది నల్లులకు లేవడానికైనా అవకాశము లేక పోయింది అని తెలుస్తోంది! ఈ మహా విపత్తుకు నల్లి జాతి ప్రాణ భయముతో అటుడికినట్లు ఉడికిపోతోంది




## నల్లి జాతిలో అల్లకల్లోలము

పదకటింటి జిల్లాకల్లా గొప్పవారుండే భాగమని పేరుపడిన పరుపులవారి కాలనీలోని నల్లులను నిన్న పట్టపగలు ఫ్లిట్ క్రూరముగా హత్యచేసింది.

ఈ గొప్ప ఆపదవచ్చిన సమయములో చాల నల్లులు పక్కల్లో పడుక్కొని గాఢంగా నిద్రపోతున్నాయి. ఫ్లిట్ కీటక నాశిని ఎంతో త్వరితముగా పనిచేయుట వలన




స్టాండర్డ్ - వాక్యూమ్ ఆయిల్ కంపెనీ (పరిమిత మైన బాధ్యతతో యు.ఎస్.ఏ. లో సంస్థాపితము)



బి వి నరసింహం

నేనాంధ్రుణ్ణి! నూటికి నూరుపాళ్ళూ లేక పదహారణాల (నూరు నయాపైసల) ఆంధ్రుణ్ణి అంటే ఇంకా బాగుంటుందేమో! ఎందుచేతంటే ఆంధ్రేతరుల వద్ద 'నేనాంధ్రుణ్ణి' అని చెప్పుకునేందుకు సిగ్గుపడతాను ఎవరేనా పైభాషవాళ్లు "నువ్వు మద్రాసీవా" అంటే ఔనంటాను కాకు 'తెలుగువాణ్ణి' అని మాత్రం చెప్పను వీలయినంతమట్టుకు నాది ఏ భాషా, ఏ జాతీ కానట్టు నటిస్తూ ఇంగ్లీషులోనో, లేక వచ్చీరాని హిందీలోనో మాటాడతాను. తీరా ఎదటిమనిషి "మీదేభాషయ్యా" అని అడిగితే పెద్దకబుర్లు చెబతాను "ఏ భాషైతేనేం! మనం ముందు భారతీయులం తరవాత ప్రాంతీయులం" అంటూ భారతదేశ సమైక్యతగురించి, పెద్దపెద్ద లీడర్లని అనుకరిస్తూ ఓ పేద్ద లెక్చరు ఉపక్రమిస్తాను ఇంగ్లీషులోనో లేక వచ్చీరాని హిందీలోనో! వేసిన ప్రశ్నకు మాత్రం 'నేనాంధ్రుణ్ణి' అని సమాధానం యివ్వను వీలయినంతమట్టుకు వాదించి ఎదటవాణ్ణి నా దృక్పథానికి తీసుకురావడానికి ప్రయత్నిస్తాను నాతో ఏకీభవించకపోతే, 'శుద్ధమూర్ఖుడు' అని వొదిలేస్తాను. తీరా నేను 'తెలుగువాణ్ణి' అనేస్తే నా గౌరవానికి భంగంరాదూ! ఎందుచేతంటే 'తెలుగువాణ్ణికాను' అని యితర్లు భ్రమ పడ్డంలోనే ఉంది, నా గౌరవం! అందుచేత ప్రయత్నపూర్వకంగా నేనాంధ్రుణ్ణి అని యితర్లు పసికట్టకుండా చేస్తాను!

నే నెప్పుడూ అన్నయ్యలకీ, తమ్ముళ్ళకీ, నాన్నకీ, చివరకి అమ్మమ్మకి ఇంగ్లీషులోనే ఉత్తరాలు వ్రాస్తాను అమ్మమ్మకి ఇంగ్లీషు ఉత్తరాలు ఎలా అర్థమవతాయంటారేమో! అన్నయ్య లున్నారుగా అర్థం చెప్పటానికి! పైభాషలవాళ్లలాగా నేనకూడా 'మాతృభాష'లోనే ఉత్తరాలు వ్రాస్తే నా గొప్పతనం ఏమిటి? ఇంగ్లీషులోనో, ఇంక కొందరికి హిందీలోనో అందరికీ ఉత్తరాలు వ్రాస్తేనే ఉంది నా ప్రత్యేకత!

రైలుబళ్ళల్లో, బస్సుల్లో, బజార్లో, చివరకి నడివీధిలో స్నేహితుడు కనబడితే "నమస్తే సాబ్" లేక "క్యాంభాయ్ సబ్ ఠీక్ హై" అంటూ పలకరిస్తాను 'నమస్కారం పంతులుగారూ అంతా కుశలమా' అంటే ఎగుటివానికి అవమానంకదూ! అలాంటి అవమానంతోటి ఆంధ్రునికి కలుగజెయ్యటం నాకు భావ్యమేనా? అందుచేత, అలాంటి అక్రమానికి ఎప్పుడూ పూనుకోను!

అది మామిడికాయల కాలం బస్సులో ప్రయాణం చేస్తున్నాను అందులో ఉన్న వాళ్ళంతా ఆంధ్రులే అందులో చాలమంది తోపాటు నేనూ ఆంధ్రుణ్ణి కానట్టు నటిస్తాను. ఇంగ్లీషులో మాటాడతను కాని మాటల్లో గభీమని ఇంగ్లీషుపదం దొరక్క తికమక పడతాను ఆఖరికి 'తెలుగువాణ్ణి' అని బయట పడిపోతాను కూడా"

This Year Good Crop of Man goes Excellent We prepared Four Hundred? Four Hundred?

'అవకాయ! మాట దొరక్క గభీమని తెలుగు మాట అనేసి నాలిక్కొరుకుంటాను 'పికిల్' అన్నమాట సమయానికి జ్ఞప్తికి రానందుకు—అందరూ నవ్వేస్తే నేనూ నవ్వేస్తాను అందులోనే ఉంది నామజా!

సర్వసాధారణంగా ఉద్యోగంలో, చిన్న పదవిలో ఉన్నాననుకోండి నన్ను ముంచేసేనంత గర్వం నాకొచ్చేస్తుంది నన్నేం చెయ్యమంటారు చెప్పండి! పదిమంది నా దగ్గరకొచ్చి "అయ్యా! మీవల్ల యీ పని కావాలి" అని బతిమాలేసరికి నాగర్వం హద్దులు దాటపోతుంది "వెళ్ళవయ్యా" అని కసిరేస్తాను "దొరగారు ఏం లేకుండా నే, నీపనిచేస్తారా" అంటాను అర్థోక్తిగా వాడి జేబులవేపు చూస్తూ వాడి నాకు ముట్టచెప్పేసరికి, "ఇదుగో వెంటనే ఐదు నిమిషాలు ఓపికపట్టండి మీపని అయిపోతుంది," అంటాను ఇంక పెద్ద హోదాలో ఉన్న పదవి దొరికిందనుకోండి నా తడాఖా మీరే ఆలోచించుకోండి పిండికొద్దీ రొట్టె అన్నారు పెద్దలు!

నేన తెలుగువాణ్ణి కనక తోటి తెలుగువాడు బాగుపడ్డం, ముందుకిరావడం, అంటే నాకు కడుపుకుంట సాధ్యమైనంతవరకూ,

## అలవాటు

మా వీధి చివర ఒక రిటైరైన మిలిటరీ ఆఫీసరు వుండేవారు ఆయన మార్నింగ్ వాక్ కలిసి వచ్చేటట్లు రోజు స్వయంగ పాలు తెచ్చుకునేవాడు. ఆయన నడుస్తూ వుంటె మార్చింగు చేస్తున్నట్లే వుండేది అలవాటు పాపం!

ఒకరోజున ఆయన వస్తుంటే వెనకాల కొంటెకుర్రవాడొకడు వస్తు లెఫ్టు రైటు లెఫ్టు రైటు అనడం మొదలుపెట్టాడు ఆయన అసలే అలవాటుపడ్డాడేమో. మరింత మార్చింగు మొదలు పెట్టాడు ... రోడ్డుమీద నడుస్తున్నసంగతి మరిచిపోయి

అలా రెండు నిమిషాలసేపు అని. ఆకుర్రవాడు అమాంతంగ. "హాల్ట్." అన్నాడు దాంతో ఆయన అటెన్షన్ పొజిషన్ లోకి వచ్చి రెండు చేతులూ రెండు కాళ్ళకు "రఫీ" మని కొట్టాడు చెంబు వదలి పాలచెంబు కిందపడ్డ ధ్వనికి గాని ఆయన మైకం వదల్లేదు

ఆయన్ని చూస్తే నవ్వాగక ఇంట్లోకివచ్చి పొట్ట పుబ్బేటట్టుగా నవ్వుకున్నాను

"సరళ"

...చేతులో ఉన్నంతవరకు బాగుపడకుండా పత్నిస్తాను అనకోండి అయితే ...ందరు బాగుపడిపోతారు వాళ్ళని ఎలా ...నా ప్రాతోయ్యాపమే నా జీవిత పరమా ...ధి నా మత్సరం హద్దులుదాటిపోతుంది ...నా కార్యానికి అప్పుడు ఉపక్రమిస్తాను

“అనుకరణ” నాకు ఉగ్గుపాలతో వచ్చిన ...ద్గుణం పెద్దవాణ్ణయినా ‘అనుకరణ’కి మాత్రం చిన్నపిల్లణ్ణే అనుకోండి నా కెప్పుడూ పై భాషల రచయితలమీదే ...ంటాయి వాళ్ళ అలవాట్లు, వాళ్ళ సార ...స్వతం, వాళ్ళ గొప్పలు, డాంబికాలు, తెలుగులోకి అనువదిస్తాను అందులోనూ బెంగాలీవాళ్ళ “చేపలు” నాకెంత రుచి అనుకొన్నారు? తింటే బెంగాలులోని మురికిగుంటల్లోని చేపలే తినాలి! తెలుగు నాడులోని స్వచ్ఛమైన నదీజలాల్లో పెరిగిన చేపలకు వాటి రుచి ఎలా వస్తుంది మీరే చెప్పండి?

సినిమా పాటల్లో, కర్ణాటక సాంప్రదాయం ప్రకారం, పాడిన సంగీతం అంటే నాకు తలనొప్పి. వింటే హిందీ సంగీతమో లేదా మరాఠీ సంగీతం వినాలి ఆ “సెల్సు”ల'కి తెలుగుపాటలు దింపాలి అవి నాగేశ్వరరావు, ఎన్ టి రామారావు, సావిత్రీ పాడితే వినాలి! అప్పుడే ఆనందం అప్పుడే ఆంధ్రుణ్ణైన నా జన్మ తరిస్తుంది

నేనే సినిమా డైరెక్టరనయితే (అంత అదృష్టం నాకు లభించదనుకోండి) లతా మంగేష్కర్ కి లక్ష రూపాయలిచ్చి తెలుగు భాషలో హిందీ స్టైల్సులో ప్లేబాక్ పాడిస్తాను లేదా, తలత్ ని, మహమ్మద్ రఫీని, లేక ఆత్మానికొనిరప్పిస్తాను వాళ్ళ గూబలు నలిపి (కొట్టిచ్చే అనకోండి) తెలుగు మాటల్లో హిందీ సంగీతం పాడిస్తాను. ప్రొడ్యూసర్, డైరెక్టర్, యాక్టర్ అవి విరచిస్తాను నా సినిమాలు అప్పుడు ఆంధ్రదేశంలో శత దినోత్సవాలు జరుపుకుంటాయి!

మా వూళ్ళో ఎనిమిది సినిమాహాల్సు ఉన్నాయి అందులో ఆరింట్లో హిందీ సినీమాలు, రెండింట్లో తెలుగువి జనప్రవాహం అంతా హిందీ సినిమాలకే అందులో నేనూ ఉన్నానని వేరే చెప్పక్కర్లేదు “ఛమాస్తే హిందీ సినిమాలే చూడాలి” అనేవాళ్ళల్లో నేనొకణ్ణి! హిందుస్తానీవాళ్ళూ బెంగాలీలు, గుజరాతీలు, ఏ ప్రాంతంవారైనా సరే మన తెలుగు సినిమాలు, ఉత్తమోత్తమమయినవి, ఎంతమంది చూస్తున్నారు? పైప్రాంతాలలో (తెలుగు వాళ్ళు తప్పించి) యితరభాషలవాళ్ళు

# నేనాంధ్రుణ్ణి

ఎంతమంది 'తెలుగు' సినీమాలు చూస్తున్నారు నేను ఆంధ్రదేశంలో వుండే 'హిందీ' సినీమాలు చూస్తున్నట్టు అన్న ప్రశ్న నాకెప్పుడూ తట్టదు

ఆంధ్రుల ఏకైక రాజధాని హైదరాబాదులో "టాగూర్ వర్ధంతి" అట్టహాసంగా జరిపిస్తాను. కాని అతని కవిత్వ మహిమకి ఏమాత్రం తీసిపోవని కళాతపస్వి, చిత్రకారుడు శిల్పి, గాయకుడు, తెలుగువారు "మావాడు" అని గర్వంగా చెప్పుకో తగిన స్వర్గీయ అడివి బాపిరాజుగురించి మాత్రం ఒక్క నాటికీ తలవను. అంగులో నే ఉంది నా తెలుగుదనం! నా గొప్పదనం!

నా సంగతి, వివరాలు మీకు తెలీదేమో! నేనొక ఉన్నత పాఠశాలా విద్యార్థిని! అబ్రహామ్ లింకన్ వర్ధంతి జరిగినప్పుడు స్వాతంత్ర్యవీరుడని గంటలకొద్ది ఆయన్ని గురించి లెక్చర్లు యిస్తాను ఆల్ ఇండియా రేడియో, హైదరాబాదు ద్వారా నా గొప్పతనం అందరికీ వినికిడి అవాలని ప్రసారితం చేస్తాను! తెలుగువారిలో స్వాతంత్ర్య సమరంలో సర్వం గోల్పోయి 'స్వతంత్రం కోసం, వీరస్వర్గమలంకరించిన నాయకు లెంతమంది?' వారి గురించి యింతవరకు ఎన్ని లెక్చర్లు ఏర్పాటుచేసేను అన్న ప్రశ్న నాకు తట్టదు అదే తడుతే నే నాంధ్రుణ్ణే కాను.

నా పేరు మీకు తెలుసుకోవాలనిఉందా? తెలుసుకోండి! "లెనిన్!" నవ్వుతారా? "నవ్విపోదురుగాక నాకేటి సిగ్గు" అన్నాడో కవి! లెనిన్ ఆదర్శజీవి రష్యన్ అయినంత మాత్రాన ఏం! నేనాపేరే పెట్టుకొన్నాను. వెక్కిరిస్తారా? "గాంధీపేరు పెట్టుకో వచ్చు? లెనిన్ పేరు పెట్టుకోకూడదా?" అని వాదిస్తాను అంతగా మీరు వాదనకి దిగితే! మీరనుకొంటే తోటి ఆంధ్రులే కనక అలాగ వాదించరని నా విశ్వాసం!

నాకింకా ఎన్నెన్నో సుగుణాలున్నాయి. మీకు తెలీదేమో! అందులో మొదటిది బుజాలు తడుముకోడం! నా సుగుణాలన్నీ చదివి "అవి లోపాలా" అని బుజాలు తడుముకొన్న ఎవరైనా సమర్థించుకునేందుకు నన్ను విమర్శించబోతారనుకొండి.

"నిశ్చయంగా లోపాలే" అని ఢంకా మీద దెబ్బకొట్టి చెప్పే "ఆంధ్రుణ్ణి" నేను.

## కొద్ది సన్‌లైట్ చాలా బట్టలను ఉతికింది

-అట్లు చేసినట్టిది దాని అధిక నురగ




**సన్‌లైట్ సబ్బు బట్టలను తెల్లగాను కాంతిగాను ఉతుకును**

S/P. 2-X52 TL

హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్ వారి ఉత్పత్తి



"ఆమె జమున. తెలియనట్టు అడుగుతున్నావే?" అని ప్రశ్నించాడు.
"ఆమె కాదండి, యీమె" అని తిరిగి అడిగింది శోభ.

అన్నాడు ప్రభాకర్.

ఇంతలో లైట్లు తిరిగి ఆరిపోయాయి చీకటి ఆవరించింది—శోభలో కూడ

సినిమా నడుస్తూంది శోభ మనస్సు శీఘ్రముగా పరుగిడుతూంది ఏవో ఆలోచనలు తిగముకు వస్తున్నాయి ఎలాగైతేనేం సినిమా పూర్తయింది. ప్రభాకర్, శోభా వార్డి చేరుకున్నారు ఆ రాత్రి సుఖంగా నడవలేదు

* * *

మరుసటిరోజు ప్రభాకర్ కాలేజీకి వెళ్ళిపోయాడు శోభ కెంగుచేతో ఆ రోజు చురుకుగా లేదు తన సంగీత చిత్ర లేఖనాలలో ఆసక్తి చూపించలేదు ఏవో పుస్తకాలు చూస్తూంది, టేబిలుదగ్గఱ నిలబడి. టేబిల్ పైని పుస్తకాలు గులుపుతోంది అక్కడక్కడ పుస్తకాలు పేజీలు త్రిప్పుతూంది. ఓ కెమిస్ట్రీ పుస్తకములో ఒక కార్డు సైజు ఫోటో ఆమె కంటబడి ఆమె నేత్రాలని ఆపింది ఆమె తిరిగి పేజీ త్రిప్పి ఆ ఫోటోను నిదానంగా చూసింది ఫోటోలో అమ్మాయి ఎవరు? ఇంకెవ్వరు? సినిమాలో రాత్రి తారసిల్లిన అమ్మాయే సరోజ! ఆమె మనసులోని ఆవేశాల్యములు పగ్గాలు తెంచుకుని పరుగెత్తుతున్నాయి ఆమె చేతులలో నుండి కళ్ళెములు జారాయి ఆమె అనుమానం మరింత విషపూరితం అయింది ఆమె మనస్సు మేఘావృతమై బరువెక్కింది దగ్గరగానున్న పేము కుర్చీలో కూలబడింది.

నాలుగైంది. ఎండ వేడిమి తగ్గి చల్లబడింది శోభకి ఉష్ణోగ్రత తగ్గి తిరిగి తెలివి తెచ్చుకుంది. గదిలోనుండి హాలులోనికి వచ్చి పచార్లు చేస్తోంది తన వస్తువులను ఒక నూతన వ్యక్తిలాగ నలుమూలలా కొత్తగా చూస్తోంది నలుమూలలనున్న వస్తువులు మారిపోయాయా? తను మారిపోయిందా? అనేది ఆమెకొక ఆలోచన

ఇంతలో ప్రభాకర్ ఆ రోజున ఎంగుకో తొందరగా వచ్చాడు శోభకోసం నేరుగా మేడపైకి వచ్చాడు. హాలులో ఒక మూల శోభ ఏదో ఆలోచిస్తూ కూర్చుంది ప్రభాకర్‌కి ఆ వాతావరణం కొత్తగా ఉంది

"ఏంశోభా! ఏమిటిది? ఈ కూర్చోడం ఏమిటి? ఏం వచ్చింది?" అని ప్రభాకర్ ప్రశ్నించాడు.

కాని ఆమె మనస్సు అక్కడ లేదే జవాబు చెప్పేందుకు రెండోసారి గట్టిగా అడిగాడు.

ఆమె దృక్కులు అతనివైపు తిరిగాయి. గాని జవాబు లేదు రానినవ్వు ఆమె పెదవులని వేధిస్తోంది.

"ఏమీ లేదు ఆఁ ఏదో తలనొప్పిగా ఉంది," అంది శోభ ముభావంగా

ప్రభాకర్ మాత్రం నమ్మలేదు. 'ఆఁ అది కాదు,' అన్నాడు

'అది కాకపోతే మీరే చెప్పండి. మీకు అన్నీ తెలుసుగా' అంది శోభ

'తెలిసినా చెప్పే శక్తి వుండొద్దూ!' అన్నాడు ప్రభాకర్ అప్పటికి శోభకి కొంత శక్తి వచ్చింది.

"శక్తి లేకపోతే చేసేవన్నీ ఎలాగు చేస్తారు? భౌతిక రసాయనిక శాస్త్రజ్ఞులంతా, చూడ్డానికి కూడ శక్యంకాని పరమాణువులో నున్న ఒక భాగంనుండి అపరిమితమైన శక్తిని ఎలా పుట్టింపజేస్తున్నారు?" అంది ఉపన్యాస ధోరణిలో శోభ.

ప్రభాకర్‌కి ఏమీ పాలుపోలేదు. వ్యవహారం కొత్తగా కనబడుతూంది.

# తొలగిన మబ్బు

'ఏమిటికథ శోభా?' అన్నాడు ప్రభాకర్ దగ్గరికి వస్తూ.

జవాబులేదు—శోభ నోటినుండి ఆమె ఆమెచేతిలో ఇంకా 'కెమికల్ ఎనర్జీ' అనే పుస్తకముంది.

నలుమూలలా హాలులో గలయచూశాడు ప్రభాకర్ ఓ ప్రక్కన వీణగుడ్డ ప్రక్కగా పడివుంది మరోప్రక్క రంగుల డిప్‌లు, రంగులూ క్రిందపడి చెల్లాచెదరయి యున్నాయి ఉదయము స్టాండ్ పై నున్న చిత్రమునంగు తేలికగానున్న నీలిమబ్బులు దట్టమైన నలుపు రంగుతో బరువెక్కినట్లు కనబడుతున్నాయి వాతావరణంలో ఒక్కసారి తెలియనిమార్పు వచ్చినట్లనిపించింది.

ప్రభాకర్ యీ గాలి దుమారం దాటేందుకు, ఆలోచనమార్చి "కాఫీ తయారయిందా శోభా?" అని అడిగాడు

"క్రిందకుపడండి" అని ముక్తసరిగా జవాబు వచ్చింది శోభనోటినుండి

అదె పనివేలు ప్రభాకర్ కి ఇద్దరూ క్రిందకి దిగారు డికాక్షన్ ఓ ప్లాస్కునుండి గ్లాజుగ్లాజులోనికి పోసింది. మరోప్లాస్కులో నున్న పాలని మరోక గ్లాసులోనికి పోసింది. కాని పాలు విరిగి ముక్కలు, తెల్లని నీరుగా మారినాయి

"పాలు విరిగాయే" అంది శోభ ఏమీ చేయడానికి తోచక

'ప్రకృతి మనసుతోపాటే ఏమీ విచారించకు, పాలమనిషి వస్తుందిలే తొందరలేదు' అన్నాడు ప్రభాకర్

ఇంతలో తలుపు చప్పుడు, పాలమనిషి కేకలు వినబడాయి శోభ పరుగెత్తుకునివెళ్ళి తలుపు తీసింది

పాలమనిషి, తర్వాత సరోజ.

పాలుపోయించుకుని 'రా సరోజా' అనగలిగింది శోభ

సరోజ భయపడుతూ రెండడుగులు హాలులోనికి వేసింది

'నా పేరు మీకెలా తెలుసు?' సరోజ అడిగింది.

'నేను తెలుసుకున్నానులే నీ చరిత్ర' అంది శోభ సరోజ నిర్ఘాంతపోయింది

'లెక్చరర్ గారు లోపల ఉన్నారా?' అనడిగింది సరోజ

'ఆ ఉన్నారు' జవాబు

'ఈమధ్య లెక్చరర్ గారినడిగి ఓ పుస్తకం నేనింటికి తీసుకువెళ్ళాను అందులో పొరపాటున మా తమ్ముడు నా ఫోటో ఉంచాడట అందులో ఉంటే తీసుకువెళ్దామని వచ్చాను' అని చెబుతూ ఉండగానే ప్రభా

కర్ లోపలినుండి హాలులోనికి వచ్చాడు.

'ఏం సరోజా యిలా వచ్చావు పని మీదా?' అని అడిగాడు ప్రభాకర్

'నమస్కారమండీ మాస్టారూ' అని ప్రారంభించింది సరోజ

ఈలోగా శోభ అందుకొని సరోజ చెప్పిన దానిని పూర్తి చేసింది చిరునవ్వుతో.

ప్రభాకర్ కూడా చిరునవ్వుకి చిరునవ్వుతో సమాధానమిచ్చాడు 'ఇదా!' అనిమాత్రం అనగలిగాడు ప్రభాకర్.

శోభ యింతలో లోపలికివెళ్ళి కాఫీకలిపి, రెండు గ్లాసుల కాఫీ ట్రేలో పెట్టి ఒ చేతితో పట్టుకుని, రెండో చేతిలో ఫోటో పట్టుకొని వచ్చి సరోజకిచ్చింది 'ఇదేనా?' అని అడుగుతూ

'కాఫీ తీసుకో సరోజా' అని శోభ మందహాసంతో ఒక గ్లాసు ఆమెకు, రెండోది తనభర్తకు అందించింది.

"మీరు కూడా" అంది సరోజ

'ఇదుగో,' అంటూ మరో గ్లాసు తీసుకు వచ్చింది

సరోజ కాఫీ తీసుకుని సెలవుగైకొని వెళ్ళిపోయింది

శోభ మనస్సు చాలా తేలికయింది— కారుమబ్బులు వర్షించిన తర్వాతి మాదిరిగా

సాయంత్రం శోభ ముఖంకడుగుకొని తెల్లని జల్తారుచీరతో సింగారించుకున్నది మేడ మీదకుపోయి తెగిన తీగెలను వీణనుండి తీసి కొత్తతీగెలను బిగించి 'కుహూ' నాదమును పలికించింది

స్టాండున ఉన్న చిత్రములో కారుమబ్బులని తొలగించి తేలికగా పరుగెడుతున్న నీలిమబ్బులను, దూరముగ ఉన్న కొండలను దిగుతున్న సూర్యబింబాన్ని అరుణ కాంతులని తేలికగా చిత్రించింది శోభ.

ఇంతలో చంద్రోదయమయింది. శరద్రుతువేమో—మల్లెపూవులాటి పండు వెన్నెల వెల్లివిరిసింది వరండాలోని జాజి మల్లెల సౌరభాన్ని పిల్లవాయువులు మోసుకు వస్తున్నాయి నింగిలో చకోరపక్షులు జంటలుగా విహరిస్తున్నాయి ఎదురుగా నున్న బాదంచెట్టుకొమ్మపై తెల్లని పావురపుజంట ముక్కులు పొడుచుకుంటూ ఏవో కూడబలుక్కుంటున్నాయి ఈ ప్రకృతిశోభను గ్రోలి ప్రభాకర్, శోభలు ఆనందముతో హాలులోనికి ప్రవేశించారు



# అన్వేషణ

పోతుకూచి సాంబశివరావు

(గతవారం తరువాయి)

కోమటికోడలు, కోమటి యజమాని శివరాం ద్వారా దొంగతనం కేసు పరిష్కారమైన సంగతి విని సంతోషించారు

మర్నాడు ఆఫీసులోకి వెళ్ళగానే గుమాస్తాలంతా ఎదురువచ్చి అభినందనలిచ్చి గతంనాటి కష్టాలకు సానుభూతి చూపారు శివరాంను డైరెక్టరు పిలిచి జీతం ఆపడంలో తన విధ్యుక్త ధర్మం నిర్వహించడమే కాని, అతనిపై దొంగతనం ఆరోపణ చెయ్యడం కాదని స్పష్టపరిచాడు ఇంతకాలం ఆగిపోయిన అయిగువందల రూపాయలు శివరాం జేబులో నిండాయి జీవితంలో మొట్టమొదటగా స్వార్జితం కళ్ళారా చూసుకుని కులికాడు.

అప్పులివ్వడం అలవాటు లేదంటూ రాజారావు శివరాంనుంచి దమ్మిడీ తీసుకోలేదు కోమటియజమాని అప్పు తీర్చడంతో పూర్తిగా శివరాం ఋణబాధ ఆఖరయిపోయినది పుష్కలంగా ఉన్న ధనం ఏదో ఖర్చును పురమాయిస్తుంది అందమైన దుస్తులు అత్యవసర సామానులు కొనుక్కొని ఒక వంద రూపాయిలు బ్రహ్మయ్య గారికి మణియార్డరు చేశాడు శివరాం

శివరాం ముఖంలో నవ్వు ఆకారంలో కొంత శాంతి, గుస్తుల్లో క్రొత్తదనము నారాయణ గమనించాడు. ఇంతవరకు మనోవ్యాకులతతో మథనపడుతున్న శివరాం పెళ్ళి సంబంధాలు తిరగగొడ్డములో సబబు కనిపించినా, ఇకముందు అలా అతను చేయడనే విశ్వాసం కలిగింది

తీరుబడిగా ఒకరోజు భోజనము చేసి నారాయణ శివరాంయింటికివచ్చాడు కోమటి యజమాని, కోమటికోడలు శివరాంతో ఏదో యిష్టాగోష్ఠి జరుపుతున్నారు ఆ దంపతుల సహాయం పెళ్ళి విషయంలో తప్పక లభిస్తుందనే నమ్మకముతో, నారాయణ సంబంధాల ప్రసక్తి కదిపాడు కోమటియజమాని పెళ్ళి చేసెయ్యాలని చప్పట్లు కొట్టాడు కోమటికోడలు రాబోయే భార్య సంసారంలో భర్తకు ప్రతినిమిషం అందిచ్చే సుఖాలు లేత తమలపాకుల్లో నోరూర్చేలా ఉంటాయంటూ వర్ణించింది వచ్చినా నచ్చకపోయినా అసలు సంబంధాలు చూస్తే క్రొత్త అనుభూతులు సంపాదించుకున్నట్లవుతుందని ఒప్పుకున్నాడు శివరాం.

ఓ అమ్మాయిని చూడడానికి ఒకరోజు నిర్ణయించారు తెల్లషరాయి, తెల్లచొక్కా, ఒకకోటు, బూటు తొడుక్కొని శివరాం పెళ్ళికొడుకు వేషంతో ముస్తాబయ్యాడు

కోమటికోడలు అతన్ని చూసి వెకిలిగా నవ్వింది కోమటి యజమాని శివరాంకు అండగా అతనివెంట వెళ్ళాడు

వరండాలో కూర్చున్న పెళ్ళికూతురు శిరస్సు మోకాళ్ళలోకి ముడిచేసుకుంది ఎవరో ముత్తయిదువులు, జవ్వనులు వరండాలోని ప్రక్కగదుల్లోంచి తొంగి చూస్తున్నారు నారాయణ కోమటి యజమాని పెండ్లికూతురు తండ్రితో వివాహాలు, అందులోని కష్టాలు, ఆధునిక యువతీ యువకుల మనస్తత్వాలు, అవి సమన్వయం చేసుకోలేని తమ బ్రతుకులుగురించి బాహాటంగా చర్చిస్తున్నారు పెద్దమనిషి తరహాలో శివరాం మందస్మితం చేస్తూ కూర్చున్నాడు

ఫలహారాలు ప్లేట్లలో ఎదురుగా నిలిచేయి వేడికాఫీ ఆవిరిపొగలు చిమ్ముతూ కప్పుల్లో తొణికింది నారాయణ నిర్మొహమాటంగా కడుపార భుజించాడు కాఫీ త్రాగి యిచ్చిన కిళ్ళీ బిగించి, కమ్మని చుట్ట ముట్టించాడు శివరాం మందస్మిత మౌనంలో ఎంతో శుభసూచకమైన ఆశ కనిపించింది నారాయణకు ఆ నగరంలో శివరాంకు తనొక్కడే ఆప్తుడైనట్లు మాట్లాడాడు నారాయణ అక్కడ ప్రేక్షకులముందు

ఊపిరి బంధించి, బిక్కిరి బిక్కిరిగా ముడుచుకు కూర్చున్న అమ్మాయికి విరామం యివ్వడం తన ప్రస్తుత విద్యుక్త ధర్మంగా భావించాడు శివరాం పెళ్ళిచేసుకోన్నా, లేకపోయినా, ఆమెను లోపలికి పంపెయ్యండని నారాయణవైపు చూశాడు శివరాం ఆ అమ్మాయి తండ్రి యింకా కొన్సేపు ఆమెను అబ్బాయి ఎదురుగా వుంచితే ఏ నక్షత్ర శక్తి ప్రభావంలోని ఆకర్షణవల్లనైనా పెండ్లి నిశ్చయం కాగలదనే భ్రాంతితో కూతురును కూర్చోమనినా, తర్వాత బాగుండదని యింట్లోకి పంపేశాడు పెళ్ళికూతురు తండ్రి దగ్గర శెలవుతీసుకొని నారాయణ, శివరాం, కోమటి యజమాని వీధిలోకి నడిచారు

"ఎల్లావుంది అమ్మాయి!" నారాయణ ప్రశ్నించాడు శివరాంను

"బాగానే వుంది!"

"స్థిరపరచమన్నావా?"

"తొందరేమొచ్చింది?"

"నీకు తొందరలేకపోతే వాళ్ళకు తొందరేగా?"

"వాళ్ళకు తొందరైతే మరొకరిని స్థిరపరుచుకోమను" నారాయణ ఉత్సాహం తగ్గి కుంచించుకుపోయాడు

వితండవాదనవదలి సాఫీగా మాట్లాడాలనుకున్నాడు.

"అసలు పిల్ల నచ్చిందా లేదా?"

"నచ్చలేదు!"

"అలా చెప్పు! నిన్ను బలవంతం ఎవ్వరూ చేయరు రేపు వాళ్ళకు కబురంపేస్తాను!"

నారాయణ మౌనం వహించాడు తర్వాత ఇంటిదాకా శివరాంను దిగబెట్టి వెనుదిరిగి పోయాడు నారాయణ

ఇంటకిరాగానే కోమటికోడలు గుచ్చిగుచ్చి అడిగింది పెళ్ళికూతురుగురించి శివరాంకు కోమటియజమాని దృశ్యమంతా వర్ణించి కేరింతాలు కొట్టాడు శివరాం ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకోడానికి ఒప్పుకోలేదని తెలిసి 'మాకు బూరెలుక్క గొరకదు కాబోలు!' అని పకపక నవ్వింది కోమటికోడలు

ఇంకా ఎన్నో సంబంధాలగురించి వివరాల పట్టీ శివరాం ముందు పెట్టాడు నారాయణ బ్రతుకు తెరువుకై పాకులాడే బడిపంతులు కూతురు తండ్రిలేని కుటుంబంలోని అమ్మాయి, చిన్నతనంలో తల్లిని పోగొట్టుకొని తండ్రికి సేవచేస్తూ యింటి పనులలో ఆరితేరిన అమ్మాయి, ధనవంతుని కుంటికాలు కూతురు ఒక మెల్లకన్ను మినహాయించి సర్వాంగలక్షణ సంశోభితయైన కన్య ఆ పట్టికలో దొర్లాయి అనువైన అభ్యుదయ దృక్పథంతో కట్నాలు ఎక్కువ పట్టించుకోకూడదంటూ, అయినా ముఖ్యమైన ఆదరణాభిమానాలకు ఎక్కువ తగినవంటూ, నారాయణ ఉద్ఘాటించాడు

ప్రతి పురుషునికి ఒక స్త్రీ అవసరం కనుక ఏదో అమ్మాయిని పెండ్లిచేసుకొని బ్రతకడం శివరాం దృష్టికి మృగలక్షణ మనిపించింది

సంబంధబాంధవ్యాలలోని మమతలు అటుంచి, జీవితంలోని అభివృద్ధికి దోహదమొనర్చగలిగే బాంధవ్యం ఆ నగరంలో ఒంటరిగా నివసిస్తున్న తనకు ముఖ్యమని భావించాడు శివరాం. నారాయణ ఏకరువు పెట్టే సంబంధాలన్నీ బాధ్యతలు పెండ్లి ద్వారా అతమీద పెట్టడానికి ప్రయత్నించేవిలా కనపించడంవల్ల వాటగురించి ఉదాసీనత్వం వహించడం మంచిదనుకున్నాడు. అయినా చిన్నతనంనుంచి పెంచి పెద్దజేసిన కుటుంబం పెద్ద బ్రహ్మయ్యగారిని సంప్రదించకుండా ప్రయత్నాలు చెయ్యడం భావ్యం కాదని నిశ్చయించుకున్నాడు.

ఉన్న సంబంధాలు ప్రస్తుతం చూడనన్నాడు శివరాం. నారాయణకు అతని మనస్తత్వం అర్థంకాలేదు.

నారాయణ మొట్టమొదట చూపించినపిల్ల తాలూకు ముసలితండ్రి ఒకరోజు దీనంగా ఇంటకివచ్చి కలుసుకున్నాడు. అతన్ని తప్ప మరెవ్వరినీ పెండ్లి చేసుకోనంటోంది కూతురు అని వాపోయేడు. ఎదిగిన పిల్లల మనస్సులు మార్చటం కష్టం గనుక ఏవిధంగానైనా ఒప్పుకొని తన కూతురును పెండ్లిచేసుకోమని ప్రాధేయపడ్డాడు. ఎదిగి వయస్సువచ్చిన వారి మనస్సు మార్చబడడం కష్టం గనుక నే తనేవిధముగానూ పెండ్లికి అంగీకరించజాలనన్నట్లు మర్యాదగా తిరస్కరించాడు శివరాం.

శివరాంను పెళ్లికొడుకుల జాబితాలో చేర్చేశాడు నారాయణ. అతనిక వీలైనంత ఎక్కువ ప్రచారంకూడా యింతకుముందే చేసివుంటాడు. శివరాం సంబంధాలు చూడననడంతో నారాయణకు పచ్చివెలక్కాయ గొంతుకపడినట్లయి, అమ్మాయిల తండ్రులకు సమాధానం చెప్పలేక సతమతమౌతున్నాడు. ఒక్కొక్కసారి శివరాం తప్పకవచ్చి పిల్లను చూస్తానని చెప్పి, ఆ సమయానికి తనొక్కడే వెళ్ళి ఫలహారాలు సుష్టుగా భుజించి, అనివార్యమైన కారణాలవల్ల ఆరోజు శివరాం రాలేకపోయాడని, మరోరోజు తీసుకొస్తానని వాగ్దానంచేసి తిరిగి వచ్చేవాడు నారాయణ.

ఒకరోజు ఓ ముసలి బడిపంతులు ఊరకలు వేసుకుంటూ, కోమటి యజమాని యిల్లు వెతుక్కుంటూ, వచ్చాడు. తనకోసం వచ్చిన ఆయన్ను శివరాం ఆహ్వానించాడు. నారాయణ ఆయన విషయంలో అనేకవిధాల త్రిప్పటంవల్ల సమస్య ఎదురుగా నిర్భయంగా పెండ్లికొడుకుతోనే పరిష్కరించుకోవలసి వచ్చిందని స్పష్టంగా చెప్పారు బడిపంతులు. తనకు ముగ్గురు ఎదిగిన కూతుళ్ళున్నారని, ఏవిధంగానూ కాలయాపన జరుగకుండా విషయాలు త్వరలో పరిష్కరించుకోవడం తనకు ముఖ్యమని తన పరిస్థితి గుర్తించి మరో మాట చెప్పకుండా, తనకూతుర్ని చూసి, యిచ్చిన కట్నానికి ఒప్పుకొని, వివాహ నిశ్చయానికి అంగీకారం తెలియజెయ్యమని, ప్రాధేయపడ్డాడు. ఆ బడిపంతులు ధోరణి శివరాంకు సానుభూతి కలిగించింది. నారాయణ ప్రవర్తనకు తాను నొచ్చుకొంటున్నట్లూ కొంత బాధపడి, తనపై ఏ ఆశ ప్రస్తుతం పెట్టుకోవద్దని నచ్చచెప్పి బడిపంతులును సాగనంపాడు శివరాం. పెరిగిపోతున్న జనాభాతో కుటుంబాల బీదరికంతో మారిపోతున్న నాగరికతతో చంచలమౌతున్న ఆధునిక మనస్తత్వాలతో పురాతనుల అభ్యుదయ నిరోధక సంకుచిత భావాలతో, వివాహ సమస్య కూడా వికృతరూపం దాల్చినట్లున్నాయి. వివాహానికి ఒక లక్ష్యం ఏర్పరచుకొని, కుటుంబాన్ని ఒక నిర్దిష్ట పద్ధతిలో నిర్దేశించుకోవడం ఆధునిక యుగంలో అవలంబించవలసిన ముఖ్యసూత్రంగా గోచరించింది శివరాంకు.

బ్రహ్మయ్య తాతగారికి ఒంట్లో బాగుండటంలేదని తక్షణం ఒకసారి బయలుదేరి రమ్మని తంతి వచ్చింది శివరాంకు. ఆఫీసుకు ఒకవారం రోజులు శెలవుపెట్టాడు శివరాం. సాయంత్రం పరుపుచుట్ట సర్దుకొని, కోమటికోడలును కలిసి తన ప్రయాణం సంగతి చెప్పాడు.

"ఈరోజు ప్రొద్దున్నే ఆయన బెంగుళూరు వెళ్ళారు. మీరుకూడా వెళ్ళిపోతున్నారన్నమాట. ఇంట్లో ఒంటరిగా భయం వేస్తుందండి!" కోమటి కోడలు నిట్టూర్పు విడిచింది. పరిస్థితి అర్థమయింది శివరాంకు. తంతి చూపించాడు ఆమెకు. కోమటికోడలు మౌనంగా గుమ్మంలో నిలుచుంది వెళ్ళిపోతున్న శివరాంను చూసి.

రైలెక్కగానే స్వగృహంగురించి ఆలోచనలు మొదలేయి. కష్టాలలో అందరిని మరచిపోయి గడిపిన ఆరునెలల కాలంలో అణిగిపోయిన మమతలు ఒక్కసారి పెల్లుబికాయి. వారంరోజులలో యింటదగ్గర గడపవలసిన కార్యక్రమాలు ఊహించుకున్నాడు శివరాం. హుషారుగా ప్రయాణీకులతో కబుర్లుచెప్పి ఆనందించాడు.

జట్కాదిగి స్వగృహం ముంగు నిలుచున్న శివరాంకు ఆశ్చర్యం కలిగించింది. బ్రహ్మయ్యగారు కుర్చీలో ఠీవిగా కూర్చుని పంగుగా చుట్టకాలుస్తున్నారు. శివరాంను చూసి ఆనందం ఒలకబోసే బోసిముఖంతో ముంగుకువచ్చి భుజంమీద తువ్వాలు సర్దుకొని, పంచెకట్టు బిగించుకొని "ఏమే కోడలా! నీ కొడుకువచ్చాడే" అంటూ హాస్యంగా పిలిచాడు సుభద్రమ్మను. అంగలు వేసుకుంటూ సుభద్రమ్మ గుమ్మంలోకి వచ్చింది. లక్ష్మి గెంతుతో అన్నగారిని తొంగిచూస్తూ ముసిముసి నవ్వులతో తల్లి వెన్నంటింది.

"తంతి యిచ్చారేం?" ప్రశ్నాకారం

# ★ అన్వేషణ ★

ముఖం పెట్టాడు శివరాం

"అంతా తమాషా!" బ్రహ్మయ్యగారితో పాటు అందరూ గొల్లుననవ్వారు శివరాంను చూసి

"ఆరునెలలయినా హైద్రాబాదునుంచి రాకపోతే మమ్మల్ని ఏంచెయ్యమన్నావు!" లక్ష్మి, అన్నను నిలబెట్టి సాగదీసుకుంటూ అడిగింది

"ఇంట్లో అందరికీ నిన్ను చూడాలని ఉంటే " బ్రహ్మయ్యగారు ఉబికివచ్చే నవ్వును ఆపుకోలేక పకపక నవ్వారు పొట్ట చేత్తోపుచ్చుకుని

అతిమాపాలోని పరిపూర్ణంగా అనుభూతి పొందాడు శివరాం ఆప్తులను మరిచిపోడా లనేధ్యాస స్వయంగా తనకు కలగకపోయినందుకు కించపడ్డాడు శివరాం. ఆధునిక నాగరిక ప్రపంచంలో ఎడతెగని ఊపిరిసలపని స్వలాభిపరమైన కార్యక్రమాలలో మునిగితేలే నిర్లక్ష్యమైన మనుష్యులకు, సనాతన పద్ధతుల్లో అంటిపెట్టుకుని అభిమానం మరచిపోలేని పురాతన మనుష్యులకు మధ్యఉన్న వ్యత్యాసం తనద్వారా అర్థంచేసుకున్నాడు శివరాం. అన్నగారిలా స్వలాభపరుడు కాకుండా, తనబాధల్లోనే అందరినీ మరచిపోయేననిమాత్రం సంతృప్తిపడ్డాడు శివరాం.

చిట్టెమ్మ, పార్వతమ్మ, పార్వతమ్మ పిల్లలు వరుసగా బయటికివచ్చారు ఒకపిల్లవాడి నెత్తుకుని ఆడిస్తూ అడుగిడిన వెంకటేశ్వర్లు తమ్ముడిని పలకరించాడు. అనురాగం, అభిమానం, ఆదరణలో కాకుండా, గౌరవప్రదంగాకూడ అందరూ తన్ను పలకరించడంతో శివరాం ఒళ్ళు గగుర్పొడిచింది బహుశా సంపాదనపరుడై, తనకు తెలియని దూరప్రాంతాలలో మసులుతూ అనుభవజ్ఞుడౌతున్న తనకు తగినగౌరవం యివ్వడం ధర్మమని అందరూభావించి ఉంటారని అనుకున్నాడు శివరాం

శివరాం హైద్రాబాదునుంచి వచ్చాడన్న వార్త పొరుగింటి గుమ్మాల్లోపాక్కిపోయింది పొరుగు గృహయజమానులు సాయంత్రం ఏదో షికారుకు బయలుదేరినట్లు బ్రహ్మయ్యగారి ఇంటికివచ్చి, శివరాంను పలకరించి, నగరభోగట్టాలు, సంపాదన వివరాలు, విచిత్ర అనుభవాలు, అడిగితెలుసుకుని, ఆనందించి "పెద్దవాడవయ్యావు!" అంటూ పెదవి చప్పరించి తిరోగమనం చేసేవారు ఇల్లు విడిచి షికారుకు వెళ్ళిన శివరాం వైపు ఎరిగిన పొరిగింటి కన్యలు తీక్ష్ణ దృక్కులతో, అనిర్వచనీయమైన ఆశలతో చూశారు. పట్టణంలో కనిపించిన మిత్రులు దూరదేశ మహానగరంలో స్వశక్తితో అభివృద్ధికి వచ్చి, ఔన్నత్యం పొందిన శివరాంకు అభినందనలు తెలిపారు ఎరిగిన పాలవాడు, కొట్టువాడు, చాకలి, మంగలి, పాలేరు, దాసి, "బాబయ్యా!" అని నోరు నిండా పలకరించి, దణ్ణం పెట్టి బహుమతి కోసం చేతులు చాపారు శివరాం హృదయం ఆ అభిమానాల చిలకరింపుల్లో పులకరించి పరవశత్వం చెందింది. ఆ ఆనందంలో తోచిన రూపాయిల నోట్లు వాళ్ళచేతుల్లో జల్లాడు

శారద అదృశ్యమైపోవడంతో ఆకుటుంబ పెద్దగా మిగిలిపోయిన చిట్టెమ్మ స్వంత యిల్లు అద్దెకు యిచ్చుకుని ఒంటరిగా బ్రతకలేక, బ్రహ్మయ్యగారి యింట్లోకి వచ్చేసింది ఆమెను చూడగానే పురాతన స్మృతులు శివరాం భగ్నహృదయంలో ఉద్రేకాలు రెచ్చగొట్టాయి తాపీగా అణచుకున్నాడు

భార్యకు నలతగా ఉంటోందని, వెంకటేశ్వర్లు ఒక వారంరోజులు శెలవు పెట్టి ఇంటికి వచ్చాడు తన తల్లిచేత సంరక్షణ చేయించుకోవాని ఇంటిదగ్గర అన్న ఉంటాడనే ఊహలేక చేసిన పనికి సర్దుకోడానికి ఏం చేయాలో తోచక, సందేహంతోనే తన బెడ్డింగు విప్పాడు శివరాం

భోజనాలు చేసి తాపీగా కబుర్లు చెబుతున్న బంధుజనం శివరాం వైపు ఆసక్తితో చూశారు ఏ క్రొత్త వస్తువులు తెచ్చాడో అని

ఒక జార్జెటు సిల్కు చీర లక్ష్మికి, ఒక మల్లుపంచె బ్రహ్మయ్య గారికి, ఒక సైనుపంచె తల్లికి అందచ్చాడు శివరాం లక్ష్మి సిల్కుచీర ఒంటికి రాసుకుంటూ మన్నగా అనుభూతి పొంది, అందంగా ఉంటానను కుంటూ ఆలోచనలో హాయిగా నవ్వింది బ్రహ్మయ్యగారు మనవడి సరదాకు బోసి నవ్వులులుకుతూ "ఎందుకు రాయిది!" అంటూ మామూలుగా అని పంచె నేత పరీక్షించసాగారు. తన కిచ్చిన వస్త్రం ఉపయోగానికే గాని మరెందుకూ కాదని, పుత్రుడు చూపిన మాతృప్రేమలో మునిగి తన్మయురాలై, సుభద్రమ్మ మడత పెట్టింది సైనుపంచె

భోజనానంతరం బొజ్జ నిమురుకుంటున్న వెంకటేశ్వర్లు దృష్టి కొద్దిగా వక్రమయినా తనకు తమ్ముడు బహుమతి ఇవ్వలేదనే అసంతృప్త దాచుకుంటూ కృత్రిమంగా నవ్వాడు ఆ వస్త్రాలుచూచి పార్వతమ్మ మూతి ముడుచుకుని మౌనంగా తదేకధ్యానంగా లక్ష్మికిచ్చిన చీరవైపు చూస్తో కూర్చుంది చిట్టెమ్మ నిష్కామంగా మామూలుధోరణిలో ఆ వస్త్రాల వెల ప్రశ్నించింది

అన్న వదినెలకు ఆపరిస్థితి ఏర్పడుతుందని తెలిసినా, శివరాంకు మరో గత్యంతరము లేకపోయింది తెచ్చుకున్న ధనం తిరుగు రైలుఛార్జీలకు ముఖ్య అవసరాలకు సరిపోతుందిగాని, వారికికూడా బహుమతులివ్వగలిగేలాలేదు అయినా తాతయ్య వారికి తగుసత్కారం చెయ్యకముందు ఎలాగాచేస్తాడు గదా అని మనస్సుకు సమాధానపరచుకున్నాడు శివరాం

వెంకటేశ్వర్లు బొజ్జమట్టూ నిల్చొని అల్లరిచేస్తున్న ముగ్గురిపిల్లలచేతుల్లో మూడురూపాయలు ఉంచబోయాడు శివరాం, ఆ దంపతులకు కొంత సంతృప్తి కలిగించాలని వెంకటేశ్వర్లు అర్థాంగీకారంగా ఊరుకున్నా, పార్వతమ్మ అడ్డువచ్చి పిల్లలను డబ్బుతీసుకోనివ్వలేదు

"మీఅన్నయ్యా సంపాదన నీఅంత లేకపోయినా మాకే లోటులేదు!" పార్వతమ్మ మాటలు కర్ణకఠోరంగా ఉన్నాయి శివరాంకు.

లక్ష్మిబాధతో తన చీర క్రింద జార్చేసింది

బ్రహ్మయ్యగారు మర్యాదగా మందలించారు పార్వతమ్మను తాతయ్యకు సమాధానం చెప్పలేమని భర్తవైపు రౌద్రంగా ఒకసారి చూసి, మళ్ళీ నలుగురిలో కలిసిపోయి నవ్వింది పార్వతమ్మ గతంలో ఏమీ జరగనట్లు.

బ్రహ్మయ్యగారు శివరాం ఇంతవరకు గడిపిన జీవితంగురించి నిజం చెప్పమని గుచ్చిగుచ్చి అడిగారు శివరాం తన నగర చరిత్రఅంతా నిజస్వరూపంలో తెలియజేశాడు మనమడు ఒకవిధంగాఉద్యోగంలో స్థిరపడి కష్టాలు దాటినందుకు బ్రహ్మయ్యగారు, సుభద్రమ్మ లోలోపల సంతోషించారు మరిదిని చూసైనా నేర్చుకోండి అన్నట్లు భర్తవైపు చురచుర చూసింది పార్వతమ్మ భార్య చూపులకు తాళలేక తమ్ముడి సాహసకార్యాలు వినలేక, వెంకటేశ్వర్లు ఏదో పనివుందని ఊళ్ళోకి వెళ్ళిపోయాడు.

ఒకరోజు బ్రహ్మయ్యగారు ఫలహారాల వద్ద సంభాషణ కగిపారు

"ఈ వేళ అదృష్టంకొద్ది అంతా ఒకచోట చేరాము ఈ ఏడు ఏవో సంబంధాలు వెదికి లక్ష్మికి, శివరాంకు వివాహాలు స్థిరపరచాలి నువ్వు యిక్కడినుంచి వెళ్ళిపోయినా కాస్త యీ విషయం దృష్టిలో పెట్టుకోవాలి!" బ్రహ్మయ్యగారు సగం ఆజ్ఞగా సగం అనునయంలో చూశారు, వెంకటేశ్వర్ల వైపు

"ముందు లక్ష్మిపెండ్లి కానివ్వండి నా

పెళ్ళికి తొందరలేదు!" శివరాం ముభావంగా నవ్వుతూ తల ఒంచుకున్నాడు

అతని మనస్తత్వం అర్థంచేసుకున్న ఆ కుటుంబంలో ఎవరూ సమాధానమిచ్చి అతని హృదయం బాధ పెట్టదలచుకోలేదు

"ఈ కాలపు పిల్లలకు ప్రేమలు అవీనీ మా కాలంలో అవేమి తెలియవు!" శివరాం చెప్పుతూ సాధారణంగా అన్నట్లు వ్యంగ్యంగా నవ్వింది పార్వతమ్మ

"ఆ సంగతి అందరికీ తెలుసు!" బ్రహ్మయ్యగారు కొంచెం కోపం చూపించాడు

వెంకటేశ్వర్లు తాతగారి మాటకు 'ఊ" అన్నాడు భర్త తల ఊపుచూసి చింగులు త్రొక్కింది, పార్వతమ్మ మనసులో ఉండబట్టలేక ఉన్నమాట భళ్ళున విసిరింది

"ఆయన పనులతో ఆయనకే తీరిక ఉండదు ఇంక పెళ్ళి సంబంధాలు ఏం చూడగలడు చెల్లెలికి!" సాగదీసుకుంది పార్వతమ్మ

"నీ సలహా నేను అడగలేదు!" కసిరారు బ్రహ్మయ్యగారు

ముఖం జేగురుముద్దలా మార్చి మూతి ముడుచుకుని పార్వతమ్మ మూలగా పోయి కూర్చుంది మౌనంగా తటాలున

'అన్నయ్యకు తీరుబడి లేకపోతే ఫరవాలేదు నాకు పూర్తిగా తీరుబడే ఆ సంబంధాల ప్రయత్నం నేనే చేస్తాను ! వ్యంగ్యంగ నవ్వాడు శివరాం

తన వివాహంగురించి ఏర్పడిన వివాదాలు చూసి విసిగించుకుని అక్కడినుంచి లేచిపోయింది లక్ష్మి.

ఆ సంభాషణలో ప్రసక్తి తీసుకోక చిట్టెమ్మ మామూలు ముందకొడితనం ప్రదర్శించింది సుభద్రమ్మ ఆలకిస్తూ ఆశ్చర్యంగా చూసింది కోడలు ప్రవర్తనకు

నాల్గురోజులు గడవగానే ఆ వాతావరణం శివరాంకు విసుగు కలిగించింది సరదాగా కాస్సేపు మాట్లాడి గడపడానికి లక్ష్మి తప్ప మరెవ్వరూ లేరు. పట్నంలోని స్నేహితులు ఎవరి వ్యాపకాలలో వారు నిమగ్నులై పోయారు ఇంక ఆ పట్టణంనుంచి నిష్క్రమించదలచుకున్నాడు శివరాం

సెలవు పూర్తయిపోతుంది కనుక వెళ్ళిపోవాలనుకున్నాడు శివరాం. బ్రహ్మయ్యగారు, సుభద్రమ్మ యింకా ఒక వారం ఉండమని బలవంతపెట్టారు వీలులేదన్నాడు శివరాం ఉద్యోగాల్లో చేరాక ఆ పుత్రుని అభిమానంగా దగ్గిర ఉంచుకోవడం కష్టమని గుర్తించి ఊరుకున్నారు బ్రహ్మయ్యగారు

లక్ష్మి హైదరాబాదు అన్నగారితో వెడతానని పట్టుపట్టింది నిజంగా వెడుతుందేమోననే అసూయతో పార్వతమ్మ తన బుద్ధి దాచుకోలేకపోయింది పెళ్లియీడు పిల్లలు ప్రయాణాలు చేసే కాలం కాదిది! అంటూ ఒంటరిగా ఉంటున్న అన్నయ్యకు తాను కొంతకాలం వంటచేసిపెడతానని తన కోరికకు బలం కల్పించుకుంది లక్ష్మి ఇదీ సమంజసమే అన్నారు బ్రహ్మయ్యగారు కోమటి దంపతులను దృష్టిలో పెట్టుకొని లక్ష్మిని తీసుకువెళ్లడానికి అభ్యంతరం లేదన్నాడు శివరాం. రాజారావు అత్తిల్లు పిఠాపురం కనుక, అతని బంధువులు ఎవరైనా వస్తే తిరిగి చెల్లెలును పంపించగలనని చెప్పాడు శివరాం. ఈ పరిస్థితుల్లో లక్ష్మి ప్రయాణానికి ఆటంకాలు లేకుండాపోయాయి

లక్ష్మి, శివరాం సికింద్రాబాదు స్టేషనులో దిగారు దారిపొడుగునా చిలిపి అల్లరిచేస్తూ కనిపించినవానిని కొంటెగా అభినయిస్తూ వింతప్రశ్నలు వేయసాగింది లక్ష్మి సరదాగా ఓపిగ్గా అన్నింటికీ సమాధానాలు యిచ్చేవాడు శివరాం స్టేషనులో దిగి నల్లకుంటకు టాంగా కుదిర్చాడు శివరాం కోమటి కోడలు తన చెల్లెలును చూసి మురిసిపోతుందని యిద్దరికీ అపురూపమైన స్నేహం పెరుగుతుందని వారాయన స్నేహాన్ని లక్ష్మికి సంబంధాలు వెతకడంలో నైనా ఉపయోగించుకోవాలనీ, యింకా ఏదో ఆలోచిస్తూ ఇంటముంగు దిగాడు శివరాం.

వీధిద్వారం బంధించి ఉంది. కిటికీ తలుపులు మూసిఉన్నాయి టాంగా ధ్వనివల్లనైనా మేడమీద అలికిడి అవుతుందేమోనని మేడమీదకు ఆశగా చూశాడు శివరాం అతనికిఅంతగా కుతూహలం సకిలించింది అయినా మేడమీద ఎవరూ మసలుతున్నట్లు కనిపించలేదు తలుపు కొట్టాడు శివరాం సమాధానం లేదు. గట్టిగా బాదాడు మళ్ళీ

వీధి తలుపు తెరుచుకుంది కోమటి యజమాని తల్లి ఒంగిన నడుముతో మౌనంగా నిలుచుంది శివరాం నమస్కరించాడు ఆమె ముభావంగా వెనక్కి తిరిగి మేడమీదకు వెళ్ళిపోయింది

సామాను టాంగావాడిచేత లోపల పెట్టించి తనగది తెరిచాడుశివరాం ఒక్కటే గది ఇందులో అన్నా చెల్లెళ్లు ఎంత కాలం గడపడం ఏదో ఇరుకు సమస్య ఉద్భవించినట్లు కనిపించింది శివరాంకు ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది తలుపులుమూసి లోపల మసక కొంత అలుముకుని శీతలవాతావరణం వ్యాపించింది చెల్లెలును గదిలో కూర్చోబెట్టి సహజమైన నవ్వుతో సరదాగా మేడమీదకు వెళ్ళాడు శివరాం. కోమటి యజమాని తల్లి నేలమీద కొంగుపరుచుకుని పడుకుంది దిగులుగా. కోమటి యజమానికై ప్రశ్నించాడు శివరాం కోమటి కోడలు గదిలోంచి బయటికి వస్తుందని ఆశించాడు కాని ఆమె కనుపించలేదు కొడుకు పడు

(46 వ పేజీ చూడండి)



# అసికారి

ఈ కథ రాయాలని నాకు చాలాకాలం నుంచీ ఉంది. తీరా, రాద్దామని కూర్చొనేసరికి ఎలా మొదలుపెట్టడం ఎలా రాయడం అని చాలాసేపు ఆలోచించవలసొచ్చింది. ఆలోచించగా నాకు తెలిసిన పెద్దమనిషొకాయన గుర్తుకొచ్చి ఆయన చెప్పిన సలహా జ్ఞప్తికొచ్చింది. ఆయన ఏమంటున్నాడంటే కథలో ప్రధానరసం, లేక ఓ సన్నివేశంలో ప్రధానరసం—దానిప్రకారం అన్నీ సరిదిద్దుకోవాలండీ అన్నాడు వాతావరణమంతా మన కథకనుగుణ్యంగా చిత్రించుకోవాలండీ అన్నాడు అంటే కథలోని నా మనసులో తుఫాను రేగినప్పుడు, ఉరుములు మెరుపులు పెనుగాలి బీభత్సం వాటినన్నింటినీ పిలకలు పట్టుకు లాక్కొచ్చి వాటిని నాచుట్టూ తిప్పుకోవాలన్నమాట సాఫీగా సాగిపోయే నా ప్రేమలత టక్కున తెగిపోయినప్పుడు, ఎక్కణ్ణించో అక్కణ్ణుంచి వీణనొకటి ఎత్తుకొస్తే నా వచ్చి దాని తీగలు తెంపుకొని దానిమీద నా తలని దీనంగా వాల్చుకోవాలన్నమాట. నా ఆశలన్నీ వాడిపోయి రాలిపోయినప్పుడు మోడైపోయిన చెట్టునొకదాన్ని వెతికి వెళ్ళి చూసుకొని అక్కడ మోకాళ్ళమీద తలపెట్టుకొని కూర్చోవాలన్నమాట నా కిష్టంలేనప్పుడు ఆకాశం నీరా పులిమినట్టుగాఉండాలన్నమాట. నాకు సరదా పుట్టినప్పుడు అది వజ్రాలు పొదిగినట్టుగా ఉండాలన్నమాట. నాకు తెలిసిన ఆ పెద్దమనిషి చెప్పిన సూత్రంప్రకారం ఈ కథ మొదలుపెట్టేసరికి——

రాత్రి పదకొండుగంటల సమయంలో ఊరవతల నూకరాజుపాకవతల ఉన్న ఇసక మైదానం, వెన్నెల వెలుగులో, పరచిన బంగారు తివాసీలా ఉంది. మైదానం మధ్య దంపతుల్లా నిల్చున్న తాటిచెట్ల కమ్మలు, చల్లగాలి పెట్టే కితకితలకి, కిలకిల్లాడుతున్నాయి. వాటిపక్క, నే ఇసక తిన్నె మీద లాడుతున్నాడు. ఆకాశంలో చంద్రుడు ఎలా మెరుస్తున్నాడంటే, తిన్నెమీది నూకరాజులా జిగజిగ మెరిసిపోతున్నాడు

ఈ కథకి నూకరాజు హీరో.

ఆ తిన్నెమీది చంద్రుడు ఏదో చుక్కకోసం ఎదురుచూస్తూండగా, అంతలో అల్లంతదూరంలో ఓ చుక్క మిలమిల్లాడింది "తాటిసెట్లాన వాలెట్టు"కొని ముందుకి నడిచింది. చుక్కని చూడగానే 'పరిగెట్టి ఎదురెళ్ళి' ఎత్తుకు తీసుకొచ్చి వళ్లో వేసుకున్నాడు నూకరాజు.

వళ్ళో ఉన్న పిల్ల పేరు నాగరత్నం.

ఆమె ఈ కథకి హీరోయినా?

మీరే చెప్పాలి.

ఆమె, పదిహేడేళ్ల కుర్రవాడికంటికి అట్టమీద కనిపించిన అహల్యాదేవిబొమ్మలా ఉంది. ఆమె పద్దెనిమిదేళ్ల బంగారం ఆమె నూకరాజుకి దొరికిన పెన్నిధి

'జంట తాటిచెట్లదగ్గర కూర్చున్న వాళ్ళిద్దర్నీ చూడ్డానికి చల్లగాలి చప్పుడు చెయ్యకుండా ఒచ్చింది వాళ్లని చూడు చూడని పైనున్న చంద్రుడు పక్కనున్న చుక్కకి సైగచేసేడు. చూసి సిగ్గుపడ్డ చుక్కమ్మ తెల్లమబ్బుచెంగుని చాటుపెట్టుకొని దొంగచూపు చూసింది!

చంద్రుడూ, చుక్కలూ, చల్లగాలీ వాళ్ళిద్దర్నీ చాలసేపు చూసేక నూకరాజు నాగరత్నంతో, "మనిద్దరం పెళ్ళాడ్దాం! ఏంకి?" అన్నాడు

పెదవుల్ని విడిపించుకొన్న తరవాత, నాగరత్నం" మా అమ్మకూడా ఇష్టమే "అంది

"నీకెలా తెల్సు?" అనడిగేడు నూకరాజు, సంతోషం పట్టలేకుండా

"నిన్ను పెళ్ళిసేసుకోమని రోజూ కే సెప్తుంది" అంది నాగరత్నం. మరింక నూకరాజుకి సంతోషం ఆగలేదు ఆ సమయంలో అప్పాయమ్మ అక్కడుంటే ఆమెని కూడా [illegible] అప్పాయమ్మంటే



దాదు సంవత్సరాల కిందటే వచ్చి పోర్బ్లెర్లో కళాశీగా పనుగురుచున్నాడు. అతనుండేది ఊరి-చివర అరుగగుల కాటి కమ్మలవాస ఇంట్లో ఓగదిలో అద్దెకి ఉంటున్నాడు

ఓ రోజు సాయంకాలం పోర్బ్లెర్లో కూలి చేసుకొని నెమ్మదిగా ఇంటికొస్తూ ఇంటవైపు చూసేసరికి నూకరాజు కంటికి కొసా గది గుమ్మం ముందు ఉదయకిరణంలా ఓ పిల్లకని పించింది దేవత వెలిసిందా అనుకున్నాడు నూకరాజు. కాళ్ళూ చేతులూ ముఖం తొందరగా కడుక్కొని భోగట్టా చెయ్యడానికి బయల్దేరి వెళ్ళేడు

సూర్యుడు అస్తమించీసేడు వెన్నెల మసగమసగ్గా వెలుగుతోంది ఇంటిముందు నులకమంచం మీద నూకరాజు కూర్చు న్నాడు. ఎదురుగా ఓ విరిగిన ఇటికమీద కూర్చొని తన వృత్తాంతమంతా అతన్తో చెప్ప నారంభించింది అప్పాయమ్మ

వింటే అదేం కొత్త వృత్తాంతం కాదు సాధారణంగా జరిగేదే వాళ్ళదసలు తాళ్ళవలసట. అప్పాయమ్మకి 'కన్నెరిది అత్తోరిదీ' కూడా ఆవూరే బతికి బాగు పడ్డ ఊరూ ఆదే. నెత్తిమీద 'కొంగేసుకొని ఒచ్చీసిన' ఊరూఅదే అక్కడే ఆమె కాపు రం కూలిపోయింది. అక్కడే ఆమె సంసారం తల్లారిపోయింది ఆమె కడుపున పుట్టిన మగపిల్లలంతా అక్కడే 'మంటగలసి పోనారు' తాళికట్టినవోణ్ని మశూచికమనే అసిరెమ్మ అక్కడే 'పొటనెట్టుకుంది' 'అక్కడున్న 'దోసెడుగుడిసెక్కా' కోరువారు అక్కడికే ఒచ్చి టమటములాడించీసినారు అన్నీ పోగా మిగిలిన తాతలనాటి ఇల్లు మట్టి దిబ్బయిపోయి ఇప్పటికీ అక్కడే ఉంది.

'కట్టుకున్న మొగుణ్ణి సంపేసుకున్నాను. కన్నకొడుకుల్ని సంపేసుకున్నాను బాబూ. కాన్నాకు సావు రాలేదు. పుస్తెలతాడు పోనాది పుట్టిన పిల్లలు పోనారు ఏళ్ళు పోనాయి ఎడ్లు పోనాయి ఏరుకున్న గింజలు పోనాయి కడాకి నమ్ముకున్న భూదేవతకూడా పోనాది.

కాన్నిరమ్మని పిల్చినా అప్పాయమ్మ కింత వరకూ 'సావింకా రానేదు! మరింకేటుంది? ఒక్కగానొక్క ఆడకూతురుంది ఈ ఆడ కూతుర్నెట్టుకొని ఈ ముసిలిముండకూతు రేటి సెయ్యడం బాబూ? మరింకక్కడే టుండిగనక సెయ్యడానికి సేసేదేం నేక డొక్కలు సేత్తో ఒట్టుకొని ఇదిగో పట్నానిలా పారొచ్చినాం. కూలినొక్కితే సుష్టు నేకపోతే పస్తు

అరె! అయితే మీకెవరూ దిక్కులేరన్న మాట! అన్నాడు నూకరాజు

"దిక్కెవరు నూకరాజు బాబూ!? దరణీ బూదేవి, ఆపైన దేవుడు ఆ యెనక నీలాటి మారాజులూను" అంది అప్పాయమ్మ

ముంగిట్లో ఇద్దరూ అలా మాట్లాడుతూ ఉంటే మారుకింద నీడలో రాటనానుకొని కూర్చొంది నాగరత్నం తనకథంతా నూకరాజుతో తల్లి చెప్తున్నప్పుడు ఆమె గుండెలు శోకంవల్ల పొంగి పొంగి దిగేయి చూరవతలి వెన్నెల ఆమె తడిసిన కళ్ళల్లో సలసల కాగింది.

అనురాగం అంకురించడంతో తలొకరూ తలోలా చేస్తారు. ఒక్కొక్కడు అవతల పార్టీకి తన మనసుని రెండు చేతుల్లో నూ పట్టుకువెళ్ళి ముందే అర్పణ చేసేస్తాడు. మరొకడు అవతలపార్టీ మనసుని జబర్దస్తీగా దోచేస్తాడు. లేకపోతే దల్లగా లాగేసాడు. నూకరాజు ఆ సాయంకాలమే తన మనసుని నాగరత్నానికిచ్చేసి ఆమెనీ ఆమె తల్లిని "ఆదుకొంటాను"అని భీష్మప్రతిజ్ఞ పట్టేసేడు. ఆ క్షణంనుంచీ వాళ్ళకతను కంటికి రెప్పా కాలికి చెప్పూను. కొంతమందికి చాకిరీచేసి మెప్పించడమే కాని షోకుచేసి మెప్పించడం తెలీదు నాలుగురోజుల్లో వాళ్ళిక నాలుగేళ్ళు సేవచేసేడు నూకరాజు.

# ★ అధికారి ★

ఆరోజున అప్పాయమ్మ కంటికి ఎటు చూసినా ఒక్కలాగే ఉంది చంద్రుడు బూజుపట్టిపోయి వేళ్లాడుతున్నాడు. వెన్నెలంతా పాలిపోయి బూడిదలా ఉంది చెట్లన్నీ శవద్ధ్యాల్లాగా, పైనున్న చుక్కలన్నీ చావబోయేవాళ్ళ ప్రాణాల్లాగా ఉన్నాయి. మరి, గాలి బిగిసిపోయి చచ్చిపోయింది ఇంతలో కాలం ఎలా తిరిగిందం టే రాట్నంలా గిర్రున తిరిగింది. ఆరోజున అస్తమించిన సూర్యుడు ఆతరవాత అరవై సార్లు ఉదయించేడు నూకరాజు దయవల్ల అప్పాయమ్మకీ నాగరత్నానికీ ఆ అరవై రోజుల్లోనూ కూలిదొరకని రోజు ఒక్క రోజూ లేదు. మరి అప్పాయమ్మ కెటు చూసినా ఒక్కలా చక్కగా ఉంది చంద్రుడికి బూజులుపోవడంతో వెన్నెలకి తేటొచ్చింది. గాలికి చలనం, చెట్లకి చైతన్యం చుక్కలకి ప్రాణాలూ ఒచ్చేయి అదంతా అలా పున్నమినాటి రేయిలా ఉండడం నూకరాజు పనివాడితనం.

పెళ్ళాడ్డం 'అమ్మకూడా ఇష్ట' మేనని తెలుసుకున్ననాటి రాత్రి నూకరాజుకి సుఖంవల్ల నిద్రపటలేదు అయినా మర్నాడు ప్రొద్దున్న మంచంమీంచి సంతోషంతో చెంగునగంతేసు పన్లోకి సంతోషంతో వెళ్ళేడు ఇంటికెంతో సంతోషంతో వచ్చేడు. ఆ విధంగా ఆరోజు, మర్నాడు, మూడోరోజు మరోరోజు వరసగా సంతోషంతోనే వెళ్ళేయి

అయితే—కాలం ఒక్కలా ఉండదనే సంగతి మీకూ నాకూ అప్పాయమ్మకీ బాగా తెలుసు. ఆ సంగతి నూకరాజుకూడా ఓరోజున బాగా తెలిసొచ్చింది. ఆ రోజు సాయంకాలం పన్లోంచి ఇంటికొస్తూ ఇంటికి అల్లంతదూరంలో ఒక్కన ఆగేడు నూకరాజు.

ఆ క్షణంనుంచీ నాకు కష్టాలు ప్రారంభమౌతాయి, నష్టాలు సంభవిస్తాయి అని ఎవరికుటుకి వారికి కొన్ని కొన్ని సమయాల్లో, తగినంత బలమైన కారణం లేకుండానే, అనిపిస్తుంది. అప్పాయమ్మ ఇంటిముందు ఓ పదిమంది మూగిఉండడం మాత్రం చూసేడు నూకరాజు 'అఁ, మనకేదో కీడు మూడిందిరో' అని అతనికి తోచడానికి అంతకంటె ఎక్కువ కారణం ఏమీ లేదు. ఊరవతల, తాకలవెనక, కొండవెనక సూర్యుడు మునిగేడు. అటు కేసిచూస్తే కొండవెనక ఊరేదో కాలిపోతున్నట్టుగా ఉంది. అంతటా ఎరుపు రొలు కమ్ముకొంది. నూకరాజు కొంచెం ముందుకి నడిచేసరికి ఓ ఆడమనిషి ఏడుపు అతని చెవినిపడింది. ఏడుపు వినిపిస్తోందే కాని ఏ ఆడమనిషి కనిపించడం లేదతనికి. తొందరగా ముందుకి నడుస్తూ అతను 'నాగరత్నం కాదుకద' అనుకున్నాడు వెళ్లి జనాన్ని ఒత్తిగిలించి చూస్తే అక్కడ నాగరత్నం నిజంగా నేలేదు అప్పాయమ్మ నెత్తీ నోరూ కొట్టుకొని ఏడుస్తోంది

ఏం జరిగిందని అడుగుతే 'గోరమైపోనాదిబాబూ', 'గోరం గోరం బాబూ', 'గోరం కాకపోతే ఇంకేటి బాబూ' అనడమేకాని ఎవరూ ఏమీ చెప్పరు అప్పాయమ్మ మాట్లాడదు ఏడుపు మానదు ఆఖరికి నూకరాజు కేలువేసి అడగ్గా ఏడుస్తూ ఏడుస్తూ అప్పాయమ్మా, దగ్గుతూ దగ్గుతూ ఓ ముసలాడూ కలిసి జరిగిన సంగతంతా చెప్పేరు కొన్ని కొన్ని వివరాలు కొంత మంది మధ్య మధ్య అందిచ్చేరు

అసలు ఏమిటి జరిగిందిటా అంటే

సాయంకాలం నాగరత్నం ఇంటికి 'తెగొచ్చేసి' బజారుకివెళ్లి గింజలు కొనుక్కొచ్చి వాటిని చేట్లో వేసుకొని ఇంటి ముందు కూర్చొని చెరుగుకుంటోందట. అంతలో ఎండాడ మనిషొకామె 'ఎర్రగా పొడుగ్గా ఉంటది, పొడుక్కాళ్ళదాకూ, ఊరంపెరమందిరీ ఎరుగుగు', ఆ మనిషి గోనెమూటొకటి నెత్తిని పెట్టుకొచ్చి, మూట దించుకొని 'ఒఁమ్మ కుశిన్ని మంచి నీళ్లోయ్యమ్మా, దప్పికేస్తంగి' అని నాగరత్నాన్ని మంచినీళ్లడిగిందట అమాయి కమ్మంచి కూతురు, నాగరత్నాని కా మనిషిగురించేమీ 'తెల్దు గా' అంచేత 'సేటక్కడే ఎట్టి ఇస్తానుండమ్మా' అన్జెప్పి నీళ్ళకోసరం ఇంట్లో కెళ్లిందట, ఇంతలో ఆపొడుక్కాళ్ళదాకూ ముండ పోలీసు వాళ్ళొస్తున్నారని ఎలా పసిగట్టిందో ఏమోకాని, ఇంట్లోంచి నాగరత్నం వచ్చే లోపున తెచ్చిన మూటక్కడే వగ్గేసి మాయమైపోనాదట. అంతలో 'ఏవమ్మోయ్ ఏటామూటా?' అని అడిగేరట వాళ్ళు, ఎవరూ? పోలీసోళ్ళు' ముగ్గురు యూనిఫారాల్లో ఉన్నారు ఒకడు మన తెలుగోడి బట్ట కట్టుకున్నాడు. వాళ్లలా అడిగే సరికి ముంతలో తెచ్చిన నీళ్ళు ముంతలో అక్కడే వార్చేసి, రెండడుగులు వెనక్కి జరిగి "నాకు తెల్దుబాబూ" అందిట నాగరత్నం "నీకు తెలకుండా నీ ఇంటికాడ కెలా ఒచ్చింది? రెక్కలెట్టుకొచ్చి వాలిందా? సేక ఇత్తన వేస్తే మొల్సిందా?" అని వాళ్ళడిగేరట ఆ మాటమీదట "ఆడమనిసి దప్పికడిగింది ఆమని సాగ్గేసి పోనట్టుంది బాబూ" అందిట నాగరత్నం

"ఆ మూటేటో తెల్దని ఓ పాలన్నావు, ఆడమని సాగ్గేసిందని మరోపాలన్నావు. మరింక మూడోపాలేటంటుందో ఏటో మూటిప్పి సూడండ్రా" అని ఆళ్లలో ఆ తెలుగు బట్టేసుకున్న జవాను మూట విప్పించేసెట

మూట విప్పించిచూస్తే అందులో ఇంకేముంది? ఒక రెండుమూర్ల మోటారు ట్యూబు ముక్కనిండా మూడుగేలన్ల దొంగసారా ఉంది చూసి గజగజ వణికిపోయింది నాగరత్నం

"అమాయకపుదీ ఆడముండ కూతురూ నిజమే! కాని ఇవన్నీ పోలీసోడికొక్కలా బాబు? అంజలీదేవి బొమ్మనా మసక్కున్నావుకాని, ఎవుడికీ తెలకుండా ఏకొళ్లనుంచోలె ఈ యాపారం వూ, అన్జెప్పి ఆడపిల్లని నడునడుమని టేసన్‌కి నడిపించుకుపోనారు గోరం కాకపోతే ఇంకేటి నూకరాజు బాబూ"

అని ముగించేరు వాళ్ళు

ఇంతా జరిగి ఎంత సేపయింది? ఒగంట సేపయింది! మరైతే నాగరత్నం పోలీసు స్టేషన్లోనా ఉండె? అక్కడే వుంచుండాలి. ఆ పొడుక్కాళ్ళ దెక్కడికి పోయింది? ఏమో ఎవడికి తెలుసు మీరంత మందీ ఎందు కూరుకున్నారు? మేఁవేం గాళ్లెదే ఎక పోతే ఈ కథంత మీకెలా తెలిసింది? 'మాస్తే మట్టుకు మేఁవేం చేస్తాం, మమ్మల్నికూడా నడమంటె సువ్వొచ్చి ఇడిపిస్తావా ఏటి?'

మరైతే ఇప్పుడేం చెయ్యడం?

గాభరాపడ్డం తప్ప మరేం చెయ్యడమో తెలియడంలేదు నూకరాజుకి ఇంటికి పోలీసు వాడొచ్చినా, అప్పులవాడొచ్చినా, యములాడొచ్చినా ఇంట్లో అందరికీ ఒక్కలా ఉంటుంది ప్రాణాలు పోతున్నట్టుగా ఉంటుంది అవతల అప్పాయమ్మకూడా గాభరాగానే ఉంది ఆమె అకస్మాత్తుగా ఆపదలో పడ్డంతో గోతులో పడ్డట్టుగా అయిపోయింది అయితే, గోలచెయ్యడమే కాని గోతులోంచి లేవడమెలాగనే ఆలోచన లేదావిడకి నూకరాజు బాబూ! అన్నిటికీ నువ్వే ఉన్నావంటుంది ఆమాట నూకరాజుకి మరీ భారంగా ఉంది. అయితే ఇప్పుడేం చెయ్యాలి? నూకరాజుకది తెలీదు. అతను తెలివైనవాడే కాని అతనగ్గిర కిటుకు లేవు. మరి—ఎర్రటోపి, వంటసారా, దొంగకేసు, నల్లకోటు, తప్పుడు సాక్ష్యం, తెలియనితీర్పు, జరిమానా, జెయిలుగోడ, ఇటువంటి వాటితో వ్యవహరించి తప్పించుకుతిరిగి ఘన్యాడవాలంటె కిటుకులు తెలియాలి నూకరాజు కవే తెలీవు

అన్నీ తెలిసిన మేస్త్రీకడున్నాడు అతనగ్గరకి వెళ్తానన్నాడు నూకరాజు.

ఎక్కడికైతే ఎల్లు. కావాన్న పిల్లని మట్టుకు నా కప్పజెప్పు, నూకరాజుబాబూ,

తండ్రీ, ఒచ్చే జనమలో నీ కడుపున పుడతానంది అప్పాయమ్మ

కాళ్ళీడ్చుకొని నూకరాజు వెళ్ళేసరికి మేస్త్రి మందుమీదున్నాడు నిషామీద ఉన్నప్పటికీ (నిషామీద ఉండడంవల్లనే) అతగాడు నూకరాజు చెప్పిందల్లా శ్రద్ధగా విన్నాడు వింటూ చుట్టపొగని బాగా లాగేడు. విని, చుట్టపొగని దూరంగా వదిలేడు పోలీస్ స్టేషన్లో జామీను తెచ్చుకోవాలంటే అయిగురూపాయలుండాలన్నాడు మేస్త్రి తెస్తానన్నాడు నూకరాజు కాని మరో ప్రమాదముందన్నాడు మేస్త్రి జామీను కోసం స్టేషన్‌కివెళ్తే వాళ్లు నిన్నుకూడా తోసేసిన కొట్లో తోసేగల ప్రమాదముందన్నాడు నాగరత్నంకోసం అలాగే వెళ్లి కొట్లో కూర్చుంటానన్నాడు నూకరాజు ఇద్దరూ వెళ్లి కొట్లోకూర్చుంటే మీ ఇద్దర్నీ బైటకి లాగేదెవరు?' అని ప్రశ్నించేడు మేస్త్రి అయినా పోలీసువాళ్లు అనవసరంగా నన్నెందుకు లోన వేస్తారు? అని అడిగేడు నూకరాజు, నీకేం తెలీదు పొమ్మన్నాడు మేస్త్రి తరవాత కొన్ని ప్రశ్నలు వేసేడు

పిల్ల వయసులో ఉందా? అంది. పిల బావుంటుందా? సినిమాస్టార్‌లా ఉంటుంది పిల్ల నేరమేం చెయ్యలేదు నిజమే కదా? చెయ్యలేదు! నిజం' అంగుచేత ఏమున్న మాటే? 'ఆపిల్లమీద అబద్ధం కేసెట్టడానికి' పిల్లమీద వాళ్లకి కావేషీ అయినా ఉండుండాలి లేదా, ఆపిలమీద వాళ్లలో ఎవడో ఒకడు కన్నైనా వేసుండి, చేతుగోకి లాగుదామనే ఉద్దేశంతో లోపలకి లాగుండాలి ఏదైనప్పటికీ 'ముద్దొచ్చినవ్వాడే స్తే నిన్ను మరి తోసేరా వాళ్లు?! అన్నాడు మేస్త్రి

"అంతన్యాయమా!" అన్నాడు నూకరాజు

"నీకూ నాకూ అన్యాయం కాని పోలీసోడికి న్యాగు ఆడిసేతిలో పవరుంది సేతిలో పవరుంటే సతికి పొగరెక్కుతుంది" అన్నాడు మేస్త్రి

"మరైతే జడ్జికోర్టు లేదా?" అనడిగేడు నూకరాజు.

"ఉండకేం! జడ్జికోర్టూ వుంది మున్సిబుకోర్టూవుంది. మేస్ట్రేటు వోరి కచేరీకూడావుంది కాని అక్కడోళ్లందరూ కళ్లుమూసుకొని తూకం ఎయ్యాలంట అదిరూలు నీకు తెల్దు కామోసు" అని మనకి పడుకులుంచి సంపణీ అయిన న్యాయశాస్త్రపు మూలసూత్రాన్ని నూకరాజుకి టూకీగా తెలియజేసేడు మేస్త్రి

మేస్త్రి దగ్గర అన్ని విషయాలూ తెలుసుకున్నాడు కాని ఏమీ హెచ్చరిగ్గా లేదు నూకరాజుకి ఆఖరికి మేస్త్రి ఏంవిటన్నా దంటే లేపుకోర్టు కెళ్లాల. లేకేరంగేసో అక్కడే తేలాల" అన్నాడు.

ఇంటికి తిరుగుముఖం పట్టేడు నూకరాజు మనసంతా ఎలా ఉండాలో అలా ఉంది నూకరాజుకి అంతా తల్చుకొంటే అతనికి అదోవిధమైన జాగుప్స కలిగింది. నాగరత్నం పోలీస్‌స్టేషన్లో ఉన్నదనే విషయం అతని అణువణువునీ బాధపెట్టింది. బంగారు చిలకని అలుగుడ్డలో అదిమిపెట్టినట్టుగా అనిపించిన దతనికి మల్లెమొగ్గని మంటలోకి తోసినట్టుగా అనిపించిందతనికి అసలతనికి ఇంటికి వెళ్లాలనిపించడం లేదు పిల్ల ఏదని అడిగే అప్పాయమ్మతో ఏమని చెప్పడం? నాగరత్నాన్ని, వెన్నెల్లో ఇసక తిన్నెమీద కూర్చొని, ముద్దులాడ్డం సులభమే "ఆపని నువ్వే చెయ్యాలా ఏంవిటి? చాలామంది చెయ్యగల్రు, చేతనైతే చిలక పిట్టని ఇనపతెరవెనకనుంచి బైటకి లాగి అప్పుడు చూపించు నీ తడాఖా" అని అప్పాయమ్మ అనదు కాని ఆమె అన్నట్టుగానే బాధపడేడు నూకరాజు అతనికి ఒళ్లంతా చెమటపట్టేసింది అతనికేదో ఒకటి చేసిద్దామనుంది కాని ఏం చెయ్యాలో ఏవిధంగా చెయ్యాలో అతనికి తెలియడం లేదు బలమైన పనులు చాలా చెయ్యగలడతను కాని ఈ పని చెయ్యలేకుండా

# ★ అధికారి ★

ఉన్నాడు అరవై ఘనపుటడుగుల బండ రాయిని ఎత్తుకు తిరగగలిగి అరడుగులే లోతున్న నీట్లో ఈదలేని వాళ్లా అయిపోయే డతను ఇంటికి వెళ్తూన్నప్పుడు నెత్తిమీద ఏ బరువూ లేకపోయినా అతని అడుగు నెమ్మదిగానూ బరువుగానూ పడుతోంది ఆ అడుగలా బరువుగా పడపడి ఇంటికి అరవై అడుగులదూరంలో ఆగిపోయింది ఆగి చూస్తే అతనికి మరో దృశ్యం కనిపించింది

అప్పాయమ్మ గది గుమ్మంలో దీపం వెలుగుతోంది దీపం పక్క నాగరత్నం కూర్చొనుంది ఆమె దేదీప్యమానంగా వెలుగుతోంది

చిన్నప్పుడోకసారి నూకరాజింట్లోంచి ఆ వొకటి తప్పిపోయింది దానికోసం ఊరంతా తిరిగి తిరిగి అది దొరక్కపోగా 'వెర్రి మొహం' వేసుకొని వనక్కి తిరిగొచ్చేడు ఇంటికొస్తే అది గుమ్మంలో కట్టేసుంది అప్పుడు సంతోషించకుండా ఉండలేకపోయాడు కాని అదోలా 'ఫీ' లయేడు కళ్ళుమూసి జెల్లకొట్టి కంటిముందు మిఠాయిపొట్లం పెటినట్టయిందతనికి తిరిగి అలాగ మళ్ళీ ఫీలయేడు నూకరాజు

రాత్రి పదిగంటలవుతుంది గుమ్మంలో నాగరత్నం కూర్చొనుంది ముంగిట పదిపదిహేను మందిదాకా కొలువుతీర్చి కూర్చున్నారు మామూలుస్థానంలో విరిగిన ఇటిక ముక్క వేసుకొని అప్పాయమ్మ కూర్చొనుంది, వాళ్ళందరికి ఎగురుగా నులకమంచం మీద ఠీవిగా మరో ఆసామీ కూర్చున్నాడు నూకరాజుతో పాటు మరో నలుగురైదుగురు కూడా అప్పుడేవచ్చి కూర్చోటంతో అతని రాక నెవరూ గమనించలేరు

నూకరాజు గుండెలు నీరసంగా కొట్టుకున్నాయి గుమ్మంలో పలనిమాషంగా నెత్తిమీద బరువు దిగిపోయినట్టుగా అతను తేలికపడ్డప్పటికీ, అతనికి వంట్లో సత్తువంతా కూడా దాన్తో పాటు పోయినట్టయింది చుట్టూ కూర్చున్న వాళ్లంతా మంచంమీద కూర్చున్న ఆసామీవైపే చూస్తున్నారు అతన్ని అప్పాయమ్మ తెగపొగుడుతోంది

ఆ సమయంలో నూకరాజుకి తన చిన్ననాటి సంగతొకటి తటాల్న గుర్తుకొచ్చి ఆనాటి దృశ్యం అతని కళ్ళముందు నిల్చింది

తల్లీ తండ్రీతో పల్లెటూళ్ళోనే ఉండేవాడు నూకరాజు అప్పటికింకా చిన్నవాడు పశువుల్ని మేసే పనంతా అతనే ఆ రోజుల్లో అప్పట్లో అతనికి రివ్వలకొండ అనే చెలికాడుండేవాడు ? రోజున— ఇంకా మధ్యాహ్నం కాలేదు— పది పదకొండు గంటలవుతుందేమో— తను కళ్ళెందగ్గర పాకలో పొయ్యిదగ్గ రెండుకోగాని కూర్చున్నాడు నూకరాజు

బైట కనుచూపుమేరలో అంతా పచ్చపచ్చగా ఎర్రెర్రగా కనిపిస్తోంది గాలి మందమందంగా వీస్తోంది గుమ్మెక్కడా లేకపోడంచేత, వడబోసినట్టుగా ఎండ శుభ్రంగా ఉంది రాజుగారి లోగిలిలో సిమెంటుగచ్చులా ఆకాశం చక్కగా సాఫుగా మెరుస్తోంది దూరాన్నున్న కొండల గుంపులు ఘనీభవించిన మబ్బుల్లా కనిపిస్తున్నాయి నీట్లో చేపలగుంపులా ఆకాశంలో కొంగలబారొకటి గీతగీసుకుని గిడిమీదపోతున్నట్టుగా నిదానంగా పోతోంది కాలవకవతలివైపున మామిడతోటల్లో చిలకలు చేసే అల్లరి కలకల వినిపిస్తోంది దూరాన్న రామినాయుడిపోలంలో కుప్పమీదికి చెనుకట్లు ఎగుగుతున్నాయి కుప్పమీదకుర్రవాడొకడు ఎగిరి గెంతి తలపాగా ఊడిపోగా కేకలేసి సర్దుకొంటున్నాడు ఎక్కడో ఆడంగులు పాడేపాట గాలికి కెరటాలు కెరటాలుగా వినవస్తోంది అల్లంతదూరంలో గట్టంట ఓ పదేళ్ళపల్లి కుడిచేతిని చక్రంలాతిప్పుకుంటూ చెంగుచెంగున పరుగెడుతోంది కొంగోని కమ్మలసాలలో కూర్చొనిచూస్తే అంతా స్వచ్ఛంగా సుందరంగా నిజంగా దేవుడు సృష్టించినట్టుగానే ఉంది. పచ్చగా పచ్చగా నీలంగా నిర్మలంగా లోకంలో పాపంఅంటూ ఎక్కడా లేనట్టుగా ఉంది

సాల్లో పొయ్యిదగ్గర కూర్చున్న వాడు లేచి బైటకొచ్చి సాలముంగిట నిల్చున్నాడు నూకరాజు నిల్చున్నాడేకాని నిల్చున్న కొంతసేపటిదాకా తనపక్క నే రివ్వలకొండ కూడా నిల్చున్నాడని మనుకోలేదతను

రివ్వలకొండ అంత నిశ్చలంగా ప్రతిమలా నిల్చున్నాడు ఆ కుర్రవాడి ముఖం ఆ సమయంలో అతి అమాయకంగా ఉంది బాలబుద్ధుళ్ళ ముఖం పెట్టి నిల్చున్నాడు కాని వెనక్కి దాచిన అతని చేతుల్లో ఆలుగ్గుడొకటుంది "ఏంవిట్రా వీడెంగు కిలా నిల్చున్నాడూ?" అని నూకరాజు అనుకునే లోపున ఒపిట కీచుకేసుమంది అంతలో మరోపిట్ట కూడా కీచుకీచుమంది ఏవిటని చూసే రివ్వకొండ చేతిలో అలుగ్గుడ్డమాత్రం ఒపిట్ట—మూడురంగుల్లో ముద్దుగా ఉందది— గిలగిల్లాడుతోంది పక్కనున్న జామిచెటు మీంచి మరోపిట్ట గాభరాపడి రివ్వున రెక్కలు పైకెగిరి మళ్ళ చెట్టుమీద వాలి తన (ప్రియుడా? (ప్రేయసా?) నేస్తంకోసం

(61-వ పేజీ చూడండి)

# నక్షత్ర ఫలితాలు

**| 26-8-59 మొదలు 1-9-59 వరకు |**

### గ్రహస్థితి

| | | | |
|---|---|---|---|
| శ | | | |
| | 30 తేదీని బుధుడు సింహములో ప్రవేశించును. వృషభ, మిథున, కర్కాటక సింహ ములలో చంద్రుడు | | బు |
| | | | ర వి |
| కే | గు | | శు రా |

*** [అశ్విని చూ, చే, చో, లా] ***

ఈవారము యత్న కార్యములకు ఆలస్యము వర్తకులకు లాభము తక్కువ ఆత్మీయుల ఆరోగ్యము చెడుటచే చికాకు కలిగిస్తుంది ఉద్యోగస్తులకు వనపర్వత ప్రాంతములకు బదిలీ అయే సూచనలున్నవి రహస్యములను కని పెట్టుటకు నియోగించబడుతారు వారమంతా చికాకుగా వున్నా వారాంతమందు అజ్ఞాత మిత్రుని సహాయమువల్ల కార్య సిద్ధి జరుగుతుంది

*** భరణి [లీ, లూ, లే, లో] ***

ఈవారము ధనాభావము ఎక్కువ ఎవరి సహాయమువల్ల కార్యసాధన పొందుదామనుకున్నారో వారివల్లనే ఆటంకములు కలుగుతాయి అయినా ఈశ్వరానుగ్రహమువల్ల క్రమేణా కార్యానుకూలత అవుతుంది ఇంట్లో వారి ఆరోగ్యము బాగుండదు ఉద్యోగస్తులకు ఒత్తిడి వర్తకులకు నిరాశ విద్యార్థులకు మంచి రోజులు కావు వారమంతా ఆందోళనగా వున్నా సజ్జన సాంగత్యము పుణ్యక్షేత్ర సంచారము దేవతాదర్శనము ప్రద్రవ్య లాభము కలుగును

*** కృత్తిక [అ, ఈ, ఊ, ఏ]**

ఈవారము అనుకూలత కన్న ప్రతికూలత ఎక్కువ యత్న కార్యములు శ్రమాధిక్యముతో ఫలిస్తాయి కోరుదామనుకున్నా అనుకూలిస్తాయి పరోపకారానికి ప్రయత్నించి నాగక నిందలు పొందుతారు భార్యకు అనారోగ్యము కలుగుతుంది ఇచ్చి పుచ్చు కొనేపట్ల వివాదాలు ఉద్యోగస్తులకు అధికారుల ఒత్తిడ వున్నా తోటివారి సహకారము లభిస్తుంది వారమంతా వర్తకులకు నిరాశగా వున్నా వారాంతమున స్వల్ప అనుకూలత కలుగుతుంది

*** రోహిణి [ఓ, వా, వీ, వూ] ***

ఈవారము ఎన్ని అవాంతరములువచ్చినా పట్టుదలతో ప్రయత్నించి కార్యలాభము పొందుతారు ఆశించిన డబ్బు అందక అప్పు చేస్తారు సోదర సహాయము కలుగుతుంది ఆత్మీయుల వల్ల నిందలు దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును గనుల యజమానులకు, భూస్వాములకు, ఇంజనీరింగు శాఖ ఉద్యోగులకు లోహపు సామానుల వ్యాపారస్తులకు కష్టముతో కూడిన లాభము 30 న ప్రమాద సూచన.

*** మృగశిర [వే, వో, కా, కీ] ***

ఈ వారము మీకు యోగప్రదము బంధువుల సహాయముతోనూ, అధికారుల సహాయముతోనూ, ఆటంకములు గడిచి ఫలం పొందుతారు ఆదాయము అభివృద్ధి అవుతుంది వైద్య జ్యోతిషశాస్త్ర ప్రసంగాలు చేస్తారు ఈశాన్యదిక్కునుండి క్షేమవార్త తెలుస్తుంది గణిత శాస్త్రజ్ఞులకు, కవులకు, శిల్పులకు, నటనటులకు యోగకాలము 26, 27 తేదీ లో ధనలాభము, కార్యసిద్ధి

## బి. నరసింగరావు

*** ఆరుద్ర [కూ, ఖ, జ, ఛ] ***

ఈ వారము మీకు యోగదాయకముగా వుంటుంది ఆశించిన డబ్బు చేతికివస్తుంది నూతన కార్యములు ప్రారంభిస్తారు కోర్టు దావాలలో అనుకూలత వుంటుంది పండిత గోష్ఠి జరిపి నూతనవిషయాలు తెలుసుకుంటారు వారమంతా శుభయోగములతో కూడివుంటుంది 27, 28 తేదీలలో ధన లాభము, కార్యసిద్ధి పుత్రుల అభివృద్ధి, న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుగా వుంటుంది

*** పునర్వసు [కే, కో, హా, హీ] ***

ఈవారము వినోదములలో పాల్గొనుట, దధిక్షీర సంఘసంగాగ్ర యుక్త భోజనము రజత పాత్రలో భుజించుట, నీటిమీద ప్రయాణము చేయుట, తలచిన కార్యములలో జయము, తెల్లటి వస్త్రములు కొనుట మొదలగు యోగములు కలుగును. ప్రత్తి, దూది నూలు, బట్టలు, బియ్యము, వెండి, ద్రవపదార్థ జనిత వస్తువులు క్రయవిక్రయాముల వర్తకులకు లాభము. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటనటులకు మేలుగా వుంటుంది. 30 న అధిక ఖర్చులు ఆందోళన.

*** పుష్యమి [హూ, హే, హో, డా] ***

ఈవారము ధనధాన్యవృద్ధి యత్న కార్య లాభ వివాహాది శుభకార్యములగురించి ఆలోచనలు, ఇష్ట వస్తులాభము, పరోపకారము వల్ల కీర్తివంటి రాజయోగములు కలుగును. విలువగల వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు లాభము కవులకు, గాయకులకు కళాకారులకు, నటీనటులకు యోగకాలము ఆప్తులతో వింధు వినోదము

*** ఆశ్లేష [డీ, డూ, డే, డో] ***

ఈవారము మీకు కార్యభారము ఎక్కువ. రాబడ తక్కువ గృహావసరములు తీరనంగున కళత్రుల ఆరోగ్యము చెడుచున్నట్లు సూచనలు కనపడగానే ఔషధ చికిత్స పొందడమే కాకుండా గ్రహరాజైన రవికి శాంతి చేయించుటమేలు. ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు, వర్తకులకు ఆందోళన రాజకీయ నాగులకు స్వల్పానుకూలత 27,2 పితృవర్గ సహాయము, ధనలాభము 30 న అనారోగ్యము.

### —ఈవారపు ధరలు:—

నూలు, బట్టలు -మార్పు లేదు
నూనెదినుసులు -తగ్గుదలలో వుండును.
ఆహారధాన్యములు -స్వల్పముగా హెచ్చును
బెల్లము, పంచదార, చింతపండు- నిలకడగా వుండును.
పప్పుదినుసులు -మార్పు లేదు.
వెండి, బంగారము - స్వల్ప తేడాలో వుండును.
సువృష్టిగావుండి సర్వత్ర వర్షించును.

జన్మనక్షత్రమును బట్టిగాని, జన్మ నక్షత్రము తెలియనివారు నామనక్షత్రము (వారివారి పేర్ల ననుసరించి పేరు మొదటి యక్షరము)ను బట్టిగాని ఫలితాలు తెలుసుకొనునది కృష్ణ అను పేరునకుమృగశిర నక్షత్రమును, కృష్ణ అను పేరునకు స్వాతియు, శ్రీధరుడను పేరునకు చిత్తయును, క్షేత్రపాలకుడను పేరునకు హస్తయును, భీముడు, భైరవుడు అనే పేర్లకు పూర్వాషాఢయునూ చూచుకొనునది

 నక్షత్రఫలితాలు 

### * మఖ [మా, మీ, మూ, మే.]

ఈవారము మీకు మొదట్లో నిరాశగా వున్నా అజ్ఞాత మిత్ర సహాయమువల్ల కార్య లాభము పొందుతారు ధనలోపమువల్ల ఆందోళన ఉద్యోగస్థులకు వినుంత బాగుండదు విద్యార్థులకు బద్ధకమువల్ల చదువుసాగదు వాగములో అవయోగములు వున్నా, మిత్ర సహాయము కార్యసిద్ధి విదేశీయుల పరిచయము, విచిత్ర వస్తు సంపాదన వంటి శుభ యోగములు కూడా వుంటవి.

### * పూర్వఫల్గుణి (పుబ్బ) *
### మో, టా, టీ, టో

ఈవారము మీరు సహాయము పొంద దలచుకున్న వ్యక్తి మూలముగా కార్యహాని అవుతుంది గనాభావము ఎక్కువగా వుంటుంది ఇంట్లోవారి ఆరోగ్యము ఆందోళన కలిగిస్తుంది ఆధ్యాత్మిక చింతవల్ల దైవము పై భారము వేసి కార్య లాభము పొందుతారు. ఉద్యోగస్థులకు ఒత్తిడి. వ్యాపారస్థులకు నిరాశ. విద్యార్థులకు మంచికాలముకాదు పుణ్య క్షేత్ర సంచారము, దేవతాదర్శనము విచిత్రములను చూచుట, వస్త్రసవ్యలాభము జరుగును. వారమంతా అవయోగ శుభయోగ మిశ్రమముగా వుంటుంది

### * ఉత్తరఫల్గుణి (ఉత్తర) *
### (టే, టో, పా, పీ)

ఈ వారము మీకు అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ యత్నకార్యములు ఎక్కువ శ్రమతో ఫలిస్తాయి. కోర్టుదావాలు అనుకూలిస్తవి. ఇతరులకు సహాయము చేయబూని సఫలము గాక నిందలుపొందుతారు ఇచ్చిపుచ్చుకోవటములో వివాదములు వస్తవి ఉద్యోగస్థులకు అధికారుల అనాదరణ, తోటివారి సహకారము, వర్తకులకు వారమంతా నిరాశ, వారాంతమున మేలు విద్యార్థులకు చదువు బాగా సాగదు భార్యకు అనారోగ్యము కలుగుతుంది

### * హస్త [పూ, ష, ణ, ఠ] *

ఈ వారము ఎన్ని ఆటంకములు వచ్చినా పట్టుదలతో ప్రయత్నించి కార్యసాధన పొందుతారు ఆశించినడబ్బు సమయానికి అందక అప్పుచేస్తారు దెబ్బలుతగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును. రసాయనిక శాస్త్రజ్ఞులకు, లోహ, ఖనిజ వ్యాపారస్థులకు కష్టముతో కూడినయోగము. గనుల యజమానులకు, యంత్రములు నడుపు నిపుణు

### *చిత్త [పే, పో, రా, రి]*

ఈ వారము మీకు యోగకాలము బంధువుల సహాయము, అధికారుల సహాయము కలుగుటచేత వచ్చిన ఆటంకములు గడిచి కార్యసిద్ధి పొందుతారు ఆదాయము వృద్ధి అవుతుంది శాస్త్రప్రసంగాలలో పాల్గొంటారు బంధువుల క్షేమవార్త తెలిసి ఎంతో సంతోషము పొందుతారు విద్యార్థులకు ఉత్సాహముగా చదువు సాగుతుంది. గణిత శాస్త్రజ్ఞులకు, కవులకు శిల్పులకు, నటీనటులకు మేలు

### * స్వాతి [రూ, రే, రో, తా]*

ఈ వారము మీకు మంచియోగము అనుకున్న డబ్బు చేతికివస్తుంది ఇబ్బందులు తీరుతాయి దావాలలో గెలుపుపొందుతారు పిల్లలఅభివృద్ధికి చేసేప్రయత్నాలు ఫలిస్తాయి గ్రంథపఠనవల్ల విజ్ఞానాభివృద్ధి కలుగుతుంది న్యాయవాదులకు, న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకూ మేలు కాలము ఉద్యోగస్థుల హోదా పెరుగుతుంది. విద్యార్థులు శ్రద్ధగాచదువుకుంటారు.

### * విశాఖ [తీ తూ, తే, తో] *

ఈ వారము మీకు యోగదాయకము ధన యోగము వుంటుంది సంగీత, సభలు, కవితా గోష్ఠివంటి వినోదములలో బంధువులతో కలిసి పాల్గొని మృష్టాన్నభోజనము వెండి పాత్రలలో చేస్తారు శుభకార్యములగురించి ఆలోచనలు చేస్తారు నీటిమీద ప్రయాణము చేయవలసి వస్తుంది. నూలు, బట్టలు, బియ్యము, వెండి వర్తకులకు లాభము విద్యార్థులకు ఉత్సాహముగా చదువు సాగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము.

### * అనూరాధ [నా, ని, నూ, నే] *

ఈ వారము కూడా గతవారము వలెనే యోగదాయకముగా వుంటుంది అసంపూర్తిగా వుండిపోయిన పనులు లాభదాయకముగా ముగుస్తాయి శుభ పుణ్యకార్యాలలో పాల్గొంటారు నూతన గృహ నిర్మాణమునకు ప్రయత్నములు చేస్తారు. వాహనయోగము కలుగుతుంది ఉద్యోగస్థులకు హోదా పెరుగుతుంది. వర్తకులకు విలువగల వస్తువు క్రయవిక్రయములలో ఎక్కువ లాభము వారమంతా శుభయోగములతో కూడివున్నా కుటుంబకలహముచే ఆందోళన కలుగుతుంది కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగకాలము

### * జ్యేష్ఠ [నో, యా, యీ, యూ,] *

వుండగు గృహోపకరణములు తీరక స్పర్ధలు వస్తాయి ఆరోగ్యము చెడుచున్న చిహ్నాలు కనబడగానే ఔషధచికిత్స పొందడము రవికి శాంతిచేయించడము మంచిది ఉద్యోగస్తులకు కొత్త సమస్యలు వర్తకులకు ఆందోళన విద్యార్థులకు చదువు సరిగా సాగదు వారమంతా భయాందోళనలతో కూడివున్నా పితృవర్గ సహాయము, కార్యలాభము, ప్రయాణము కలుగును.

*** మూల [యే, యో, బా, బీ] ***

ఈ వారము నిరాశగా వున్నా అజ్ఞాత మిత్ర సహాయమువల్ల కార్యలాభము అవుతుంది ఇంట్లోవున్నవారి ఆరోగ్యము చెడుటచే ఆందోళన కలుగుతుంది ఉద్యోగస్తులకు స్వల్పఅనుకూలత, వర్తకులకు వారంతమంగు లాభము వారమంతా ఉద్రేకముగా వుంటుంది. విదేశీయుల పరిచయము, అపురూప వస్తుసంపాదన కలుగుతవి. విద్యార్థులకు చదువు బాగా సాగదు.

***పూర్వాషాఢ | బూ, ధ, భా, డా |***

ఈ వారము మీకు మిశ్రమయోగము, ఆశించిన సహాయము లభించక అవసరములు తీరక అశాంతి కలుగుతుంది అయినానూ ఈశ్వరానుగ్రహమువల్ల కష్టాలను గడిచి కార్య సిద్ధి పొందుతారు వర్తకులకు చాలాకాలము నుండీ నిలిచిపోయిన బాకీలు వసూలవుతవి. ఉద్యోగస్తులకు అధికారుల అనాదరణ పుణ్యపురుషుల సాంగత్యమువల్ల మనోవికాసము కలుగుతుంది వారమంతా అశాంతివున్నా వారాంతమందునష్టద్రవ్యలాభముకలుగుతుంది

***ఉత్తరాషాఢ | బె, బో, జా, జీ |***

ఈ వారము అనుకూలతకన్న ప్రతికూలత ఎక్కువ ఇచ్చిపుచ్చుకునేపట్ల వివాదములు వచ్చి మనోవ్యథ కలుగుతుంది కోర్టు వ్యవహారములు అనుకూలించినా ఆ సంతోషము అమిత ఖర్చులవల్ల వుండకుండా పోతుంది. భార్యకు అనారోగ్యము గలిగే సూచనలున్నవి. మినుములు, కొర్రలు, రాగులు, ఉప్పు, నువ్వులు, నూనె, వ్యాపారస్తులకు లాభయోగము ఇతర జాతులవల్ల గౌరవము కలుగుతుంది. 30 న భార్య ఆరోగ్యభంగము, అధిక ఖర్చులు

*** శ్రవణము [జూ, జే, జో, ఘా | ***

ఈ వారము ఎంత ప్రయత్నించినా యత్నకార్యములకు ఆటంకములు కలుగుతునే వుంటవి అయినా పట్టుదలతో కార్యలాభము పొందుతారు సోదర సహాయమువల్ల ఒడిగుడుకులు సద్దుకుంటాయి దెబ్బలు తగిలే ప్రమాదము జాగ్రత్తవల్ల తప్పవచ్చును గనుల యజమానులకు, లోహ, ఖనిజ వ్యాపారస్తులకు పోలీసుశాఖ ఉద్యోగులకూ మేలుకాలము 30 న ప్రమాద భయము అధిక ఖర్చులు.

*** ధనిష | గా, గీ, గూ, గే | ***

ప్రయత్నించినపనులు నెరవేరుతవి. ధనలాభము కలుగుతుంది ఈశాన్యదిక్కునుండి క్షేమవార్త తెలుస్తుంది. బంధుదర్శనము, శుభకార్యాలోచనలు కలుగుతవి. గణిత, జ్యోతిష శాస్త్రచర్చలు జరుపుతారు ప్రత్తి, దూది, నూలు, బట్టలు, ఇత్తడి, కంచు వర్తకులకు లాభదాయకము. కవులకు, శిల్పులకు, చిత్రకారులకు నటీనటులకు మేలుకాలము. 30 న అధిక ఖర్చులు.

***శతభిషం [గో, సా, సి, సూ |***

ఈవారము మీకు శుభయోగము ఆశించిన డబ్బు చేతికివస్తుంది. ఇంట్లోశుభకార్యాలకు ప్రయత్నాలు చేస్తారు పుణ్యకార్యాచరణ శాస్త్రచర్చలు ప్రభుత్వసన్మానమువంటి యోగములు కలుగుతవి విద్యార్థులు నూతనాంశాలను నేర్చుకుంటారు ఇంట్లోవున్నవారి ఆరోగ్యము బాగుపడుటచే ఆందోళన తొలుగుతుంది పిల్లల క్షేమలాభముకొరకు కొన్ని యేర్పాట్లుచేస్తారు. న్యాయవాదులకు న్యాయస్థాన ఉద్యోగులకు, పండితులకు, ఉపాధ్యాయులకు మేలుగా వుంటుంది

*** పూర్వాభాద్ర | సే, సో, దా, దీ | ***

ఈవారము మీరు తలపెట్టిన పనులలో జయము పొందుతారు బంధుమిత్రులతో వినోదములలో పాల్గొని మృష్టాన్న భోజనము చేస్తారు నీటిమీద ప్రయాణముచేయవలసి వస్తుంది. విద్యార్థులకు చదువు ఉత్సాహముగా సాగుతుంది. ప్రత్తి, దూది, నూలు, బంగారు, వెండి, బియ్యము, ద్రవపదార్థ జనిత వస్తువుల వర్తకులకు లాభదాయకము కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు మేలుకాలము.

***ఉత్తరాభాద్ర [దూ, శం, ఛా, ధా]***

ఈవారము మీకు యోగప్రదము. ధనధాన్యవృద్ధి వుంటుంది ఇష్టవస్తులాభము కలుగుతుంది. భార్యకు అలంకారప్రాప్తి యగును. వివాహాదిశుభకార్యాలోచనలు ఫలప్రాప్తిపొందుతాయి. పరోపకారమువల్ల కీర్తి విద్యార్థులకు చదువు చురుకుగా సాగుతుంది ఖరీదైన వస్తువుల క్రయవిక్రయములలో వర్తకులకు ఎక్కువ లాభము కలుగుతుంది. కవులకు, గాయకులకు, కళాకారులకు, నటీనటులకు యోగదాయకముగా వుంటుంది

*** రేవతి దే, దో, చా, చీ | ***

ఈవారము కార్యభారము ఎక్కువ వింత మాటలు వినుట, పరాక్రమమువల్ల ఘనత, ప్రయాణము, ధనలాభము వుండును. అకాల భోజనమువల్ల అనారోగ్యము కనబడగానే జాగ్రత్తపడుట మంచిది. ఉద్యోగస్తులకు స్వల్ప అనుకూలత, విద్యార్థులకు చదువు బాగాసాగదు. రాజకీయవాదులకు వారమంతా అలజడితోపాటు అనుకూలత 30 న

**బాల సాహితి**

# సన్యాసి-సంసారి

ఒకప్పుడు కుశావతీ నగరాన్ని చంద్రధరుడనే రాజు పరిపాలిస్తూండేవాడు. అతనికి ఓసారి చిన్న సందేహం కల్గింది — "సన్యాసి — సంసారి" వీరిలో అధికుడెవరు?" అని తన సందేహాన్ని తీర్చుకోడానికి చంద్రధరుడు, తన రాజ్యంలోవున్న మహా మేధా సంపన్నులు, సకల శాస్త్ర వేత్తలు అయిన సన్యాసులందర్నీ సమావేశపరిచాడు.

రాజుగారి సందేహాన్ని ఆలకించిన సన్యాసులంతా, ఆవిషయమై పెద్దగ ఆలోచించారు. ఆ చిన్న సందియం వారికొక పెద్ద సమస్య అయి కూర్చుంది! చివరికేమయితే నేం, కొందరు బుద్ధిమంతులు ఆలోచించి, "సన్యాసే అన్నివిధాల అధికుడు" అంటూ సమాధానం చెప్పి, "బ్రహ్మాండమైన సమస్యను పరిష్కరించాం, రాజును మెప్పించాం" అని తేలిగ్గా నిట్టూర్చారు.

కాని, రాజు సంతృప్తిని కనబరచకుండా, "సన్యాసి ఆధిక్యత ఎలా గొప్పదో నిరూపించమంటూ" కోరేసరికి, సన్యాసులందరూ తెల్లముఖాలు వేశారు. ఏం సమాధానం చెప్పలేక పోయేసరికి, రాజు ఉగ్రుడై, "వెంటనే మీరంతా పెళ్లిజేసుకుని గృహస్థాశ్రమం స్వీకరించండి!" అంటూ ఉత్తర్వు జారీ చేశాడు.

**పద్మజావేణి**

సన్యాసులు ఎంత హృదయవిదారకంగా మొత్తుకున్నా, చివరకి రాజాజ్ఞను శిరసావహించక తప్పింది కాదు!

కొన్నిరోజులు గడిచాయి. రాజు మనస్సు తన సందేహాన్ని తీర్చుకోడానికి నాటి నాటికీ తహతహ పడసాగింది. కాని తన సందేహాన్ని తీర్చడం ఎవరితరంగాకుండా ఉండటంచూచి ఖిన్నుడయ్యాడు రాజు. అటువంటి సమయంలో, కొందరు సన్యాసులు తీర్థయాత్రలు జేస్తూ, ఆ నగరుకువచ్చి చేరారు.

రాజాజ్ఞప్రకారం, వారు దర్బారులో హాజరయ్యారు. రాజు వారిని, "సన్యాసి, సంసారులలో అధికుడెవరంటూ" అడిగాడు. వారు ఏవిధంగా తప్పించుకోవచ్చుననే ఉద్దేశ్యంతో, "గృహస్థాశ్రమపు విధులన్ని సక్రమంగా నెరవేర్చే సంసారే సన్యాసికన్న అధికుడు" అంటూ జవాబిచ్చారు. రాజు తిరిగీ వాళ్లను "సంసారి ఆధిక్యతను నిరూపించమంటూ" కోరేసరికి, జవాబు చెప్పలేక, నోరు తెరిచారు వాళ్లు.

"లోకంలో పలురకాల వాళ్లు, ఏదోవిధంగా తమ ఆధిక్యతను నిరూపించుకొంటూ, బ్రతుకుతుంటారు. అటువంటప్పుడు "సంసారి"అధికుడు, గొప్పవాడు, గనుక మీరెందుకా ఆధిక్యతను పొందకూడదూ!." అంటూ చమత్కరించి, వారిని గృహస్థులుగా అయేలా చేశాడు చంద్రధర రాజు.

కొన్నిదినాలలా గడిచాయి. ఒకనాడు ఆ నగరుకు ఒక సన్యాసి వచ్చిచేరాడు. రాజుగారి కథనాన్ని విని, ఆయనగారి సందేహాన్ని బాపి, బుద్ధిగరపాలని నిర్ణయించుకున్నాడు. వెంటనే, రాజు దర్శనానికి దర్బారుకు బయలుదేరి వెళ్లాడు.

చంద్రధరుడు, మామూలుగా ఆ సన్యాసికి గూడ తనప్రశ్న వినిపించాడు. రాజుగారి ప్రశ్నకు సన్యాసి యిలా అన్నాడు.

"మహారాజా! సన్యాసి-సంసారి-వీరిలో ఒకరు హెచ్చు ఒకరు తక్కువ అని లేదు. ఆధిక్యతలో ఇరువురూ సమానులే!"...

"సరే, అలాగే! మరి అందుకు ఋజువులు చూపించు?", అన్నాడు చంద్రధరుడు.

"తప్పకుండా చూపిస్తాను మహా

## ప్రాసక్రీడలు

గున్నమావి పూసింది
కొత్త కాపు. .
మాకు పంట పండింది
కడుపు బాగ. . .
కోకిలమ్మ ఏమని
పాడెను ఈ...
"తలనిండా కమ్మని
తలపులు రా.. "
వనమంతా అందం
మనసులకా. .
ఆడే అన్నల మిన్నల
కన్నులలో. .

"రామం"

జవాబులు 64 వ పేజీలో

ప్రభూ! అయితే నేను చెప్పిన ప్రకారం మీరు కొంతకాలం నడుచుకోవాలి. అలా నా వెంట తిరుగుతూ, నేను చెప్పినట్లు ప్రవర్తిస్తే, మీ ప్రశ్నకి సమాధానం చెప్తాను!" అన్నాడు సన్యాసి.

తన సమస్యా పరిష్కారానికై, రాజు అందుకు సిద్ధపడ్డాడు. రాజ్యభారం మంత్రులపై వుంచి, సన్యాసి వెంట బయల్దేరాడు. రాజ్యపు పొలిమేరలు దాటి, చాలా ప్రదేశాలు తిరిగి, చివరికి ఒక పెద్దరాజ్యాన్ని చేరుకొన్నారిరువురూ.

ఆ రాజ్యపు రాజధానిలో రాచబాటలో పోతుండగా, వారికి దూరంగా సన్నాయి, డోలులాంటి వాయిద్యాల శబ్దాలు మృదుమధురంగా వినిపించాయి. కొద్దిసేపట్లో వారికి ఎదురుగా, పెద్ద జనసమూహము ఉత్సాహంగా అడుగులు వేస్తూ రావటం కనిపించింది. అందరికి ముందు, ఓ గుర్రంపై సైనికుడొకడు నగారా మోగిస్తూ, చాటింపుచేస్తూ "షారా హుషార్" అంటూ వస్తున్నాడు. చంద్రధరరాజు, సన్యాసి ఓ ప్రక్కగా నిలబడి, ఆ వింత ఏమిటో చూడసాగారు.

ఆ చాటింపువల్ల, "ఆ దేశపు రాజకుమారి, స్వయంగా, ఆ రాజ్యంలో తిరిగి, సరియైన వరుడ్ని తన భర్తగా ఎన్నుకోబోతూందని" తెలుసుకున్నారు. ఈ విపరీత స్వయంవరానికి వారిద్దరూ ఆశ్చర్యపోయారు.

ఆ దేశపు రాకుమారి అతిలోకసుందరి. ఆమెను వివాహమాడబోయేవాడు, ఆ రాజ్యానికి రాజు కాబోతాడు. యోగ్యుడు, సమర్థత గలవాడు, అందమైన వాడుగా వున్నవాడ్ని తన భర్తగా వరించాలని



పంతులూ, పిల్లలూ

చిత్రం: జి. ఎస్. డి. రావ్—విజయవాడ.

ఆమెవూహ! కాని యింతవరకు ఆమెకు నచ్చినవాడుగా ఎవ్వరూ లభించలేదు.

నగరంలో యిలా ప్రయాణం చేస్తూ, అక్కడక్కడ ఆగి, అందర్నీ సమావేశపరచి, ప్రతి ఒక్కర్నీ పరీక్షించడం యిప్పటికి చాలామార్లు జరిగాయి. అలాంటి సమావేశమే, యిప్పుడు వారి ఎదుట, అక్కడ జరుగబోతూవుంది. పలువురు అంగగాళ్లు ఆ సమావేశానికి దేశదేశాల్నుంచి వచ్చి హాజరయివున్నారు.

పట్టు కుచ్చుల పల్లకీ ఒకటి వచ్చి అందరిముందు ఆగింది. ఆమె వెనుక, రాజు, మంత్రులు, పరివారం వచ్చారు. రాకుమారి పల్లకీలోనుంచే అందర్నీ పరీక్షగా చూస్తూ ముందుకు పోసాగింది. "తమనే ఎన్నుకుంటుంద"నుకుని, ఊహాసౌధాలు గట్టుకొన్న ప్రతి ఒక్కరూ, రాకుమారి తమనుదాటి ముందుకెళ్లడంతో, పూర్తిగ నిరుత్సాహులై, అంతసేపూ నిలబడిన బడలికతో సడలిపోయేరు. రాకుమారిమాత్రం, యిదంతా పట్టనట్టు, ముందుకు పోసాగింది.

ఆ సమయంలోనే, ఆ వింత ఏమిటో చూడటానికి మంచి అందగాడూ, స్ఫురద్రూపి అయిన యువక సన్యాసి యొకడు అక్కడికి వచ్చాడు. సరిగ్గా పల్లకీ అతని ప్రక్కనుండి పోతున్నపుడు, రాకుమారి చూపు అతనిపై బడింది.

అతని రూపలావణ్యాలకు పరవశురాలై, ఏదో ఆకర్షణకు లోనైందామె. వెంటనే పల్లకి ఆపి, దిగి, తన చేతిలో వున్న పూమాలను అతనిమెళ్లో వేసింది.

# ★ సన్యాసి-సంసారి ★

ఈ హఠాత్సంఘటనకు బిత్తర పోతూ, ఆ పూలమాలను మెళ్లో నుండి తీసి, క్రిందపారేస్తూ,

"ఏమిటిది! చెయ్యకూడని పని చేస్తున్నావ్? నేను సర్వసంగ పరిత్యాగిని! నాకేమిటి. ఈపెళ్లేమిటి! ఛీ...ఛీ" అంటూ ఛీదరించుకొన్నాడు. రాకుమారి తెల్లబోయి నిల్చుంది. ఆమె తండ్రి అయిన ఆ దేశపు రాజు అతని రూపాన్ని చూచి మురిసిపోతూ, "పాపం! ఎవరో పేదవాడై వుంటాడు యువరాణిని పెండ్లాడటానికి జంకుతున్నాడు లాగుంది!" అనుకుని, అతనివేపు చూస్తూ,

"ఇదిగో, నాయనా! నీకేంభయపడకు నా కుమార్తెను వివాహమాడావంటే, అర్ధరాజ్యం లభిస్తుంది. నాతర్వాత రాజ్యమంతా నీవే ఏలవచ్చు! ఊఁ. ఒప్పుకో!. ." అంటూ, పూలమాలను తీసి, తిరిగి అతనిమెళ్లో వేశాడు.

సన్యాసి ఆగ్రహంతో ఉడికిపోతూ, ఛ. ఛ. .నాకు రాజ్యం వద్దు .. ఏమీవద్దయ్యా!. పెళ్లి పెటాకులు నాకక్కర్లేదు. నేను సన్యాసి అంటూ, పూలమాలను పెరికి, అవతలపారేసి, అక్కణ్నుంచి గబగబ అంగలు వేస్తూ, వెళ్లిపోయాడు.

అప్పటికే అతనిపై మనసు లగ్నమైపోయింది రాకుమారికి అతనిపై ప్రేమతో నిండిన ఆమెమనస్సు అతన్నే కోరసాగింది.. "నేనతన్నే తప్పక పెళ్లాడుతాను, లేకుంటే చచ్చిపోతాను" అంటూ, సన్యాసి వెంటపడింది. వీరి పోకడచూస్తూ, రాజూ, ప్రజలంతా ఆశ్చర్యంతో నోరుతెరుచకుని, శిలాప్రతిమల్లా నిల్చుండిపోయారు

—ఇదంతా గమనిస్తున్న చంద్రధరుడు ఆశ్చర్యంగా సన్యాసివేపు చూశాడు ఇద్దరూ రాకుమారి వెంట బయలుదేరారు.

అడవిలోపడి యువకసన్యాసి, తన్ను రాకుమారి వెంబడిస్తూండటం మొదట్నుంచీ గమనిస్తూనే వున్నాడు ఆ అడవిలో అతను పలుమార్లు తిరిగి వుండటంచేత, అందులోని దారులన్నీ అతనికి కొట్టినపిండే! అందువల్ల, కొంతదూరం వేగినతర్వాత, రాకుమారి కన్నుగప్పి, ఆ యువకసన్యాసి, దారులంబడి, అడ్డంపడి, సులభంగా తప్పించుకుని ఎటో వెళ్ళిపోయాడు.

* * *

అతన్ని అందుకోవాలని, వెంటబడి వస్తూన్న రాకుమారి, హఠాత్తుగ అతడు కనిపించకుండా పోవడంతో, బిత్తరపడింది "ఎటు పోయాడు చెప్మా!" అనుకుంటూ కనిపించిన దాగల్లా తిరుగుతూ, అడవంతా గాలించసాగింది రాకుమారి. కాని ఎంతకూ అతనిజాడ దొరకలేదామెకు సూర్యుడు అస్తాద్రిలో క్రుంకిపోతున్నాడు. చీకటి మెల్ల మెల్లగా ఆవరించుకుంటూంది అడవంతా నల్లగా చీకట్లతో మూసుకపోయేలా వుంది.

రాకుమారికి ఎక్కడలేని భయం పట్టుకుంది- "ఒంటరిగా ఈ కీకారణ్యంలో వున్నానే!" అని. అప్పటికే ఒళ్లంతా చీరుకపోయి, నడచినడచి, కాళ్లు పీక్కుపోతూంది. ఇకముందకు నడువలేక, సన్యాసి జాడ గానలేక, ఆ నిర్మానుష్యమైన అరణ్యంలో, తన దౌర్భాగ్యానికి రోదిస్తూ, ఒక చెట్టుక్రిందకి జేరింది.

ఇంతసేపూ ఆమెపోకడను గమనిస్తూ, వెంటేవున్న చంద్రధరరాజు, సన్యాసులిద్దరూ, ఆమె దుఃఖాన్ని చూచి, జాలిపడ్డరు.

మెల్లగా ఆమదగ్గరకు వెళ్లారిద్దరూ సన్యాసి ఆమెను ఓదరుస్తూన్నట్లుగా, "ఇదిగో, అమ్మాయ్! దుఃఖించకు!. అడవినుండి, మీనగరానికి దారిచూపుతాంలే! భయపడకు. . కానీ యిప్పుడు చాల చీకటిగా వుంది దారి కనుక్కోడం అతికష్టం! తెల్లవారాక, నీకు దారి చూపిస్తాం లే!" అంటూ అనునయించాడు అతని దయాపూరితమైన పల్కులు విని, రాకుమారి హృదయభారం తగ్గించుకొంది.

అది చలికాలం. అందులోనూ అడవామె!. రివ్వున చలిగాలి వీస్తూ, ఎముకల్ని కొరికివేసేంత పని చేస్తూంది గజగజ వణికిపోతూ, పైబట్ట గట్టిగాకప్పుకొని, ఆ రాత్రి కక్కడే గడపదలచి, ముగ్గురూ ఆచెట్టుక్రిందే ఒదిగి కూర్చున్నారు.

ఆ సమయంలో ఆ వృక్షంపైన పక్షుల అరపులు వినిపించాయి! ఏమిటా! అని అందరూ ఆవేపు చూశారు.

అక్కడ ఓ కొమ్మపై చిన్న గూడు వుంది అందులో రెండు పక్షిదంపతులు, వాటి మూడు పసిపిట్టలు వున్నాయి. అందులో మగపక్షి, చెట్టుక్రింద చలికి వణికిపోతున్న ఆ ముగ్గుర్నీ చూచి, ఆడు పక్షితో యిలా అంది:

"చూశావా! మన యింటికి రాత్రి ముగ్గురు అతిథులు వచ్చారు. లోపంలేకుండా వారినిసత్కరించడం మన గృహస్థధర్మం! ఏమంటావ్?.. పాపం! చూడు. చలికి వారెలా వణికిపోతున్నారో! ఎలా అయినా, వారి చలిని బాపాలి ముందు ఏంచేదామంటావ్?"..

ఆడుపక్షి సమాధానమేమీ చెప్పకపోయేసరికి, అదే కాసేపు ఆలోచించి,. "ఆఁ వస్తానుండు యిపుడే!" అంటూ రివ్వున ఎగిరి పోయింది మగపక్షి ఎక్కడికో!.

వాటి భాష అర్థంగాకపోయినా, వాటి చేష్టలవల్ల, ఆముగ్గురూ అవి చేయబోయే కార్యాన్ని ఊహించుకొన్నారు!

కొద్దిసేపట్లోనే మగపక్షి ముక్కుతో నిప్పురవ్వగల కొయ్యముక్కను తెచ్చి, వారిముందు పడేసింది అదిచేసిన ఉపకారానికి ఆశ్చర్యపోతూ, చితుకులుచేర్చి, మంట చేసాగు ముగ్గురూ అగ్నిహోత్రుడి సహాయం వల్ల, చలిబారినుండి తప్పించుకున్నారు.

మగపక్షి అంతటితో తృప్తి పడక భార్యవేపుచూస్తూ,

"మనం గృహస్థులం! వచ్చిన అతిథుల్ని భోజనాదికాలుపెట్టి, తృప్తిపరచడం మనధర్మం కాని మనదగ్గర వారికి కావలసినంత ఆహారంలేదు అయినా అతిథుల కోసం మనమేదైనాసరే త్యాగం చెయ్యాలి అప్పటిగ్గాని మన బాధ్యత మనం సక్రమంగా నెరవేర్చిన వారం కాలేము. కనుక వారి ఆహారం కోసం, నాశరీరాన్ని బలిచేస్తాను. నీవేం విచారపడకు!" అంటూ రివ్వున ఎగిరి, మంటల్లో దూకపోయింది.

# ★ సన్యాసి - సంసారి ★

పక్షుల వివహారాన్ని గమనిస్తూన్న వారు ముగ్గురూ గాన్ని మంటల్లో పడకుండా, రక్షించబోయారు కానీ, సాధ్యంకాక రెండు మరుక్షణంలో పక్షి అగ్నిశిఖల్లో కాలి, ప్రాణాలు విడచింది తమకోసం, ప్రాణదానం చేసిన ఆ చిన్ని పక్షినిచూసి విచారించారు వారు అతిథుల ఆహారం కోసం, తనభర్త మంటల్లోపడి మరణించడం చూచి,

"అతిథులు చూస్తే ముగ్గురున్నారు నాభర్త శరీరం వారి ఆహారాన్ని ఏమాత్రం తీరుస్తుంది! ఏవిషయంలోనైనా భర్తను అనుసరించి, వర్తించడం సహధర్మచారిణి ధర్మంకనుక, నాభర్త కొనసాగించే కార్యాన్ని, వమ్ముచేయకుండా, అతిథుల అవసరం తీరుస్తాను వారికి నాశరీరాన్ని ఆహారంగా అర్పిస్తాను" అంటూ, గిర్రునతిరిగి, మంటల్లో పడిపోయింది ఆడుపక్షి

తల్లితండ్రుల మరణాలు చూచి, "అయ్యో! యిద్దరి శరీరాలు వారి ఆకలి నేమాత్రం తీర్చలేవుగదా! తల్లితండ్రులు విడచిన గృహస్థపు విధుల్ని సక్రమంగా పిల్లలు నిర్వహించాలి కనుక, మేంకూడ వారి దారినే నడచి, వారి కార్యాన్ని సఫలం గావిస్తాం!" అంటూ ఆమూడు పక్షిపిల్లలు జర్రున ఎగిరి, అగ్నిహోత్రుడికి ఆహుతయాయి

ఈ విచిత్ర సంఘటన ఆముగ్గుర్నీ ఆశ్చర్యంతో ఉక్కిరిబిక్కిరి చేసివేసింది పరోపకారం కోసమై, దేహాల్ని అగ్నికర్పించిన వాటిని చూచి మిక్కిలిగా విచారించారు వాటి త్యాగనిరతిని పొగుడ్తూ, ఆ ఆహారాన్ని ముట్టుకోకుండ, ఆ రాత్రంతా ఎలాగో గడిపేశారు

తెల్లవారాక, రాకుమార్ని అడవిదాటించి, రాచనగరకు దారి చూపి, పంపేశాక, సన్యాసి రాజు వేపు తిరిగి యిలా అన్నారు —

"మహారాజ! మీకు కల్గిన సందేహానికి యిపుడు సమాధానం చెపుతాను వినండి!. మీరింతకు ముందు రాత్రి, ఆ చిన్ని ప్రాణుల త్యాగాన్ని, పరోపకారాన్ని చూశారు! అవి తమ గృహస్థ ధర్మాన్ని సరిగ్గా నెరవేర్చాయి దానివిబట్ట మనకో సంగతి తెలిసిపోతుంది ఈ లోకంలో జీవించాలంటే, ఆ పక్షులమాదిరి, గృహస్థులుగావుండి, తమ విధుల్ని సక్రమంగా నెరవేరుస్తూ, ఏపక్షాన్నైనా పరులకోసం చివరకు తనదేహాన్నైనా వదలి, త్యాగం చేసేటంతటి బుద్ధికలిగి జీవించాలి!

లేదూ, అలాకాదంటావా! కోరి దరిజేరిన రాకుమారిని, అంతు వెంటా వచ్చేరాజ్యాన్ని, మహారాజ గౌరవాన్ని కాలదన్ని, ఒంటరిగ వెళ్లిపోయిన ఆ సన్యాసిని చూడు! ఈలోకపు మాయల్ని జయించి, ఇంద్రియ నిగ్రహంతో, జీవితాంతం బ్రహ్మచర్య వ్రతంతో, నిష్ఠగా ఒంటరిగా బతుకుసాగించే సర్వసంగ పరిత్యాగియైన సన్యాసిలానైనా జీవించాలి!

సంసారి త్యాగంచేస్తాడు తన పరమార్థాన్ని పరులకోసం విని యోగపరుస్తాడు సంసారబంధంలో చిక్కుకని, అందరితో మాలు కోరుతాడు. ఇక సన్యాసికూడ త్యాగం చేస్తాడు అయితే అది సంసారికి విరుద్ధంగా! కోరికల్ని దూరంచేసుకుని, "నా" అనే వాళ్లను త్యాగం చేసి, ఒకరిజోలి తన కక్కర్లేకుండా ఒంటరి బతుకు సాగిస్తాడు

— ఈ ఇరువురిలో ఏ ఒక్కరూ మరొకరికి తీసిపోరు ఎవరి ఆధిక్యత వారిది ఇరువురూ వారి స్థానబలిమితో ఈ లోకంలో గొప్పగా చెలామణీ అవుతుంటారు కాని వీరిలో ఏ ఒకరూ మరొకర్ని మించి ఆధిక్యత తను పొందలేరు!"

తను కోరినవిధంగా బుజువుల్తో సహా తనసందేహం నిశ్శేషంగా నివృత్తి అవడంతో, ఉల్లసమైన మనసుతో, హాయిగా నిట్టూర్చాడు చంద్రధరుడు! ★

## బాలల సంఘం

# కొందరు సభ్యుల పేర్లు

రాయచోటి వీరన్న (ఆదోని, కర్నూలు జిల్లా) మంచుకొండ శ్రీనాథ్ (విశాఖపట్నము) నంబూరు మోహన్‌రావు (హైదరాబాదు) కే. రత్నమ్మ కణేకల్లు, అనంతపురం జిల్లా)

ఖండవిల్లి భరత్ కుమార్ (ఖండవిల్లి ప. గో జిల్లా) వసంతరావు నాగమణి (విజయనగరం విశాఖజిల్లా పాకల విశాలక్ష్మి (చత్రపురం గంజాం జిల్లా) భాష్యం మోహనరావు (ఎనికపాడు, గుంటూరుజిల్లా) గురుగుబెల్లి సన్యాశిరావు (రావివలస శ్రీకాకుళంజిల్లా) యం రాజేశ్వరి (రఘునాథపల్లి వరంగల్ జిల్లా) జయంతి శ్రీరామమూర్తి (కాకినాడ తూ. గో జిల్లా) మండవిల్లి సత్యగోపాల్ (నాగపూరు) నంబూరి కృష్ణవేణి (దుంపగడప ప గో. జిల్లా) చిట్టూరు అప్పలరాజు (అనకాపల్లి, విశాఖజిల్లా) యం లక్ష్మీనరసయ్య (ఖమ్మం) తూనుగుంట్ల ఉమేషుబాబు (గుంటూరు) టి చిదంబరేశ్వరకుమారు (గుంటూరు) గూడూరు తుకారాం మార్గాపురం కర్నూలుజిల్లా) బాడిగ రామసత్యపున్నారావు (విజయవాడ) నందనవనం వెంకట కృష్ణారావు (విజయవాడ) కన్నెగంటి మురళీధర్ రావు (కూచిపూడి గుంటూరు జిల్లా) అడపా వెంకటరమణారావు (ఇచ్ఛాపురం శ్రీకాకుళంజిల్లా) గోపరాజు సుబ్బలక్ష్మి (తాడేపల్లిగూడెం ప గో జిల్లా) గోపరాజు వెంకటసూర్యనారాయణ) తాడేపల్లిగూడెం ప గో జిల్లా)

అన్నే కస్తూరిబాయి (కోరుకొల్లు ప గో జిల్లా) గొల్లపూడి వీరవెంకట రామమోహన్‌రావు (ఏలూరు ప గో జిల్లా) నిమ్మకవి సత్యవతీదేవి (కాకినాడ తూ గో జిల్లా) కేశిరాజు శ్రీ గోపాలకృష్ణ (కడప) ముక్కాపాటి సరోజినీదేవి (వేలూరు, గుంటూరు జిల్లా) ఆవంత్స కృష్ణావతారం (రాజంపేట, తూ. గోదావరిజిల్లా) వన్నెమరెడ్డి నిర్మలాదేవి (అత్తిలి, ప గోదావరిజిల్లా) తిపిర్నేని గిరిచంద్రబాబు (అంగలూరు, కృష్ణా జిల్లా) కొమ్మాజోస్యుల కృష్ణమూర్తి (చీపురుపల్లి, శ్రీకాకుళంజిల్లా) దడిగి వెంకటరమణమూర్తి (పిఠాపురం, తూ గోదావరిజిల్లా) బత్తుల రామకృష్ణ కృపానందరావు (కాకినాడ తూ గో జిల్లా) శిష్టా వెంకటసుబ్బశర్మ (చింతపూడి ప. గో జిల్లా) మూర్తి వెంకటరామచంద్రశాస్త్రి (జగ్గయ్యపేట, కృష్ణాజిల్లా) [illegible]తరాజు ప్రభాకరరావు (హైదరాబాదు) సయ్యద్ గఫార్ (రాజమండ్రి, తూ గో జిల్లా) మూర్తి సరోజిని (జగ్గయ్యపేట, కృష్ణా జిల్లా) పాలేపల్లి హేమలతా దేవి (మంగళగిరి, గుంటూరుజిల్లా) అల్లాడ సీతమ్మ (తిరువూరు, కృష్ణాజిల్లా) బి యస్. గోపి యశోధ (మచిలీపట్నం, కృష్ణాజిల్లా) జి భాస్కర్ రెడ్డి (భువనగిరి, నల్గొండజిల్లా)

తాడి శ్రీ వెంకటరుద్ర కంటేశ్వరరావు (రాజమండ్రి, తూ గో జిల్లా) గిన్నెల సూర్య సుగుణకుమారి (ఉయ్యూరు, కృష్ణా జిల్లా) పిల్లాడి శ్రీ వెంకట నరసింహారావు (రాజమండ్రి, తూ గో జిల్లా) పాణంగిపల్లి సత్యనారాయణమూర్తి (కంబకాయ, శ్రీకాకుళంజిల్లా) పిల్లాడి శ్రీ వెంకట సత్యగద్ర బాలసుబ్రహ్మణ్యం (రాజమండ్రి, తూ గో జిల్లా)

కొల్లిపూడి శాయినాగేశ్వరి (సంగం జాగర్లమూడి) చిక్కాన బులిరామయ్య (తటిపాక) విజయశేఖర్ పీటరుసన్ (పాలకొల్లు, (ప గో జిల్లా) అక్కరాజు సుజాత నెల్లూరు) తిరువేధుల రవీంద్రనాద్ జయచందర్ (గుంటూరు) పేర్ల వేణుగోపాల వెంకటకృపారావు (ఒంగోలు గుంటూరు జిల్లా) తిరువేధుల సురేంద్రనాద్ జయచందర్ (గుంటూరు) సూరే సూర్యనారాయణమూర్తి (అనకాపల్లి, విశాఖజిల్లా) అల్లాడ సాంబశివరావు (రజాం, శ్రీకాకుళంజిల్లా) కొటకలపూడి భాస్కర్ (జంషేడ్‌పూర్) ఆళ్ళ వెంకటరెడ్డి (మున్నంగి, గుంటూరు జిల్లా) చెన్నూరు జానకి (నౌపడా, శ్రీకాకుళంజిల్లా) యం. శ్రీనివాసురావు (హైదరాబాగు) నారాయణం వరప్రసాద్ (మంగళగిరి, గుంటూరుజిల్లా) పి రుక్మిణి (మద్రాసు)

జానికి గణపతిరావు (కొవ్వూరు, ప గో జిల్లా) వి అశ్వత్థ నారాయణశాస్త్రి (కల్యాణదుర్గం, అనంతపురంజిల్లా) జ్వాలాపురం మోహన్ (ధర్మవరము, అనంతపురం జిల్లా) బుద్దన కృష్ణారావు (నుగునూరు ప. గో జిల్లా) ఆగుర్తి కృష్ణవేణి (దగ్గులూరు, ప గో జిల్లా) సరికొండ కద్రాద్రి నరసింహరాజు (నాగిరెడ్డిపాలెం, గుంటూరు జిల్లా) యస్ ధనంజయరావు (ఖమ్మం మెట్టు) అన్నాకర్షుల ప్రభావతి (తడపత్రి అనంతపురం జిల్లా) వారణాశి శ్రీనివాసరావు (శ్రీకాకుళం) దంతులూరి వీర వెంకటసత్యనారాయణరాజు (కోలంక, తూ గో జిల్లా) యల్లంశెట్టి ఉషామహేశ్వరి (విజయనగరం) కొట్టక్కి బాబూరావు పట్నాయక్ (పాలూరు, శ్రీకాకుళంజిల్లా) తోట జనార్ధనరావు (తెనాలి, గుంటూరు జిల్లా) జొన్నలగడ్డ శారద (నూజివీడు, కృష్ణాజిల్లా) చావలి శ్రీరామకృష్ణ (పెద్దాపురం, తూ. గో జిల్లా) చక్కా సుశీల (పార్వతీపురం, శ్రీకాకుళంజిల్లా) కె యం. ఇందిరాదేవి (చీరాల, గుంటూరు జిల్లా) ఆకొండి సత్యనారాయణ (పిఠాపురం, తూ. గో. జిల్లా) ముక్తాపురం ప్రభాకర్ (ధర్మవరం, అనంతపురంజిల్లా) సాళం శ్రీనివాసు (కాకినాడ, తూ గో జిల్లా).

కొండ ద్వారకనాథ్ (రుస్తుంబాద, ప. ప గో జిల్లా) అనూరు ఇందిరాణి (గూడూరు, నెల్లూరుజిల్లా) యం. దమయంతి (ఉరవకొండ, అనంతపురంజిల్లా) అల్లాడ కామేశ్వరరావు (తిరువూరు, కృష్ణాజిల్లా) పెంటకోట సత్యనారాయణ (మునగపాక, విశాఖజిల్లా) జంజనం ఇందిరాదేవి (ఏలూరు, ప గో జిల్లా) ఈడూరి కృపమోహన్‌రావు (విజయవాడ) పానుగంటి శేషమ్మ (రాజమండ్రి, తూ గో జిల్లా) వి పుణ్యవతి (తెనాలి, గుంటూరుజిల్లా) సి భానుపూడి సూర్యకుమారి (ఏలూరు, ప. గో జిల్లా) సన్నిధి వెంకటేశ్వరరావు (ఆకివీడు, ప గో జిల్లా) పెమ్మరాజు వరలక్ష్మి (నెల్లూరు) వేగుల ఉదయభాస్కరరావు (కకరపల్లి, ప గో జిల్లా) అక్కిన గున్నేశ్వరరావు (త్యాజంపూడి, ప గో జిల్లా) తంగిరాల కృష్ణమూర్తి (మచిలీపట్నం, కృష్ణాజిల్లా) గూడూరు అచ్చెమ్మ (ఏలూరు ప గో జిల్లా) వి గోపాలకృష్ణ (పిట్టలవానిపాలెం, గుంటూరు జిల్లా) పాంచాలవరపు కనకసుబ్బారావు (ఒంగోలు, గుంటూరు జిల్లా) మందలపర్తి సుబ్రహ్మణ్యశర్మ (గుంటూరు) నందివాడ జయలక్ష్మీదేవి (ఇంకొల్లు, గుంటూరు జిల్లా)

# ★ అన్వేషణ ★

(31-వ పేజీ తరువాయి)

వున్న గది చూపించింది తల్లి. ఆ వైపు నడవబోయాడు శివరాం.

'మీకు పెళ్ళయిందా?' కోమటి యజమాని తల్లి హఠాత్తుగా ప్రశ్నించింది

శివరాం నిలువునా ఒక్క నిముషం ఆశ్చర్యంలో పడి స్తంభించిపోయాడు తిరిగి సర్దుకున్నాడు.

'మా చెల్లెలు.. ఈ నగరం చూస్తానంటే తీసుకు వచ్చాను."

ఇంక ఏ చిక్కు ప్రశ్న ఆమె వేస్తుందో అన్న భయంతో ఆగక కోమటి యజమాని గదిలోకి వెళ్ళిపోయాడు శివరాం

కోమటి యజమాని పంచెకట్టుకుని అర్ధనగ్న శరీరంతో, చెదిరిన క్రాపుతో ఒరిగిలపడుకున్నాడు పందిరి మంచంమీద, గోడవైపు ముఖం పెట్టుకుని గదిలో అలికిడి విని వెనక్కు చూడకుండా 'ఎవరు' అని ప్రశ్నించాడు

శివరాం తన కంఠం విప్పాడు

'మీరా!" లేచి కూర్చున్నాడు కోమటి యజమాని. దిగులుగా దీనంగా ఉబ్బిపోయిఎర్రటి కళ్ళతో అతని ముఖం ఏదో బాధతో నల్లబడి కాంతి తగ్గిపోయింది.

"అలా ఉన్నారే ?" శివరాం ప్రశ్నించాడు

ఆ ప్రశ్న విని కోమటి యజమాని తనతల్లి యితనికేమి చెప్పలేదనుకున్నాడు

"ఆమె చనిపోయింది!" కోమటి యజమాని కన్నీరు బుగ్గలమీద చారలుగా కారింది.

'ఎప్పుడు ఏమయింది?" శివరాం నాలిక తడబడింది. గుండె వేగంగా కొట్టుకుంది.

నాల్గురోజుల క్రితం!".

శివరాం బాధగా నిట్టూర్పు విడిచాడు,

'నేను ఆరోజే బెంగుళూరునుంచి తిరిగి వచ్చేను. ఆమెకు జ్వరం తీవ్రంగా ఉంది డాక్టరును పిలిపించుకుని ఏదో మందు పుచ్చుకుంటోంది పడుకుని పడుకునిఒళ్లు కదుములు కట్టినట్లు బాధపడింది మేడమీది వరండాలో కుర్చీ వేసుకుని కూర్చుంది . ఎదురింటి వారింట్లో పిల్లవాడి బారసాల జరిగింది బంధువులు వస్తూపోతున్నార తనకు అభాగ్యము యింకా లేదని విచారించింది వాళ్ళ ముత్తయిదువులను, పిల్లలను ఆశగా మేడమీద నిలుచుని చూడసాగింది జ్వర తీవ్రత నీరసంలో కళ్లు తిరిగాయి కాళ్ళు తేలిపోయాయి ఆమెకు మేడమీది చిన్న సిమెంటు గోడమీదికి తూలిపోయింది నేను గదిలోంచి ఆమె దగ్గరకు వచ్చేలోగ, ఆమె పట్టువిడిన శరీరం ఆ చిన్న సిమెంటు గోడ దాటి వీధిలోకి కూలిపోయింది. రక్తంబీటలు . కాలులో ఎముక విరిగింది నా గుండె బ్రద్దలయింది క్రిందకు వీధిలోకి పరుగెత్తేను నాముందు భయంకర కపాయి మృత్యువు !" వెక్కి వెక్కి ఏడ్చాడు కోమటి యజమాని కాస్సేపు హోరున ఏడ్చి చేతుల్లో ముఖం కప్పుకున్నాడు

"ఆమె శ్వాస కాస్సేపు నిలిచింది ఆఖరిసారిగా బాధగా మూచి పేలవంగా నవ్వింది కళ్లు మూసింది! డాక్టరు వచ్చేలోగా నా గృహలక్ష్మి ప్రాణాలు నేను కాపాడలేక పోయాను!" చంటిపిల్లవాడిలా మంచంమీద వాలిపోయి రోదించాడు కోమటి యజమాని

శివరాం నరనరాలు దొలిచేసినట్లయింది. ప్రతిరక్త కణంలో మంటలు ఆవేశించినట్లయింది

మౌనంగా స్తంభించిపోయి కూర్చున్నాడు ఒక పావుగంట కోమటి యజమాని తేరుకున్నాడు శివరాం చెల్లెలు వచ్చిన సంగతి విని సంతోషించాడు తనేమైనా అవసరాలు చూడగలిగితే చెప్పమన్నాడు కోమటి యజమాని. అతనిదగ్గర సెలవు పుచ్చుకుని మేడక్రిందకు వచ్చేశాడు శివరాం

(ఇంకా వుంది)



చిత్రకారుడు: కె. రామకృష్ణరావు.



ఈమధ్య ఒకరోజు పొద్దున్న చాలమంది సినీజనులూ, అన్యులూకూడా వార్తాపత్రికలుచూసికళుక్కుమన్నారు. కారణం: 'సుజాత' చిత్రం బావుందంటూ ప్రధాని నెహ్రూ, బిమల్ రాయ్‌కి రాసినఉత్తరం ఎడ్వర్ టైజ్ మెంటుగా అచ్చుపడడం.

యాచకో యాచకః శత్రువు అని ఆమధ్య పెద్దవాళ్ళు సంస్కృతంలో అన్నారు మనంకూడా వాళ్ళమాట కాదనకుండా, మిగతా ప్రొడ్యుసర్లకు చిన్నెలాయి అంటే కిట్టక అలా ఆశ్చర్యం నటించి ఔరా అని ముక్కున వేలేసుకున్నారనే అనుకుందాం వాళ్ళసంగతి వదిలేసి, మనమటుకు మనం



చేతనావారి "ఇల్లో పెళ్ళి"లో
కృష్ణకుమారి, పెరుమాళ్లు

ఆలోచించుకున్నా ఇది అమోఘంగా లేదు బాగుందనిపించదు. పండిట్ జీవంటి గొప్పవాడు, ప్రధానిపదవిలో ఉన్నవాడు తెలిసో తెలియకో ఓసినిమాచూసి అదిబావుందని లోపాయకారీగా నిర్మాతతో అంటే ఆ ముక్క పట్టుకుని, దానిని వ్యాపారంకోసం ప్రచార సాధనంగా వాడడం ఓచిత తెలిసిన వారుచేయదగ్గపని ఎంతమాత్రంకాగు ఇలాటి ఓఘాయిత్యాన్ని లోగడ మరో నిర్మాత చేసినపుడు, ప్రధాని అతన్ని గట్టిగా చివాట్లేశారట

* * *

ఇంతకీ సుజాత మహోజ్వల కళాఖండం కాదని వాదించడానికి ఈమాటలు రాయటం లేదు ఇది కళాఖండం కావచ్చు దేశాన్ని ఇంకో రెండుఅంగుళాలు ఉద్ధరించవచ్చు

అయితే దానికి జవహర్లాల్ నెహ్రూ సర్టిఫికెట్‌ను జోడించి మరీ ఇది గొప్పది అనడం న్యాయంకాగు జవహర్లాల్ కూడా మనిషే రెప్పొద్దున్న ఆయన స్నానంచేసివస్తూ,అదేదో సబ్బు చాలాబావుందంటాడు సిగరెట్ కాలుస్తు బహుత్ పసంద్ హై అనవచ్చు అక్కడినించి ఆయన అన్నమాటల్ని, ఆయన్ని బజారునపెట్టి జనాన్ని తద్వారా ఆకర్షించి డబ్బు చేసుకోబోవడం క్రూరం ఈ ప్రకారం అయితే ప్రధాని యోగ్యతాపత్రాలతో చెత్తచిత్రాలు కూడా డబ్బు చేసుకోవచ్చు

ఇలాటివి-చిత్రం ఆడడం అయిపోయాక పండుగా పబ్బం చేసుకున్నప్పుడో, గవర్నమెంటు బహుమతు లందుకొని సభలు జరిపినపుడో ఓమాటు చెప్పుకోవచ్చు

* * *

## కన్నయ్యా

ఒక్క పేజీ కథగానో, మహాయితే పావుగంట ప్రహసనంగానో సాగతీయతగిన తుమ్రితో ఎస్ పి పిక్చర్స్‌వారు రెండున్నరగంటల సినిమా తీసారు ఈ విధంగా ఇందులో ప్రసాదం అంతంత మాత్రంగా ఉన్నా, సంగీతం, ఛాయాగ్రహణం, నటన వగైరాలవల్ల తీర్థమే రుచికరమనిపించింది.

కొత్తంత మనలోకం, కొంచెం మాలోకం కలిపిన ఈ కథలో అనగనగా కొళ్ళూరు. అందులో ఒక పల్లెటూరు. అందులో ఒక పదహారేళ్ల బాలిక. అమాయిక. ఆమె మీరాబాయి అవతారమేనని పిక్చర్లోని నటీనటు లందరూ కూడా నమ్ముతారు. ఆ అమ్మాయి కృష్ణకన్నయ్యకు హృదయం అర్పించి క్రమంగా ఆ జగతిలోనికి వెళ్ళిపోయి నిత్యజీవితాన్ని, ఈ లోకాన్ని మరచిపోతుంది. కనయ్య గురించి పాటలు పాడుకుంటూ ఎప్పుడూ అతనినే తలపోస్తూ ఉంటుంది అప్పుళ్లోనే ఇటు ఉద్యోగం గాని, అటు ప్రేమకథలో హీరోపాత్ర కాని దొరక్క తిరుగుతున్న కనయ్యా అనే యువకుడిదిగమనించి ఆ అమ్మాయి తననే ప్రేమించి అలా అలమటించి పోతోందని గురభిప్రాయపడతాడు ఆ పిల్లకిదేం తెలియదు. కృష్ణకనయ్యా వచ్చి తనని పెళ్లాడుతాడనే నమ్ముతూ ఉంటుంది.

ఇలా ఏడురీళ్ళు గిర్రున తిరుగుతాయి అంతవరకూ పిల్ల, పిల్లాడూ ఒకర్నొకరు ఎరగరు పోనీ ఇంకో కనయ్యా ఉన్నాడేమో వాకబుచేదాం అనికూడా ఆ పిల్లడు అనుకోడు

చివరకి ఊళ్లో గుష్టులంతా పోగై ఆ పిల్లని ఆడిపోసుకుని నానా మాటలూ అంటారు. ఆమె తను పచ్చీలనని ఋజావు చేసుకోడానికని అగ్నిపరీక్షకు సిద్ధపడుతుంది. (భయపడకుడు ఇది సాంఘికమే) యాదృచ్ఛికంగా స్టుడియోవాన వచ్చి చితి చల్లారిపోతుంది హరించిపోతున్న ఆ పొగల లోంచి చూసిన ఆ అమ్మాయి కళ్లకి శ్రీహరే ఈలోకల్ రోమియోలా కనిపిస్తాడు ఈ విధంగా కృష్ణకన్నయ్యా, హీరో కన్నయ్యా 'సింక్' అవడంతో ఆమె ఇతన్ని వరిస్తుంది ఈ కథ (?) ను సినిమా తీయడానికి చాలా డబ్బుఖర్చయిందట అంతకు పదింతలు వసూలయినా కావచ్చు గాని అంతమాత్రాన ఇది ఉత్తమచిత్రం అని చెప్పుకోలేము. ఒకవేళ బాగా డబ్బువచ్చినా అందుకు కారణాలు-ప్రశంసనీయమైన ఛాయాగ్రహణం, ముఖ్యపాత్రధారుల నటన, అన్నిటికన్న ముఖ్యం శంకర్ జైకిషన్ల సంగీతం అని చెప్పుకోవాలి అద్భుతమైన కథ దొరకిందన్న దురభిప్రాయంలో వారు దీనికి అద్భుతమైన సంగీతం సమకూర్చిపెట్టారు. ఏపాటకాపాటే మనోహరంగా

ఉంది. అయినా ఒకవేళ రెండు మూడే చాలా బాగున్నాయని మీకు అనిపిస్తే, మిగతా వాటిని కథ మింగేసిందనుకోవాలి. సహజమైన ప్రతిభతో మనని అలరించే నటులు రాజ్ కపూర్ ఇందులో చాలా సేపు హాయిగా నటించి (మిగతా కాసేపూ నటించేసెయ్యడానికి వడిగట్టి అవస్థ పెడతాడు) పాత్రను అభిమానపాత్రం చేశాడు. పదహారేళ్ళ అమ్మాయి వేషాన్ని, పాతికేళ్ళదిగా కనిపించే పదనిమిదేళ్ళ నూతన్ ధరించింది. అమ్మాయి తండ్రిగా రాజ్ మెహ్రా చాలా సమర్థంగా నటించాడు. లలితా పవార్, లీలామిశ్రా, మదనపురి మొదలగువారంతా కూడా ఉన్నారు. ఓంప్రకాష్ ఇందులో హాస్యపాత్రతో పాటు దర్శకత్వం కూడా నిర్వహించాడు. అతని మాటలూ చేష్టలూ హుషారుగా ఉన్నాయి. కథ వ్రాయడంలో లోపాలు పాలు ఎన్ని కేర్లు ఉన్నా, కథను చిత్రించడంలో ఓంప్రకాష్ ప్రతిభను మెచ్చుకోనక తప్పదు.

ఈ విధంగా సంగీతం, హాస్యం, దర్శకత్వం ఈ పాటి లేకపోతే, ఈ చిత్రం ఏపాటి తలనొప్పి సప్లయి చేసేదో ఊహించడం కష్టం.

## దునియా న మానే

చివరిరీలులో తేలిగ్గా బాలిక్కరచుకునే రకం నేరస్థుడి కథ 'దునియా నమానే' గత వారం విడుదల అయింది. నేరాలు చేసినంత సేపూ చేసి, అక్కడక్కడా సంఘానికి మొహం వాచేలా చివాట్లేసి, చివర్ని బాలిక్కరచుకోవడం ఈ కోవ చిత్రాలలో ఏర్పాటు. ఈ సంప్రదాయాన్ని ఈరకం సన్నివేశాలను ఏమంత మార్పులు చెయ్యకుండా సినీ నేరస్థుల జీవితాన్ని సినీ గుండెలు తిరుక్కుపోయేలా చిత్రించారు. ఇందులో అద్భుతరసం ఉంది. అది ప్రదీప్ కుమార్ బాగా నటించడం! ఈ చిత్రంలో నటనకు అగ్రతాంబూలం అందుకొనే మాలాసిన్హా పక్క అన్ని విధాలా హీరోగా నిలబడ తగ్గవాడని ఋజువు చేసుకున్నాడు. మామూలుగా గంభీరంగా నిలబడే మాలాసిన్హా ఈసారి ఇందులో లలితమైన హాస్యం చేసి ఆనందపరచింది.

అంత ఆనందకరంగానూ ఉన్న మరో అంశం మదనమోహన్ సంగీతం. ఇందులో ముఖేష్ పాడిన రెండుపాటలు చాలా కాలం ... చాలమంది నోట వినబడగలవనడానికి సందేహం లేదు. శాస్త్రీయ బాణీలో లతా పాడిన మరో పాట కూడా మదనమోహన్ సంగీతరచనాశక్తికి నిదర్శనంగా నిలబడింది.

ఈ చిత్రంలో షేక్ ముఖ్తర్, ఎస్. కె. ప్రేమ్, సులోచన మొదలగువారంతా ఉన్న ఈ చిత్రం వాళ్ళమూలంగానే చాలా బాగుందనిపించింది. రెండువేళ ఆడుగులు, కనీసం సినిమా ఆపరేటరు కత్తిరించివేస్తే చాలా బాగుండేదనిపించింది.

ఇంతకన్న అపభ్రంశంగా తీసినచిత్రాలు చూసినవాళ్ళం అయినందువల్ల ఈ చిత్రాన్ని గాని దర్శకుడు వి. అవధూత్ ని గాని గట్టిగా విమర్శించలేము. మొత్తంమీద కాలక్షేపానికి బాగానే ఉంటుంది. కుటుంబంతో వెళ్ళినా ప్రమాదం లేదు. వినరాని మాటలూ, కనరాని దృశ్యాలూ లేవు.

* * *

'దో బహెన్' నిర్మాతలు జె. పి. సెహగల్, కైలాస్ కపూర్ లు కలసి డబ్ల్యు. ఎస్. ఫిలింస్ పేరిట "ఫ్లాట్ నం 9" అనే చిత్రం ఆరంభించారు. ఇంతలో హీరో అశోక్ కుమార్, నాయిక పదహారేళ్ళ బాలిక సయిదాఖాన్. ఈమె 'అప్నాహాథ్ జగన్నాథ్' చిత్రంలో కిశోర్ కుమార్ నాయికగా వేస్తోంది.

నిత్యయౌవనుడు అశోక్ కుమార్ సినిమాలో చేరినప్పుడూ అతరవాతా వచ్చిన వాళ్ళంతా తెరమరుగైపోయారు.

అశోక్ భార్య వయసుమళ్ళినట్లు కనిపిస్తుంది. అతనితో నటించిన లీలాచిట్నిస్, దేవికారాణీ పెద్దవాళ్ళయిపోయారు. అతని మిత్రులకు జుట్టు నెరిసిం..., పళ్ళూడిపోయాయి. అశోక్ మాత్రం చెక్కుచెదరలేదు. దేవీనాజ్ తో హీరోవేస్తాను అన్నాడొకసారి ఆయన, ఛలోక్తిగా. ఇపుడు 16 ఏళ్ళ సయిదాతో నటిస్తున్నవాడు రేపు అంతపనీ చెయ్యడంలో ఆశ్చర్యం ఏముంటుంది?



ధనలక్ష్మీ ప్రొడక్షన్స్ వారి 'మహారథికర్ణ'లో దుర్యోధనుడుగా కె. యన్. సింగ్.



సుధాకర్ ఫిలింస్ వారి
'వచ్చినకోడలు నచ్చింది'
చిత్రంలో జమున.

* * *

అశోక్ కుమార్, శ్యామ, మహమూద్, కె. ఎన్. సింగ్, మనోరమ, నజీర్ హుస్సేన్, మొదలగువారితో గేయ రచయిత ఎస్. హెచ్. బిహారీ, అతని సోదరుడు హుడా కలసి "ఇస్ కా నామ్ దునియా హై" అనే చిత్రం తీస్తున్నారు. పెద్ద బిహారీయే కథ, మాటలు పాటలూ వ్రాస్తున్నారు. దర్శకుడు శక్తి సమంత. సంగీత దర్శకుడు రవి.

ఈ చిత్రంలో అరుణ అనే కొత్త నటిని పరిచయం చేస్తున్నారు. —టచ్ స్టోన్.

పెట్టుకుంటే మహాలక్ష్మిలా ఉంటుంది కాబట్టి చూసి సంతోషిద్దామని సరదాపడి రాముడు వాటిని పట్టుకొచ్చి ఉండవచ్చు

ఇవన్నీ చూసి, బహుశా ఈ రాముడనే వాడు గజదొంగఅనీ, గాదికోసం నగలు ఎత్తుకొచ్చాడనీ మీరు పనిగడితే మేము ఖండించబోవడం లేదు

పైగా నగలు తెచ్చిన అమ్మాయే ఆముక్క అనేసింది స్వంతా ఎత్తుకొచ్చాను. ఇవన్నీ నీకే ఇంకా బోల్డు తెస్తాను కావాలంటే. అంటూ కదూమావా అని షాట్ ఫీల్డులో మావని చూసి అంది ఉత్సాహంగా.

రాముడుకూడా పిల్లని నిరుత్సాహపరచ లేదు. అతను దొంగేకాని అబద్ధమాడడు కాబట్టి నిజమైన పెద్దమనిషి గాలీ నీరూ అందరికీను అని వేవుడు ఏర్పాటు చేసి నా కొందరు గాలిని ఎక్కువ పీల్చవచ్చు కొందరు గంటకైదారుసార్లు నుటుకు పీల్చి కాలక్షేపం చేయవలెను. ఇది విధాయకము, అంటే కొందరికైనా ఇబ్బంది కలగవచ్చు కోపమూర వచ్చునని పించే పరిస్థితులలో ఈ వృత్తిలో ప్రాక్టీసు పెట్టిన రాముడు దర్జాగా ప్రియురాలినగ్గరకూడా చెప్పేశాడు అది దొంగసొమ్మని ఆమె మొహం ముడుచు కు నేవరకు అతను ఆశ్చర్యబోయాడు ఈపిల్ల దానికి దొంగతనంవచ్చలేదా? నిజంచెప్పడం వచ్చలేదా? అన్న సందేహంతో

*     *     *

ఈ సన్నివేశాన్ని సావిత్రీ రామారావు సమర్థుల సౌలభ్యంతో హాయిగా నటించారు ఒకే టేక్ లో. చిన్నపిల్ల నటన కొంత, క్రింది మస్తిమంలో ఉన్నందువల్ల రెండో టేక్ తీశారు ఈసారి పుల్లయ్యగారు ఆ పిల్ల స్థానంలో నిలబడి సావిత్రితో ఆ సన్నివేశం నటించి చూపారు తరవాత సావిత్రికూడా ఆఅమ్మాయిని చేరబిలిచి బోధపరచి ప్రోత్స హించింది

టేక్ అయిపోగానే 'ఇహా రెస్టే గా' అన్నారు రామారావు బయల్దేరబోతూ

"రెసుకాదు టెస్ ఉంటుంది చూడండి మీరు" అన్నది సావిత్రి నవ్వుతూ

'సార్ వన్ మినిట్ టెస్ట్ షాట్' అన్నారు కామెరామన్ అన్నయ్య !

సావిత్రి కిలకిల నవ్వింది

*     *     *

'బండరాముడు' చిత్రంలో వీరిద్దరూ కాక, రేలంగి, గుమ్మడి, సూర్యకాంతం మొదలగువారు నటిస్తున్నారు రచయిత ఆత్రేయ. సంగీతం పెండ్యాల

*     *     *

వరుసగా మూడు చిత్రాలకు (దొంగ రాముడు, తోడికోడళ్లు, మాంగల్యబలం) శత దినోత్సవాలు జరుపుకొని, తెలుగు సినిమా పరిశ్రమలో అరుదైన 'విజయ త్రయ సూనవులు' అన్న బిరుదు గడించుకొన్న అన్నపూర్ణావారు కొత్త చిత్రం నిర్మాణా మధుసూదనరావుగారు వైద్యుల సలహాపై కొంతకాలం విశ్రాంతి తీసుకుంటున్నందు వల్ల నిర్మాణం ఆరంభం కావడం అక్టోబరు లోనో నవంబరులోనో జరుగవచ్చు. కథా నిర్మాణం ఈ నెలలో ఆరంభిస్తున్నారు ఈసారికూడా ఒక బెంగాలీ నవలనే తీసు కొన్నారు పేరు 'తాషేర్ ఘర్'. ఇది లోగడ బెంగాలీలో చలనచిత్రంగాతయారై విశేష జనాదరణ పొందింది కథ సంవిధాన రచనలో యథాప్రకారం రచయిత ఆత్రేయ, నిర్మాత మధుసూదనరావు, దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు పాల్గొంటారు నిజ మైన చిత్రనిర్మాణం అంతా ఈ పట్టం లోనే ఇక్కడ ఆఫీసులోనే జరుగుతుందని ఇంకా నమ్మే చాదస్తుల శ్రేణిలోనే వీరూ ఉన్నారు

ఈ చిత్రంలో నాగేశ్వరరావు రెండు పాత్రలు నిర్వహిస్తాడు తెలుగు చిత్రాలలో దీనికిదే తొలిసారి తమిళంలో ఇటీవల ఎం జి రామచంద్రన్ నాడోడి, వణ్ణాన్‌ల పాత్రలు రెండు నిర్వహించాడు

*     *     *

నేషనల్ ఆర్ట్ థియేటర్సు వారుకూడా తమ కొత్త చిత్రం 'సీతారామ కల్యాణం' నిర్మాణం అక్టోబరులో ఆరంభి స్తారు స్క్రిప్టు రచన అయిదారు నెల క్రితమే ముగించిన నిర్మాత త్రివిక్రమరావు నిర్మాణానికి సంబంధించిన ఇతర కార్య కలాపాలను చురుకుగా సాగిస్తున్నారు

'భూకైలాస్'లో రావణ పాత్రను నిర్వ హించి బహుధా ప్రశంసలూ బహుమతులూ (ఫిలింఫాన్స్ సంఘంవారు ఉత్తమనటుడుగా ఎన్నుకొన్నారు) అందుకున్న ఎన్ టి రామారావు ఇందులో తిరిగి రావణ పాత్రను నిర్వహిస్తున్నారు.

ఇందులో కథాకాలం నాటికి రాముడు పదహారేళ్ల వయసువాడు అందువల్ల సీతా రాముల పాత్రలకు చిన్నవాళ్లిద్దరిని ఎన్నిక చేయవలసి ఉన్నదని రామారావు చెప్పారు.

ఈ చిత్రానికి సముద్రాల రాఘవాచార్య కథ, మాటలూ, పాటలూ వ్రాశారు

ఈ చిత్రానికి సంగీత రచయిత— సాలూరు రాజేశ్వరరావు

*     *     *

విజయవారు తరువాతి చిత్రానికి కథను ఎన్నిక చేస్తున్నారు. ఈసారి చిత్రాని కె వి రెడ్డి దర్శకత్వం నిర్వహిస్తారు

*     *     *

శంభు 'ఫిలింస్ వారి' నమ్మిన బంటు, త్వరలో విడుదల కాబోతున్నది నాగేశ్వర రావు, సావిత్రి, రేలంగి, రంగారావు నటించిన ఈ చిత్రానికి ఆదుర్తి సుబ్బా రావు దర్శకుడు

చంద్రికా ఫిలింస్ వారి పౌరాణికం 'శ్రీకృష్ణరాయబారం' గతవారం విశ్వరూప దర్శన చిత్రణతో చాలవరకు పూర్తి అయి పోయింది ఇంకో నాలుగు చిన్న సెట్లమీద పని తరువాయి స్టూడియోలో సెట్ మీద కన్న ఆఫీసులో బల్ల మీద ఎక్కువ గంటలూ నిముషాలు 'వృధా' చేసే జగన్నాథ్ అంతకు ముందు స్పష్టంగా ఖచ్చితంగా ఆలోచించి పెట్టుకొన్న కథను కెమెరా ముందు సునా యాసంగా త్వరగా ఆవిష్కరిస్తాడు

అందువల్ల ఈ మధ్యనే ఆరంభమైన షూటింగ్ హుటాహుటిన సాగి త్వరగా ఆఖరి చేరవచ్చింది గత వారం జగన్నాథ్, కామెరామన్ లక్ష్మణ్ గోరేలు మాయా ఛాయాగ్రహణ శిల్పంతో వరసగా మూడు రోజులు కృషిచేసి విశ్వేశ్వరుడి విశ్వరూపా నికి చలచ్చిత్రరూపకల్పనచేసి తెరమీదకు అనువదించారు ఇందులో శ్రీకృష్ణుడు ఈలగానలోల రఘురామయ్య

రచయిత మల్లాది రామకృష్ణశాస్త్రిగారు ఈ చిత్రంలోని మహాభారతీయులను మనకు మరింత సన్నిహితులను చేసే సన్నివేశాలు కొన్ని కల్పించి అలంకరించారని తెలు స్తోంది.



ప్రసిద్ధ తమిళ నాటకకర్త శ్రీ సంబంధ మొదలియార్, భరత నాట్య శాస్త్ర ప్రవీణురాలు శ్రీమతి గౌరీఅమ్మాళ్ గారలకు సంగీత నాటక అకాడమీ బహుమతులను మద్రాసు గవర్నరు బిష్ణురాం మేధీ గత వారం అందచేశారు,





# స్వరలహరి

ప్రొద్దున్న నిద్రలేస్తూనే అరచేతిలో శ్రీరామచుట్టుకు కళ్లకద్దుకు మరీ లోకాన్ని చూసేవారున్నారు; ఈనాడు లలిత సంగీత ప్రియులలో 'సి–రామచంద్ర' చుట్టుకునేవారూ అనేకులున్నారు. 'లలిత సంగీతం' అనేమాటలో మొదటి మూడక్షరాలకూ వర్ణక్రమం అనిపించే క్రమంలో స్వరాలను అమర్చడం రామచంద్ర శిల్పం. అందమైన స్వరాలను అందంగా కలిపి హాయిగొలిపే వరసలతో ఒళ్లు పులకింప చేయడం ఆయన ప్రత్యేకత. రాగాలకూ రాగాలకూ 'పెళ్లిళ్లు' చేసి వాటితో మధుర సరాగాలాడించి ఆడుతూ పాడుతూ పాటలుచేసి పాడించి అందర్నీ మధుమధుర స్వరవశులనూ, పరవశులనూ చేయడం రామచంద్ర హాబీ, వృత్తి; జీవితం.

అందుకే ఆయన ఒక సందర్భంలో, "నేను సంగీతదర్శకుడిని కాను స్వరసమ్మేళన కర్తని" అని నమ్రతగా అన్నారు.

అయితే రామచంద్ర ప్రజ్ఞాప్రాభవాల విషయంలో, అవంతైనా అప్రతిష్ఠగా తోచే మాట అననివ్వని అభిమానులంతా ఈ మాటని 'గిట్టనివాళ్లే' కాక, సాక్షాత్తూ రామచంద్రే అన్నాడన్నా—

"ఏడిశారుపోదురూ మీ మొహం. మీకేం తెలుసు మిమ్మల్ని గురించీ" అనేస్తారు రామచంద్రపాటలాగే మృదువుగా.

ఇందులో కొంత నిజం లేకపోలేదు. ఆమాటకొస్తే కొంతకన్న ఎక్కువే ఉంది. రామచంద్ర చిత్రాల రద్దీనిబట్టి, తినకిగల 'ఊహాపోహాలను'బట్టి, డబ్బిచ్చేవారి అభిరుచులనుబట్టి కొన్ని సందర్భాలలో కేవలం వ్యాపార–సంకీర్ణస్వరాలమీదనే సినిమాపాటల వరసలు కట్టినా సృజనాత్మక ప్రతిభతో మనోహరమైన కృతులు ఎన్నో చేసి, సజీవ సంగీతానికి (శాస్త్రీయ విద్వాంసులది తిదవ్యకుంటున్నట్లు భావించతగదని ప్రార్థన; నవ్యరచనా సృష్టికేవలంగా, ప్రధానంగా జరుగుతున్న రంగం అని మటుకే పై వాక్యం అన్వయం) వాటిని సమర్పించినవారిలో రామచంద్ర చిత్కార్ అగ్రగణ్యుడు. ప్రసాదగుణ లక్షణలక్షితమైన సంగీతం రామచంద్రదిసొత్తు. ఆయనచేతిలో స్వరాలన్నీ మంచివాడి మాటలా మృదువుగా, కొత్త పెళ్ళికూతురు సిగ్గులా మనోహరంగా,



## సి. రామ్‌చంద్ర

బాలసరస్వతి కంఠంలా మధురంగా, మబ్బుచాటు చంద్రుడి కాంతిలా మెత్తగా, పగటి కలలా మత్తుగా ఉంటాయి. మంచి బాలుడు రాముడిలా చెప్పినట్లు వింటాయి. ఒకపాటలో (యాస్మిన్‌లో అబ్ ఓరాత్ యెకోహై) ఒక్కొక్క పాదానికి ఒకటే స్వరం చొప్పున తీసుకొని—స్వరానికి ఎడాపెడా అనుకొని ఆకుమాటు పిందెలా అందులో ఒదిగి ఉండే ఉపస్వరార్థాలచేత ఉపశ్రుతులు వేయిస్తూ అందమైన వరసకట్టాడు. పాటవెనకాల వాద్యాలతో రాగకేళా చిత్రాలు రచించే విద్యలో నిష్ణాతులైన సజ్జద్, షఫీ మహమ్మద్‌ల శిల్పంలో రామ్‌చంద్ర చెప్పుకోతగ్గ ప్రావీణ్యం గడించాడు. ఈ విషయంలో వారిద్దరిపై రామ్‌చంద్రకూ, అన్యులకూ కూడా అమితమైన గౌరవం...

అయితే రామచంద్ర, ఒకపాటని చేపాడి మనసుకు పట్టడానికి, హంసా రైనలను సుఖ మార్గం అని గాని తప్పనిసరి అని గాని ఒప్పుకోడు.

ఒకవస్తువు తత్వాన్ని చెప్పడానికి, ఒక మానసికమైన ఒకస్థితిని వ్యాఖ్యానించడానికి రాగమే ముఖ్యం. స్వరాలే మాట్లాడగలవు. ఒక్కొక్కసారి అవసరమైతే లయను ఉపయోగించుకోవచ్చు అంటాడాయన.

మెత్తనిపాటలు గుత్తకి తీసుకున్నాడు కాబట్టి, రామ్‌చంద్ర పాటలలో లయ, పంచకల్యాణి గుర్రంలా పగ్గలెత్తి దముకోవడం పొరబాటు. రకరకాల ఛందస్సులలో, గతులలో ఆయనపాటలు చేశాడు. ఆయన పాటలలో ప్రధానంగా విశేషంగా కనిపించేది త్రిశ్రగతి. అయితే ప్రగతిశీలమైన బాణీలో దాన్ని ఆయన నడిపి, విశిష్టమైన రామచంద్ర మార్కు ఫణితిని ఏర్పాటు చేశాడు. రామచంద్ర పాటలకు తబ్లా వాయించే 'లాల్' ఈ శిల్పానికి పట్టుగొమ్మ. ఎదురు తాళంలో లయ ఆరంభించి వినేవాడ గుండెఝల్లుమనిపించేలా పాటను ఎత్తుకోగల అసాధ్యుడితను. దాదాపు రామచంద్ర కుడిభుజం అంటారు. ఆయనఎడమభుజం పేరు సుమంత్ రాజ్. ఈయన బేస్‌లో వేణువు పూరిస్తే అసలుపాటకి అరఫర్లాంగు అవతలఉన్న ఆనాదం మనని పాటకూడా వినకుండా ఆకట్టగలదు. లయగురించి మాట్లాడుకున్నప్పుడే శహనాయ్‌తో ప్రాణానికి హాయ్‌మనిపించే ఊపులతోపాట నడిపిన వాడుకూడా రామచంద్ర అనే చెప్పుకోవాలి. 'శహనాయి' చిత్రంలో అజ్ బాజే శహనాయిలో ఈ వాద్యాన్ని చాలా సమర్థంగా వాడాడు. బిస్మిల్లాఖాన్ సాహెబ్‌లు శాస్త్రీయసంగీత

రంగస్థలంమీద చేసే అద్భుతాలలో ఇవి ఎన్నోవంతో కాకపోవచ్చు వాటిలో శిక లాలే కావచ్చు సినిమాలోమటుకు ఇంతబాగా వాడింది (అప్పట్లో) ఈయనే. కొన్ని సంగీతాలలో రెండు క్లారినెట్‌లను మనోహరంగా కలిపి శహనాయికి దగ్గరసా పొందనిపించే కొత్తనాదాన్ని సృష్టించారు. వీటినే స్థాయీభేదాలతో ప్రయోగించి గమ్మత్తు చేసి, వాటిమీద రామచంద్ర ముద్రవేశాడనిపించుకున్నాడు ఆఫ్రికన్ ఆటవిక సంగీతంలో చక్కటి డోళ్ల నాదాలను ఎత్తుకొచ్చి లలిత సంగీతబాటీలో ఇమిడ్చి అమర్చిన ఘనతకూడా రామచంద్రకే దక్కుతుంది సర్గమ్, ఖజానాలలో వీటిని బాగా వాడారు.

* * *

రామ్‌చంద్ర చితల్కర్ సినిమాకు చిరపరిచితుడు కావడానికి ముందు వాడు అప్పట్లో ఈ 'పేరూ', ప్రతిష్ఠాకూడా లేవు ఆనాటిపేరు ఆర్ చితల్కర్ కొన్నాళ్లు 'అన్నా సాహెబ గారున్నాడు' క్రమిలా ఆర్ చితల్కర్‌లో ఆర్‌ను రామచంద్రగా సాగదీసి చితల్కర్‌ను 'సి' గా చిత్గొట్టి సి రామ్‌చంద్ర అయి ఊరుకున్నాడు ఊరుకోలేదు పుంజుకొన్నాడు

కొత్తలో చితల్కర్ స్టంటు చిత్రాలకు (సుమారు ఒక డజను) సంగీతం సమకూర్చాడు హాస్యనటుడు భగ్‌వాన్ ఆ చిత్రాల నిర్మాత, నటుడూను, ఆ నాటి పాటలలో 'నగ్మా-ఎ-సహారా' అనేదాంట్లో పాటలు బాగున్నాయనిపించుకున్నాయి ఆ కాలంలోనే ఒక తమిళ చిత్రానికి కూడా ఈయన పాటలు చేశారు. పదేళ్ల తరవాత ఆ భగ్‌వాన్, ఈ రామచంద్రలే తిరిగి కలిసి 'అల్బేలా' 'ఝమేలా' చిత్రాలను సృష్టించారు. వాటిలో రామచంద్ర, సంగీతంచనలో స్టంటులు అనతగ్గ అద్భుత విన్యాసాలను చేశాడనీ అవి, నభూతో న భవిష్యతి అనిపించుకున్నాయనీ ఒక రామచంద్రాభిమాని నమ్మకం.

జయంత్ దేశాయి తీసిన 'భక్తరాజ్' అనే చిత్రం రజతోత్సవాలు జరుపుకోవడంతో రామ్‌చంద్ర పేరు మారుమోగింది. ఆ ప్రాంతాలలోనే చితల్కర్ నుండి రామంచంద్రకు పేరూ, స్టంటు ఫిలిం మ్యూజిక్ నుండి సాఫ్ట్ మ్యూజిక్‌కు ప్లేటూ మార్చేశాడు. ఆయన పాటలు చేసిన (సుమారు 50) చిత్రాలలోను 18 చిత్రాలు రజతోత్సవాలు జరుపుకొన్నాయి. మిగతా వాటిలో కొన్ని అతి విజయవంతంగా (సంగీతం సహా) దెబ్బతిన్నాయి. ఆయన సొంతంగా తీసిన చిత్రాలు ఝంఝార్, లహారేం గునియా గోల్ హై చిత్రాలు మూడూ—షిన్‌షినాకీ బూబ్లబూ చిత్రంలో హం క్యా జానే తుంహారీయాద్ మే హంకిత్నా రోయే అనే పాట ఎంత జనాదరణ పొందిందో అంత అనాదరణ పొందాయి.

ఐనా కొన్ని పాటలు చాలాబాగున్నాయి. ఈ పాట— 'హం క్యా జానే' అనేది రామ్‌చంద్రకు కూడా అభిమాన పాత్రమైనది ఇలా చాలా మందికి అభిమాన పాత్రాలు అయినవీ, కొంగలవి చెప్పుకోవం మొదలుపెడితే, చాలా తేల్తాయి ఉన్న వాటిలో గొప్పగా చెప్పుకోతగ్గవి పర్‌ఛాయ్ చిత్రంలో లతా తలత్ బృందం పాడిన గిల్ దిల్ సె కహ్‌రహా హై ఇందులో క్లారినెట్ మీద స్వరాలను పాట ఆంతటా అల్లుకుపోవడం విశేషం ఈ చిత్రంలోనే బాగుందనిపించిన మరి రెండు పాటలు — తలత్ పాడిన 'మొహబత్ హీ న జో సమ్‌ఝే', లతా పాడిన కట్ తే హై. అప్నికహా అనే మరోపాటలో వాద్య సమ్మేళనం సరికొత్త పద్ధతిలో పాటను అనుకరించిన శాస్త్రీయమైన బాణీలలో రామచంద్ర పాటలు దాదాపు అన్నీ పండితుల మన్నన, లలిత సంగీత ప్రియుల ప్రశంసలూ అందుకొన్నాయి అనార్కలీలో లతా పాడిన మొహబ్బత్ ఐసీ ధడ్‌కన్ హై, హేమంతకుమార, లత పాడిన జాగ్ దర్ ఇష్క్ జాగ, లతా హేమంత్ జిందకీ ప్యార్ కిదోచార్ ఘడీ హోతీ హై, పరఛాయిలో మొహబత్ హీనజో సమఝే (తలత్), హం క్యా జానో తుంహారియాద్ మే (షిన్‌షినాకీ), ఆజాద్‌లో నా బోలె నా బోలె నాబోలేరె (లత), జారి జారీ ఒకారీబగరియా (లత), సరగమ్ చిత్రంలో ఛేడ సఖీ సరగమ్ (లత) తినక్ తిన్‌తనీ (లత), పహ్లీ ఝలక్‌లో క్రైసీ ఆయె సఖీరితి సవన్‌కీ ఈ కోవలోవి. జైకృష్ణహరే (శహనాయి), కహేం బజాయేబాంసురీ (నాస్తిక్), బాంసురియా బోలే (ఇన్సానియత్), బాంసురివాలా కహేం కలా (భక్తరాజ్) మొదలైన భక్తిరస ప్రధాన గీతాలు అంత పనీచేసి పాడినవాడిలో, వినేవాడిలో సద్భావాలను కలిగిస్తాయి

దేవత చిత్రంలో జమునా కేతీర్ అనే పాట లతాంత కోమలమైన స్వరాలతో అమరి లతామంగేష్కర్ మంగళ గళంలోంచి మధురంగా ప్రవహించింది అయితే ఇది దాదాపుగా ఖాన్‌సాహెబ్ అబ్దుల్ కరీమ్ ఖాన్ స్వరఝరిలోంచి సినిమాలోకి ఒరిగిన రసధుని పాటలో గోపిక హృదయాన్ని కరీంఖాన్‌సాహెబ్ ఆవిష్కరించినంత మనోహరంగా మరొకరు చేయలేరని ఒక వంక అనిపించినా మరొక వంక లతామంగేష్కర్ పట్లకూడా మనకు గౌరవభావం కలుగుతుంది

మొత్తంమీద శాస్త్రీయ రాగాలలో స్వారస్యాన్ని బహుళ ప్రజానీకానికి అనేక రూపాల, రూపాంతరాల అందించిన రామ్‌చంద్ర విదేశీయ సంగీతంలో గుణదోషాలను

## హాస్యనటులు

ఈ శీర్షికలో ఆఖరుభాగంగా తెలుగు, తమిళ హాస్యనటులపై వ్యాసం వచ్చేవారం ప్రకటిస్తాము.



'కృష్ణలీలలు' చిత్రంలో వసుదేవుడు, కంసుడు.

# స్వరలహరి

కూడా పట్టుకొచ్చి అమ్మ్రమూపాడు. వాటిలో కొన్ని రాణించాయి. కొన్ని బాగులేదనిపించాయి. పోయిగాలికే పోయాయి. సంగీతాన్ని అందంగా కలిపిన పాటలలో ఎన్నతగ్గది: యాస్మిన్ చిత్రంలో లతా పాడిన 'అబ్ వో రాత్ కహాఁ'. రాత్రివేళ ప్రసరిల్లే ప్రశాంతతను, నిశ్శబ్ద సౌందర్యాన్నీ ఈ పాట తనలో నిలిపుకొని శ్రోతలను పరవశులను చేసింది. పాట మొత్తంమీద ఈ ఘనకార్యం సాధించినది అనుశ్రుతిగా వచ్చిన వయొలిన్.

ఆఫ్రికన్ లయలనూ, హవాయి సంగీత రీతులను మేళవించి అల్లిన గీతాలలో షిన్‌షినాకీ 'బూబ్లబూ', సౌదాగర్ లో గుల్ గుశేరా, సర్‌గమ్ లో మొంబాసా, యూర్ వైవై, ఖజానాలోని బంబీనా, బాబీ బూబీ అల్ బేలాలోని దీవానా పర్వానా (రామచంద్ర బృందం) చెప్పుకోతగ్గవి. రొమాంటిక్ చిత్రం 'ఆశా'లో ఈనా మీనా డీకా అనే రాక్అండ్రోల్ పాటా, కారిగార్ లో మెహుం కోటికూడా ఈయన పేరనే జనుపడి ఉన్నాయి. షిన్‌షినాకీ బూబులబూ అనే పాటను లతాతో కలసి రామచంద్ర స్వయంగా పాడాడు. రామచంద్ర సంగీతం గురించి చెప్పుకున్నంత గొప్పగా పాట గురించి చెప్పుకోలేకపోయినా, ఈ పాట బాగుందనే అనవచ్చు. ఇదీ ఖజానా చిత్రంలోని బాబిడి బూబుడీ అనే మరోపాటా కలిపి ఒక రికార్డుగా (భారతీయ సినిమా సంగీత చిత్రంలో తొలిసారిగా) విదేశీ మార్కెట్‌లో విడుదల అయ్యాయి.



పొన్నలూరి బ్రదర్స్ వారి "దైవబలం" లో జయశ్రీ.

కవాలీ మార్గ పాటలలో ఖిశ్క చిత్రంలోని జల్నేవాలే జలాకరే (షంషాద్), పెహ్లీ ఝలక్ లోని మొహబ్బత్ నే ముఝే మారా ఉత్సాహకరమైనవి.

ఆల్బేలాలో జోలపాట ధీరసే ఆజారే (లత) ఆనాడు దేశమంతటా నోటా వినబడింది. సినిమా సంగీతానికి లాలిపాటలలో ఇది విప్లవం తెచ్చి ఒక శకాన్ని ఆరంభించింది. ఒకే ఒక్క వయొలిన్‌తో బంగారు తీగలాటి లతాకంఠంతో 'మ్యూజిక్ లో మాజిక్' అనిపించేటంత సులభశైలిలో ఆయన ఈ పాట చేశాడు.

నిరాడంబరంగా సూటిగా ఉండి అమాయకత్వముల్లె మనసులో చిరముద్ర వేసుకుని ఆప్తమిత్రుడిలా మనవెంటనే వచ్చే పాటలలో నిరాలా చిత్రంలో లతా పాడిన మెహఫిల్ మేజల్ ఉఠీపమా, సుబ్ బూర్ అంఖే, మీనార్ లోని బర్‌బాద్ మొహబ్బత్ మేరీ చెప్పుకోవాలి. చివరి పాటలో లయ విశేషంగా కొత్తగా ఉంటుంది. పెహ్లీ ఝలక్ లో సమాకో సజరియాకే బాన్ (లత), సుబాకాతారాలో గయా అంధేరా హువా ఉఝాలా (తలత్, లత), శత్‌రంజ్ లో బదీ మెధుప్పే (హేమంత్, లత), అమర్‌దీప్ లో దిల్ కి దునియా మే (లత) చాలా మందికి ఇష్టమైన పాటలు. తలాక్ చిత్రంలో అనురాగోదయానికి స్వరరూపకల్పన అనతిగ్గ మధుమధురమైన పాట 'బోల్ తుమ్ కౌన్ హో' అశా, మన్నాడే, మొత్తం సినిమా పాటలన్నిటా గొప్పదనిపించుకునే వాటిలో నిలుస్తుంది. ఆపాటకి వాచ్యసమ్మేళనం అను రాగాన్ని విశ్వజనీనంగా ఆలపించింది ఈ చిత్రంలోనే "సంభల్ కె రహనా అప్నే ఘర్ హో..." అనే మరోపాట ప్రధాని శ్రీ నెహ్రూ ప్రశంసలు కూడా అందుకొందిట.

తీయనిబాధని ఆలపిస్తూ హృదయాన్ని కదిలించి రసార్ద్రం చేసిన గీతాలు కనీసం రెండైనా ఉన్నాయి. వాటిలో నౌషర్వానే ఆదిల్ చిత్రంలో రఫీ, లతా పాడిన 'భూల్ జాయే సారే గాం' ఒకటి. అనార్కలీలో నాయిక నిస్సహాయతను పోషిస్తూ లతా పాడిన "ఆజా అబ్ తో ఆజా మేరీ కిస్మత్ కె ఖరీదార్" మరపురానిపాట. నాస్తిక్ లో కూడా ఇదేవ స్తువుగల పాటఉంది. మానవుడు నిస్పృహ చెంది, ఏమీ యిది స్వామీ అని ముఖాముఖిన సంగతి అడగబోయే వేళ లత పాడిన 'అరె పత్థర్ కె భగవాన్' పాట అంతా, ముఖ్యంగా అది అటుతిరిగి ఇటుతిరిగి పెద్ద గాంధారంమీద ఆగిపోయేటప్పుడు, ఆ గాంధారంలో రామ్‌చంద్ర, ఆ వ్యక్తి నిస్సహాయతనంతా పూరించగలిగాడు. సంగీత శాస్త్రంలో సాధక బాధకాలు ఎరిగినవారు ఇది చిన్నసైజు అద్భుతం అంటారు. రామచంద్ర చిన్న అంతా ఈ పాటకు ప్రాతిపదిక అయిన 'సమే జ రి స్కేల్' మీదనే (కర్ణాటకంలో శంకరాభరణ మేళం అంటారు) నిలబడి సాగిందనవచ్చు. కొందరు కొందరు ఒకొక్క మేళకర్తను ప్రధానంగా తీసుకుని సొంతం చేసుకుని దాన్ని కామధేనువులా వాడుకుంటారు. రామచంద్ర పాలిట కామధేనువు ఈ శంకరాభరణ మేళి నవాలి.

రామచంద్ర ఇప్పటికి దాదాపు 50 చిత్రాలకు సంగీతం కూర్చాడు. వీటిలో కొన్ని పాటలు ఏమాత్రం చర్చించ తగ్గవి కావు. పాశ్చాత్య సంగీతానికి అనుసరణలో అనుకరణలో ఎన్నో ఉన్నాయి. వీటిలో బాగులేనివి ఉన్నాయి. తనని తనే అనుకరించి ఈ పాట పల్లవిని ఆ పాట ఖరేజానికి, ఆపాట చరణాన్ని లేదా అందులో ఆర్కెస్ట్రా బిట్‌ని ఇంకోపాట పల్లవికి వాడిన సందర్భాలున్నాయి. వ్యాపారపు వత్తిళ్ళు బట్టి ఇష్టం లేకపోయినా కొన్ని అలా చేశాడు. ఒకసారి ఒకపాట రికార్డు చేస్తు 'ఇలా కనక ఇంకొన్ని రోజులు పాటలు కడితే తరవాత నన్నెవ్వరూ పిలవరు" అనేశాడు ఆ నిర్మాత మొహం మీదనే.

రామచంద్ర తత్వం అలాటిదని అన్ని బాగా ఎరిగిన వారు చెబుతారు. వ్యక్తిగా అతను ఉత్సాహానికి ఘాతికొను వాదం. నిత్య సంతోషి. స్వర సర్వస్వాన్ని మధించి అమృతప్రాయమైన మధురశ్రుతులు కల్పించాలని నిత్యం మధురమైనబాధలో మునిగి తేలుతూ నవ్వుతూ నవ్విస్తూ ఉంటాడు. అందుకే రామచంద్ర హుషారైన పాటచేసినప్పుడు, మిత్రులు "దాదాపు నీ అంత హుషారుగా ఉంది బ్రదర్" అంటారు.



# వనితాలోకం



స్కెచ్

## పేరంటంలో...

రేవతి

'ఏమమ్మా రావటమే మానేశావు వదినా. ఎంతైనా ఆ మాత్రం మాతో కూడా మాట్లాడవచ్చు నమ్మా అంత తీసిపోయామా.'

'అయ్యో చాలా రోజులైందమ్మా వొదినా— అంతలో అన్నీ చిగురులెంగుకు—అన్నట్టు అమ్మాయి ప్యాసయిందటగా ఇన్నాళ్లు ఫైనలు—మరేవిటి తర్వాత—ఏం చేద్దామనుకుంటున్నారు?'

'ఏవో(నమ్మా ఏం తోచకుండా ఉంది— అదేమో కాలేజీల్లో చదువుకుంటానంటుంది —ఆయన సరేసరి—ఆయన మనస్తత్వం నీకు తెలిసిందేగా—అదేమంటే దానికల్లా తందానతానా అంటూను. ఉద్యోగాలు చెయ్యనా ఊళ్లేలనా, ఈ కాలేజీ చదువులు చదివి-'

'దానికేం రమణమ్మొదినా— చదవాలని అభిలాష ఉంటే చదవనివ్వాలమ్మో. వరదమ్మపిన్నిగారి అమ్మాయిని చూడు. తండ్రే దగ్గరుండి కాపరం పెట్టి మరీ చదివిస్తున్నాడు చదివినకొద్దీ మంచి సమ్మంధాలొస్తయ్—దానిమాటే కానీరాదూ'

'ఏం చదువులో గొడవ. ఈ చదువులు చదివి విళ్ళు మన చెప్పినమాట వింటారనేనా. ఇదుగో ఒక్కటే మాట—ఈ కాలేజీల్లో చేర్పించామా—వాళ్ల పెళ్లిమాట ఇహ మనవల్ల కాదు. వాళ్ల మొగుళ్లను వాళ్లు వెతుక్కోవాల్సిందే బియ్యే చదవిందానికి ఎమ్మే చదివినవాడు గాని నచ్చడాయె ఎమ్మే వాడు మాటల్లో వస్తాట్టమ్మా. ఎహ మన ప్రయోజకత్వం యేవుంది—బతికున్నందుకు చూస్తూ ఊరుకోటంతప్ప చేసేదేం ఉందదనుకో'

అంతా నీది మరీ ఉప్పులాయెమ్మా రమణమ్మొదినా, అట్టా వాళ్ల పెళ్లిళ్లు వాళ్ళే చేసుకుంటే సహాంబాధ వదిలిపోతుందని సంతోషించక—ఇంకా పాతకాలపు మనస్తత్వం నువ్వూనూ—సరే వెళ్ళొస్తా వదినా—రేపెప్పుణ్ణా తీరికుంటే ఓసారివచ్చి చూసిపో— అమ్మాయికూడా వచ్చింది, మొన్ననే అత్తవారింటినించీ—

సరే నేను వెళ్లాలమ్మా ఈ పాటకి ఆయన కూడా పొలంనించి వచ్చుంటారు. వెళ్ళొ

* * *

'రండి రండి రుక్మిణమ్మగారూ – ఇవాళేవానో తప్పదు—మీరు బయటికి కాలుపెట్టటం నిజంగా' పేరంటానికి పిల్చిన పిన్నిగారు—భూస్వామి వీరయ్యగారి భార్యను ఎదురేగి ఘనంగా ఆహ్వానించింది.

ఆమెను తానే స్వయంగా కాళ్లకు చక్కగా పసుపుపూసి, సత్కరించింది

"అగుగో అట్లా ఉంటయ్యమ్మా మర్యాదలు! మనమొహాన బొట్టు పెట్టినవారు లేరు ఇంతవరకూ ఈ మాత్రానికి పేరంటాలెందుకు—పిలుపులెందుకు" ప్రకాశంగా నొచ్చుకుంది ఒకావిడ పక్కావిడతో బాధపంచుకుంటూ

'ఆఁ నీకూ నాకూ మేడలా పొలాలా— ఇదుగో అంతా డబ్బులో ఉంది ఈ వేలికీ ఆ వేలికీ అంతేననుకో లేడా' బాధకు శాక్యమైన ఉపశమనం కలిగించింది పక్కావిడ

'ఏమిటో హాళ్లూ పెళ్లూ, వచ్చినవాళ్లని వచ్చారా అని పలకరించడంలేదు పైగా ఆ బియేకూతురు ముట్టుకుంటే వెళ్లు తెగ్గోట్టు కోవాలన్నట్టు అంటీ అంటకుండా పసుపురాసి చక్కాపోయింది. కాళ్లకి!— కుమ్మల్లో బొద్దుకుంకిన ముఖం పెట్టింది మొదటావిడ.

'శవగ్గింజలకి మొహంవాచి వచ్చినట్లు' దీర్ఘంతీసింది రెండో పిన్నిగారు—ఎవరూ విన లేదు కదాకొంపతీసి అని వెతికే కళ్లతో.

ఇంతలో పేరంటం పిలిచిన పిన్నిగారు దగ్గరకొచ్చి, 'ఏమండీ తొందర్లో ఈ మూల కూచుంటే నేను చూడలేదు మరేమనుకోకండి—అదేవిటి కాళ్లకు సరిగా పసుపే రాయలేదు—ఎవరే అక్కడా' అంటూ ఆమె పాపం వెంటనే పసుపుగిన్నె తీసుకు వచ్చి చేత్తో ఇద్దరిపాదాలకు పసుపు రాచి, మరిన్ని శనగలు కట్టియిచ్చి, తాంబూలం ఇచ్చి, జవాన్ను తోడుగా లాంతరిచ్చి ఇళ్లకు సాగనంపే యేర్పాటుచేసిపింది.

మసకలాంతరువెల్తురులో— 'మనమాటలు ఏమన్నా విన్నదా ఏమిటి' అనే అనుమానం—వారిద్దరూ పాలిపోయిన మొహాల్తో బట్వాడా చేసుకున్నారు. ★

### గృహ రామాయణం

పెళ్లి సంబంధాలు రావటం, అవునా కాదా అని గుంజాటనలు, పెళ్లిచూపుల తతంగాలు, ఇంటిల్లిపాదీ ప్రసంగాలు - సంసార రంగంలో అతి సహజాలు.

పెళ్లికూతురు గ్రాడ్యుయేటు. పెళ్లికొడుకు డబుల్ గ్రాడ్యుయేటు. మరి ఈ చూపులకు అధ్యక్షతవహించే తాహతు గల వాణ్ణి పంపాలికదా అని పెద్దతల కాయగా ప్రొఫెసర్ గార్ని పంపారు.

వరుడికి, ఆచార్య వరుడికి నమస్కరించి కూర్చున్నది పెళ్లికూతురు

మధ్యలో మాటల్లో ప్రొఫెసర్ గారు వధువు నిలా ప్రశ్నించారు: 'మీ కాలేజీలో ఎంత మంది ఉంటారమ్మా పిల్లలు?'

'అటెండెన్సు రిజిస్టర్ లో ఉన్నవాళ్లల్లో ఎప్పుడూ సగం మంది అండీ'

ప్రొఫెసర్ గారు ఉలిక్కిపడ్డారు.

'రోజూ బస్సులు రద్దీగా ఉంటాయి పాపం. వెళ్లడం కష్టమే! బస్సులో ఎంత మందిని ఎక్కిస్తారేమిటి రోజూను" అని మళ్లీ అడిగాడు ప్రొఫెసరుగారు.

"సారీ నేను లెక్కపెట్టడం లేదండీ" అన్నది మందస్మితంతో పెళ్లికూతురు.

ప్రొఫెసర్ గారికి కలుక్కుమన్నది. ఇంటికి తిరిగి వస్తూ ప్రొఫెసర్ గారు 'బాబూరే ఈఅమ్మాయి అఖండురాలురా!'

"అందుకే తప్పకుండా..." అంటూ నవ్వాడు వరుడు.



ముప్పేట ముత్యాలసరం ఈనాటి నగలలో చాలమందికి ఇష్టం జాకాలం మోస్తైన మీదట అవే నాజూకాలై పొడుగు తగ్గేసరికి మళ్ళీ పాతకాలపు తమ్మెలే అయ్యాయి రవ్వలమర్చిన తమ్మెలను కుడిచివర చూడవచ్చు ఈకాలపు వడ్డాణాలను, రవ్వల నెక్లస్ నుకూడా ఈచిత్రంలో చూడవచ్చు

[ఫొటోలు: ఉమ్మిడి బంగారుశెట్టి & సన్స్ వారి సౌజన్యంతో]

మిసిమిని ఉద్ఘోషించడానికి, చుట్టురా ఉన్న నీలవేణి వాణిని మించింది లేదంటాడు. ఆమె కర్ణయుగళి శ్రీకారాకారాన్ని కీర్తించడంకూడా ఆ నల్లనిజుట్టుకు మహాకావ్యంలో ఉపాఖ్యానం చెప్పడమేనని వివరిస్తాడు. ముత్యాలసరం ఆమె, అరుణాధరాన్ని అనుకోనేఉందని హెచ్చరిక చెబుతాడు. పువ్వుల రాగాల తీగే మేధికలా ఆమె చెంపలలోనే నరుకుని అనురాగ మనురాగోదయాన్ని సదా నిర్విరామంగా శాశ్వతంగా చిత్రిస్తున్నాయంటాడు.

ఇంద్రనీలాలు ఆమెకళ్ళలో లేవని అనుమానం కలిగితే తన కళ్ళలో ప్రతిబింబం చూసుకోమని సూచిస్తాడు. ఆమె మంగళగళసీమగురించి మాట్లాడేందుకు నల్లటినల్లపూసలకు త్రికంటెకి, నక్షత్రాలవంటి నక్షత్రాలకూ తప్ప మరిదేనికీ అధికారం లేదంటాడు ముప్పేటగొలుసులు, కాసులపేరూ మొదలైన ఆభరణాలను ఆమె ధర్మప్రభ ముందుంచి అవమానించవద్దని హితవు చెబుతాడు ఆమె నడుము కేవలం భ్రాంతిమాత్రమే కాబట్టి వడ్డాణాలు తనుమధ్యాభరణాలు కావనీ కేవలం మిథ్యాభరణాలనీ విశదం చేస్తాడు ఇలా వింటూఉంటే, లజ్జే ఆభరణమని, శీలమేభూషణమని ఇంకా అలా చెప్పకుపోతునే ఉంటాడుకాబట్టే, నమ్మరాదు చెలీ అన్నారు

* * *

ఆకాశానికి నక్షత్రాలందం ఆడదానికి నగలందం. ఎంత బంగారప్పళ్ళానికైనా నాగోడ చేర్పుతప్పదన్నారు ఎంత సౌందర్యరాశికైనా ఉపమానాలకు ఆభరణాలుతప్పవు అందతెలు కానివారికి అవే ఉపమేయాలై యథాశక్తిని ఆదుకుంటాయి నగలులేని మెడ నవ్వులేని ముఖంలాగ పువ్వులేని కొమ్మలాగ పిల్లలులేని ఇల్లులా పూజలేని దేవుడులా ఉపమానంలేని కావ్యంలా, రసహీనమైన వాక్యంలా, ఈవిలేని సంపదలా, జనంలేని సభలా, అట్టలేని పుస్తకంలా

అందం సంగతి ఎలా ఉన్నా ఆనందం ఉంది ఆనందమే మహాభాగ్యం అయినా, ఒకొక్కసారి మహాభాగ్యమే ఆనందం అనిపిస్తుంది ఉండంవల్ల ఏనాటికైనా ఏనాటనైనా, ఏజాతికైనా ఆభరణాలమీద ఎప్పటికి తెగని మోజు రివాజు. నాగరికత అనేది ఏర్పాటుకావడానికి ముందర్నుంచి నగలున్నాయి కాలచక్రంలో అనుఅనునా అన్నిటతోపాటు సర్దుకున్న నగల రూపురేఖలు చరిత్రలాగే పునఃపునరావృతం అవుతూనే ఉంటాయి ఒకనాటి మోటునగలే ఈనాడు కొత్త నాజూకై నాగరికం నేర్చుకొంటున్నాయి

ఇతర దేశాల జాతులమాట ఎలా ఉన్నా, మన కథలో, కథారంభంనుండీ నగలు ఉన్నాయి. మహావిష్ణువులాను ధరించే శంఖ చక్ర గదాగులు ఆయుధాలుగా కన్నా ఆభరణాలుగానే వాడుకుంటున్నట్టు కనిపిస్తాడు బ్రహ్మకు, వేదాలు భూషణాలు అని తెలిసినా, నగానత్రా అంటే జోతిగా గిలుక నేంగుకు దాఖలాలులేవు పరమశివుడు ఫణిభూషణుడు ఫణి, మణి భూషణుడు. బూడిద పూసుకున్నా ఆయన ఉండేది వెండికొండ. ఈ విధంగా నగరాజసుతా, నగలూకూడ ఒలుక్కునీయాడ్లో కంటివాడికి తెలీకుండా ఈ ఏర్పాటు చేసి ఉండాలి అయినా ఆడదానిమాట కూడదనడం కూడదని, ఇదంతా తెలిసినా తెలియనట్టు తిరుగుతాడాయన చిల్లరగవ్వల్ల సంగతి చెప్పవక్కరలేదు ఏనువారాలనగకట్టూ లేని వాళ్లు అరుదు. పంచభూతాలలోను భూదేవి నగకట్టు సంగతి, ఏ సౌందర్య పిపాసి అయినా చెప్పగలడు. కవులు, చిత్రకారులూ యుగయుగాలుగా చెప్పకుపోతున్నా తరగనిగని అది. సముద్రుడు గంభీరుడు ఉన్నవన్నీ కడుపులో దాచుకుని ఊహాజ్ఞానంగిపోతూ ఉంటాడు. కంటికి కనబడని గాలి, చల్లదనాన్ని పరిమళాన్ని ధరిస్తుంది. ఆకాశం సూర్యచంద్రుల్ని నక్షత్రాలనూ అలంకరించుకుంటుంది. నిజానికి ఆభరణం పెట్టుకోని వాడేలేడు. ఉన్నవాళ్లు ఉన్నవి పెట్టుకుంటే, లేనివాడు లేమినే చిరునగవుతో కలిపి నగగా ధరిస్తాడు. బీదవాడికి స్వేదబిందువులంతటి నగలు ఎక్కడ దొరుకుతాయి!



భూమ్మీద మనిషి పుట్టినప్పటినుంచి, తెలిసో తెలియకో ఏదో ఒక నగపెట్టుకుంటునే ఉన్నాడు. కొమ్ములూ రెమ్మలూ, ఆకులూ పువ్వులూ, కొమ్ములూ, దంతాలూ వగైరాలన్నీ అంగాంగాలకీ అలంకరించుకోవడం నేర్చుకున్నాడు. తీరిక వేళలు ఎక్కువ

# ★ నగలూ - నాణ్యాలూ ★

అసలి ఆభరణాలమీద శ్రద్ధ ఎక్కువచేసి వాటిమీద మోజు రోజు రోజుకూ పెంచుకుంది.

కొన్నాళ్లకి కనకం కనబడి విలువ పెరిగే వరకూ, కాంతికి కూడా విలువ పెరిగింది. ఆ యిద్దరూ కలిసి ఆడిన రామాయణ భారత భాగవతాలూ కట్టిన చరిత్రా ఇంతా అంతా కాదు. అది కరగని కథ. సీతమ్మవారు వనవాసానికి నారచీర కట్టుకువెళ్ళినా అందెలూ, చూడామణిమంటి కనీసాభరణాలు పెట్టుకు వెళ్ళడం వల్లనే, ఆమె ఉనికి, మనికీ రాముడికి సులువుగా తెలిశాయి

* * *

కొంతా కనకాలతో నాగరికుల కథ ముందుకు సాగినా, నాగరికతతో కలిసి సాగకుండా వనసీమలలోనే ఉండే వనితలకు ఆభరణాలు మటుకు ఆట్టే మారలేదు. వారివాటికీ, చేతినిండా కడియాలూ మెడనిండాదండలూ, దండలనిండా దండలూ, చెవులనిండా, ముక్కు మెయ్యా తలమునుగా ఆభరణాలూ ధరిస్తునే వున్నారు ఆ నగల నగాలమీద, ఆరోగ్యవంతాలయిన వారి చిరునవ్వు మొగాలు తారలమధ్య చంద్రబింబంలా ప్రకాశిస్తునే ఉన్నాయి. అన్ని నగలను నిభాయించుకు మరీ ప్రకాశించే సత్తా వారి అందంలో ఉంది. ఆరోగ్యం తక్కువై, మనుషులే ఒంటిపేట గొలుసులా నాజూగ్గా తయారయే రోజులు రావడంతో నగల పరిమాణాలూ, సంఖ్యా కూడా చిక్కి సగాలై శల్యాలై పోయాయి. అయితే మన పల్లెపట్టులు మటుకు నేటికీ, ఆనాటి మోటు నగలకు ఆడపట్టులనే కొందరికి అనిపిస్తాయి.



వజ్రఖచితమైన ఏడుకొండలవాడి అభయహస్తం

## పట్టెడలు

కలవారి ఆడపడుచు ధరించగల నగల పైనాలు ఈనాడు చిత్రంగా తోచవచ్చు

కంఠసీమను ఆశ్రయించుకు వెలిగేనగలు.

బంగారం బిళ్ళలు అమర్చి పట్టుదారం పోసి, కంఠాన్ని ప్రియుని హస్తాలలా ఆలింగనం చేసుకునే కంఠపువ్వుపట్టెడ నువ్వా నేనా అన్నట్లు మెరుస్తూ ఉంటుంది. మంచి ముత్యాల పట్టెడ కూడా ఈ కోవలోదే ఈమధ్యనే ఇది బెంటెక్స్ ముత్యాల నెక్లెస్‌గా మారువేషం వేసుకు మళ్ళీ వచ్చి ఫ్యాషనైంది. కంఠపువ్వు పట్టెడకే ఐదేసి మువ్వల వరుస కడితే గజ్జెలపట్టెడ అవుతుంది సహజంగా అన్ని గజ్జెల మోత ధరించలేనివాళ్లు ఒంటిమువ్వ పట్టెడ కట్టించుకునేవారు (అప్పుడూ ఉన్నారు సుకుమారులు) అయిదారు కాసులనుంచి పదికాసుల దాకా ఉండే ఈ పట్టెడకింద నేనవారు పట్టెడలాటి ఇంకోపట్టెడ వేసిదానిమధ్య ఒక మొహరు అమర్చి 'నాను' అనే పేరు వంకతో ఇద్ది చేయించుకునేవారు కొందరు గోరువంకలు.

## పేర్లు పేర్లు

ఏడువారాల నగలూ ఉన్నవారు పట్టెడ ఓనాడు వేసుకుంటే, మర్నాడు మిరియాల పేరు వేసుకుంటారు. దగ్గర దగ్గరగా పటుదారంతో వటకాలా అమర్చి పోసే అయిగు పేటల మిరియాలపేరు వేసుకున్న కంఠాన్ని చూశాకనే, దానికి శంఖం అనే ఉపమానం చెప్పారెవరో. ఇలా ఉపమానం గుర్తురాని వారికోసం అని ఒక్కోసారి శంఖాల తావళం మర్నాడు పగడాల తావళం వేసుకోవడం కద్దు మిరియాల పేరులాగే, గుల్లలేని గుళ్ళపేరులూ ఉండేవి. వీటిని వైశ్యులు విశేషంగా వేసుకొనేవారు.

కాసులపేరు సరేసరి. తాహతులేని వారు 80 కాసులతో సర్దుకునేవారు. ఇవప్పట్లో చాలా తాహతు మిగిలిఉన్న వాళ్లు చిక్కగా వొత్తుగా కాసులు పేర్చి, పట్టుదారంగట్టి చాలదని బంగారుతీగతో వాటిని పోయించి కట్టించేవారు. దీన్ని కట్లకాసులపేరు అని మన్నించుకున్నారు.

పట్టెడకింద ఒకరోజు నాను వేస్తే, జిగినీ నాను మర్నాడు రాణిస్తుంది. పుదుచ్చేరి పేటిక పేరుమోసింది మనదేశంలోకూడా ఒక చిన్నవాడు ఇలాగే తనపెళ్ళాం ఈ నాను వేసుకోగా చూసి, ఎవరో అనుకొని 'అరె ఈ పిల్లని పెళ్ళాడి ఉండాల్సింది' అని నాలిక్కరచుకోగా [illegible] ఈ కాలప్పిల్లలూ ఆవటాని ఆకాలపు నాయ

తమ్మె ముక్కున వేలు వేసుకు విస్తుపోయిందిట. ఈ జిగినీ నాను చిక్కటి గొలుసు అల్లిక మధ్యన చారెడు పతకం ఉండి, అందులో ఎర్రరాళ్లు, పండు దానిమ్మగింజల్లా జిగేల్ జిగేల్ మని మెరుస్తుంటాయి.

కంఠాభరణాల కోవలో కొంత ఆర్భాటం లేకుండా వచ్చి నిలబడింది కంటె. ఇది కొందరికంటే కింపయితే కొందరికి కంటగింపు అయేది. గోపాలకులు దీన్నే తమ ఆచారాలలోకి అనువాదం చేసుకుని అడ్డిగ అని పిలుచుకున్నారు.

హారాలు, గొలుసులు పేరుపేరునా వుండేవి చంద్రహారాలూ వరహాల పేర్లూ, కాసులపేరూ బిళ్లలు బిళ్లలుగా ఉండేవి. వరహాలమీద కృష్ణుడిబొమ్మలు వేసేవారు. అలాగే పలకసరులు, గోవర్ధన గొలుసులూ, అటుకుల పేర్లు (అటుకులంత అలాగే ఉండేవి) ధాన్యమాలాను. తూర్పున, ఓఢ్రదేశం నుంచి వచ్చిన సారిసెమాల (అవాలు) ఉండేది దశావతారాల దండ ఒకటి గొప్ప వారిదగ.

ఈ హారాలన్నింటిమధ్య నల్లగా మిలమిల మెరుస్తూ కుత్తికంటె ఉండేది ఇది మంగళ చిహ్నం. రెండు పేటల నల్లపూసలు (ఒకే పరిమాణానివి) పోసి మధ్యన బంగారు పాలకాయ దానికి ఎడాపెడా రెండు పలకసరులూ అమర్చేవారు. మాంగల్యం ఇంటి ఆనవాయితీని బట్టి కులాచారాలను బట్టి ఉండేది. కమ్మవారింటి పడుచుకు రెండేసి కాసుల పుస్తెలు చేయిస్తారు సొట్టలు పోకుండా వెనక లక్క దన్ను పెట్టి వెండికడ్డీకు కడతారు బ్రాహ్మల ఇళ్లయితే ఆనవాయితీని బట్టి నూటొక్క విసంతో పోయిస్తారు కొన్నిళ్ల అరకాసు బంగారం పుస్తె రూపం ఫలానా విధంగా ఉండడంలో తత్వర్యం, వాటి పవిత్రత, అందరికీ తెలుసు కాంచన కుంభాలలా ఉండే వాటి మధ్యన ఎర్రటిపోడి అమర్చి అలంకరిస్తారు నాయుళ్ళ యిళ్ళ, పుస్తెలు మంగళకరమైన మావిడాకుల మోస్తరుగా చేయిస్తారు.

## కర్ణాభరణాలు

మహాభారతీయులలో కవచకుండలాలతోనే పుట్టిన మహాపురుషుడు కర్ణుడు అవి ఆయనవంటినంట పెట్టుకున్నంత కాలమూ కీడు మూడరాదని సూర్యుడి వరం (ఆభరణాలు అందాన్ని కాక, ఆరోగ్యాన్నిస్తాయని, దుష్ట గ్రహాలను దుష్టశక్తులను దూరంగా ఉంచుతాయనీ మనలో సర్వత్రా ఒక నమ్మకం) చివరకి ఇంద్రుడు వచ్చి దానం అడిగిన రోజున, కర్ణుడు యావజ్జీవితం మాత్రమే ఉండే ఆ ఆభరణాలను వలిచి ఇచ్చి, మహాదాత అనే మహదాభరణాన్ని-శాశ్వతమైనదాన్ని తీసుకుని అలంకరించుకున్నాడు

ఇంతకీ కర్ణుడికీ కర్ణాభరణాలకీ శబ్దంవల్ల తప్ప ముఖ్యంగా సంబంధం లేదు.



భద్రాద్రి సీతారాములు కల్యాణోత్సవసమయంలో ధరించేనగలు

చెవులకు పూర్వం నగలకోసం అని విస్తరంట్లు కుట్టినట్టు కుట్టేసేవారు చెవి పైభాగాన ఆరంభమై అంచువెంటనే కిందకిదిగేవి ఈ నగలు పైన బొగడలు మెత్తగా మెరిసేవి ఒక బంగారుతీగకి ముత్యంగుచ్చితే బొగడ. దానిపక్కనే ఉల్లబావిలీలు పచ్చగా ధగధగలాడేవి. ఆ క్రింద పచ్చబావిలీలు మిలమిలలాడేవి వాటికి దిగువన కర్ణబావిలీలూ, తాలూకాలూను 'తాలూకా'లో మూడేసి ముత్యాలు నిలుస్తాయి ఈ వరసకి ఎగురువేపు గూబపక్క ఒకచిన్న చర్మఖండం ఉంది కదా దానికీ ఓ ముత్యం పెట్టేవారు

తాలూకాల బదులు ఒకోసారి జూకాలు వాడేవారు లేదా ఐదురాళ్ళ గుద్దులు. పిల్లలయితే లోలాకులు (ఇవి ఇటీవల వచ్చాయి) గుద్దులలో నేరకరకాల విలువైన రాళ్ళు పొదిగేవారు—రవ్వలు, పుష్యరాగాలూ, కెంపులూ మొదలైనవి 'గని కులా'నికి చెందనివాళ్లు కేవలు అయినా పరి తమ్మలు చేయించేసుకునేవారు చెవి బోసపోకుండా. బంగారు కేవుమీద పువ్వునగిషీ చెక్కడమే కాబట్టి ఇవి టూకీగా తేలిపోయేవి

కావులీల వరసమీద దాదాపు ఐమూలగా చెంపసరాలు వెలిగేవి ఈ సరాలమీద విలువైనవాళ్ళు, అజాకోపోతే ముత్యాలూ అమర్చేవారు తమ్మెట దగ్గిర్నించి చెంపమీదుగాపోయి, చెంపలమీద ముంగురులలోని ఒకపాయలో కలిసిపోతాయి ఇవి

జుట్టుమీద బోలెడంత నగకట్టు. పాపిడమీదుగా ఫాలభాగానికివచ్చి ధగధగలాడే పతకాన్ని, తిలకానికిపైన అలకలమధ్య పట్టుకు నిలబడుతాయి పాపిట బిందీలు దీనికి ఈ చివరనుంచి మళ్ళీ నుదురుమీద జుట్టు అంచువెంబడే ఎడాపెడా రెండు పాయలుపోయి చెవులవెనక సిగపాయలోకి అదృశ్యమవుతాయి

తలకు దగ్గిర పాపిడకు అటూ ఇటూ వందిమాగధులలా నిలిచి కైవారాలు చెప్పే సూర్యచంద్రులు చంద్రుడు చంద్రరేఖలా ఉంటారు తాహతు కొద్దీ వజ్రవైడూర్యాలుంటాయి వీటిలో. పాపిటచివర జుట్టు నీలజలపాతంలా వెనుకకుదిగే ముళ్ళుదగ్గిర రాగిడీ ధగధగ మెరుస్తూ కళ్లు మిరుమిట్లు గొలుపుతూ ఉంటుంది చారెడు బంగారం బిళ్లా దానిమీద చక్కని నొస్తగుళ్లో తాపడంచేసిన రేకులూ (లేక రవ్వలు) ఇదీ నల్లటి జట్టుమీద నిలబడి నీలాకాశంలోనిండు చంద్రుడిలా ప్రకాశిస్తుంది రాగిడీకి దిగువన, జడకుచ్చులనించి నాలుగుపాయలు అల్లుకుపోయాక అక్కడ చామంతిపువ్వు పెడతారు ఇది ముద్దబంగారమూ కావచ్చు, రాళ్ళు పొదిగినదీ కావచ్చు మరలా ఉండ జట్టులోకి తిప్పితిప్పి పట్టించే ఏర్పాటుఉందని లోకువ చేసి, కొందరు దీన్ని తిరుగుడు పువ్వన్నారు.

ఈ హంగులు లేకుండా మామూలుగా ఉండదలచుకున్నప్పుడు సుళ్ళరంగా బిరుసుగా జడేసుకుని. జడగంటలు పెట్టుకుని జడకుచ్చులలోను (ఇష్టాన్ని బట్టి) మధ్యనా నాగరం పెట్టేసుకుంటే ఆడపిల్ల నటింట మాలక్ష్మిలా ఉంటుంది. నాగరాలు కొన్ని గుండ్రంగా చిన్నబిళ్లలా ఉంటాయి చివర నగిషీ పెట్టి మధ్య రాళ్లు తాపడంచేస్తారు కొన్ని అవి పెట్టుకునే అమ్మాయిలాగే కేవలం ముద్దబంగారం అందుమీద చిన్ని కృష్ణమ్మబొమ్మ అచ్చువేస్తారు [మిగతా పైవారం]

---

**అబ్బురాల అబ్బాయి**

"అమ్మా నేను బంగారు కొండ నంటావు కాదూ."

"అవునే నాన్నా-నాబంగారు కొండవు"

"అయితే సరేగానీ, మరి కానీ ఇవ్వమంటే యివ్వవేమే రోజూ ?"

---

# ★ ఉత్తరాలు ★

(2-వ పేజీ తరువాయి)

దయచేసి ప్రవీణ్ గారు ఒక్కసారి చిక్కడపల్లి ఊరి (బస్తీ)లోనికి కూడా వచ్చి చూడవలెనని మా కోరిక

పులుపుల వెంకట లక్ష్మీనారాయణ
హైదరాబాదు

* * *

ప్రవీణ్ గారు "దైవాధీనం బస్ సర్వీస్" శీర్షిక క్రింద ఆర్. టి. సి లో ఉన్న అనేక లోపాలను, అవకతవకలను బహిర్గతం చేశారు పై విమర్శన ఉన్నతాధికారులదాకా వెళ్ళి ఆర్. టి. సి లోని లోపాలు సవరించబడితే ప్రవీణ్ గారు చేసిన కృషి నిష్ఫలం కాదు

భాగవతుల విశ్వనాథరావు,
హైదరాబాదు

శ్రీకృష్ణుడి లీలలన్నా తెలుసుకోవచ్చు గాని మీ పత్రికలో ఏరోజు ఏ కొత్త ఆకర్షణ వస్తుందో చెప్పలేం

అన్నట్టు ప్రవీణ్ గారు తన కలాన్ని పంచదారపాకంలో ముంచి రాస్తారా? లేకపోతే అంత తియ్యగా కబుర్లు చెప్పగలరా?

భండారు రామచంద్రరావు,
ఖమ్మంమెట్టు.

ప్రవీణ్ గారి విమర్శలు చాల ఘాటుగా వుంటున్నాయి ఇవి అధికారులలో సంచలనము కలిగిస్తాయని నా నమ్మిక

గ్రంధి నాగేశ్వరరావు, నిడదవోలు

ఇటీవల దినపత్రికలలో మనం చూసున్న నేరస్థులను బయటికి లాగి వారి పాత జీవిత గాధలను త్రవ్వి, బయటపెట్టడమే "ప్రవీణ్" లక్ష్యంగా కన్పడుతోంది క్రమేణా ఈ శీర్షిక నేరంగా తయారవుతోంది ఆంధ్ర రాజధానిలో నేరస్థుల భోగట్టాలు తప్ప వ్రాయడానికి ఇంకేమీ లేవా? భాగ్యనగరం గొడ్డుపోయిందా విశేషాలకు?

"ఆశ" విజయనగరం

"శ్రీకృష్ణ జన్మస్థానం చెప్పినకథలు" చదవడానికి చాలా యింటరెస్ట్ గా వుంటాయి రచయితకు నా ధన్యవాదాలు

యస్. నారాయణ చౌదరి,
బంటుమిల్లి పల్లె

* * *

ఆంధ్ర సచిత్ర వారపత్రికలో తరుచు వ్రాయు సి. రామచంద్రరావుగారునూ, ప్రముఖ టెన్నిస్ ఆటగాడు రామచంద్రరావునూ ఒక్కరేనా తెలియపర్చవలెను ఆయన కథలు చాల ఆనందదాయకములుగా నున్నవి.

చంద్రశేఖరం—?

* అవును, ఒకరే.

## వినతి

సి. ఆదిలక్ష్మిగారికి - వారు తెలిసిన విషయం రాస్తున్నాను భద్రాచల రామదాసు చిలుకను పట్టి వారం రోజులు బంధించిన పాపఫలమువల్ల నేకదా, తానీషా బందిఖానలో ఉన్నాడు. అందువల్లనే మీరు వెంటనే పావురములను విడిచిపెట్టండి పెంచిన మమకారం గదా విడిచిపెట్టుటకు బాధాకరంగానే వుంటుంది మరచిపోవుటకు ప్రయత్నించండి

అరుంధతి, (విజయవాడ)

* * *

వనితాలోకంలో "కాలదోషం పట్టిన ప్రవచనాలు" అన్న శీర్షికలో వ్రాసే వ్యాసాలు చాలా విజ్ఞానదాయకంగా ఉన్నాయి ముఖ్యముగా వారపత్రికలో కథలతో పాటు, వ్యాసాలు, కబుర్లకు కూడ సావకాశమునిచ్చి వాటి అభివృద్ధికి తోడ్పడుట చాలా సంతోషించ తగ్గ విషయము. ఈవారము వ్రాసిన "స్వరలహరి" వ్యాసము చాలాబాగుంది

రామకృష్ణ-రాజమండ్రి.

* * *

'కాలదోషం పటిన ప్రవచనాలు అనే శీర్షికలో స్త్రీ స్వాతంత్ర్యం పై వ్యాసం చదివాను అది ఎంతవరకూ సమంజసమో సరిగా నిరూపించబడలేదు ఇందులో చెప్పబడిన (స్త్రీ) స్వాతంత్ర్యమునకు, అవసరము నిర్వచనమిచ్చి, ఆ పిమ్మట ఆ నిర్వచనమునకు లోబడి కాలదోషం పట్టినదని వ్యాఖ్యానిస్తూ నిరూపిస్తే యింకో విధంగా వుండేది స్త్రీ స్వాతంత్ర్యమునకు అర్హాలు అనే విషయమే తీసుకొంటే, ఎటువంటి స్వాతంత్ర్యము? ఎంత వరకు? అనే ప్రశ్నలకు సమాధానం యివ్వాలి ఆస్తి హక్కు ఓటు హక్కు వున్నంత మాత్రాన పురుషునితో సమాన స్వాతంత్ర్యం వుంది అంటే ఒప్పదు. ప్రతీ దానికీ ఒక పరిమితి అంటూ వుంది. అది కూడా ఆయా తరగతుల మధ్య హెచ్చుతగ్గులలో వుండవచ్చు. కేవలం ఈ వ్యాసంలో తర్కించబడిన అంశాలు, యీ ప్రవచనం పూర్తిగా కాలదోషంపట్టిందని నిరూపించజాలవు యింతకన్నా కాలదోషం పడుతూవున్న లేక పటింపబడుచున్న ప్రవచనాలు అంటే బాగుండేదేమో. స్వాతంత్ర్యమును ఆస్తి హక్కు ఓటు హక్కులతో ముడి పెటుట సరిగాదు. "హక్కు" "స్వాతంత్ర్యము" వేరువేరుగా నిర్వచింపబడవలసినవి కాని మొత్తంగా ఒకే నిర్వచనానికి రాలేవు హక్కునూ స్వాతంత్ర్యాన్ని ఒకే దృష్టితో చూచి వ్యాసాన్ని వ్రాసినట్లగపిస్తుంది.

రహీం (ఏలూరు)

> ### నాటకీయత
>
> దిగాలుపడి కూర్చున్న సుప్రసిద్ధ నాటకకర్తను ఒక మిత్రుడు పలకరించారు
>
> "నిన్నటి మీ నాటక ప్రదర్శన ఎలా ఉంది? అలా ఉన్నారేం?"
>
> 'నాటకం - నాటక ప్రదర్శనం జయప్రదమే - టికెట్ బుక్కులే జయప్రదంగా ఖర్చుకాలేదు ప్రేక్షకులే జయప్రదంగా ఆనందించలేకపోయారు" అని ఆయన సమాధానం యిచ్చారు

## బేడ కెన్ని గులాబీలు?

తలనూనె తయారుచేయడానికి బేడ గులాబీలు కావాలని రాశారు. ఒక పువ్వు అర్ధణా కావచ్చు కాణీకి రెండు రావచ్చు అందువల్ల ఎన్నిపూలు కావాలో చెబితే బాగుంటుంది —ఎస్. ఎన్ బేగం, (నౌపడా)

## పావురాలు

సి ఆదిలక్ష్మిగారు పావురాలు పెంచుట మంచిది కాదా అని అడిగినారు పక్షివాతపు వ్యాధులకు నిటి గాలి వైపరీత్యమునుంచి... మేము చాలా కాలమునుంచి పావురాలను పెంచుచున్నాము మాకు ఎటి అపకారము జరుగలేదు మా ఆరోగ్య భాగ్యములకు ఎట్టి లోటు కలుగలేదు

మీనారాణి, (బందరు).

బి లీలావతిగారు చెప్పిన ప్లానులతో పంచి కేవలం స్వెటర్ అల్లిక వచ్చినవారికే చెప్పినట్లున్నది నిట్, పరల్ ఎలా వెయ్యాలో, పంచీ ఎలా ముగించాలో వివరంగా చెపితే అందరూ నేర్చుకోవటానికి వీలుగా వుంటుంది.

జి అనసూయాదేవి (విజయవాడ)

## "పురుషలోకం"

"వనితాలోకం" శీర్షికద్వారా స్త్రీల సమస్యలు వ్యాసరచనద్వారా తెలుపుటకు అవకాశమున్నది కాని, పురుషుల్లోవున్న అనంత సమస్యలు తెలపటానికి ప్రత్యేక మార్గం లేదు అందువలన "పురుషలోకం" అనిగాని "యువలోకం" అనిగాని మరొక వ్యాసరచన శీర్షిక పెడితే చాలా ఉత్సాహకరంగా యుంటుంది.

కె యస్. జోగారావు, (బిలాసపూర్)

# ★ అధికారి ★

(36 వ పేజీ తరువాయి)

విలవిల్లాడిపోయి గోలగోల పెట్టేసింది

ఆ సమయంలో—మధ్యాహ్నం తోడి 'సుకున్న నూతి నీళ్ళల్లా గాలి చల్లగా హాయిగా ఉంది శీతాకాలంలో వేసుకున్న దలిటోపీలా ఎండ వెచ్చగా సుఖంగా ఉంది. గంగతో కడిగినట్టుగా ఆకాశం నిర్మలంగా ఉంది పండిన పొలాల్లో భూమంతా బంగారంలా ఉంది అల్లంత దూరంలో మామిడి తోటలు నందనవనంలా ఉన్నాయి

మరి అలాంటి సమయంలో అలుగుడు దెబ్బ తమమీద పడుతుందని పిట్టల జంటకి తట్టలేదు అవి గొంతుకలు చించుకొని గోలపెట్టి భగవంతుణ్ని ఎలుగెత్తి ప్రార్థించేయి

పిట్టని "ఒగ్గిరా" అన్నాగు భగవంతుడు నూకరాజుద్వారా రవ్వలకొండ ఒగ్గలేగు చేతిలో ఉన్న పిట్టని చెట్టుమీదున్న పిట్టకి చూపించి ఊరించడం మొదలుపెట్టేడు

అప్పుడు నూకరాజేంచేసేడంటే పక్కనున్న కర్రతీసి రవ్వలకొండ చేతిమీద పడేన్గా బలంగా కొట్టేడు ఆ కొట్టడంలో ఇద్దరూ కుస్తీకి దిగిపోయి నేలమీద పడిపోయి చిక్కుపడిపోయేరు 'పెద్దోళ్లొచ్చి' ఇద్దర్నీ తన్ని విడిపించవలసొచ్చింది కాని అదంతా వేరే సంగతి ముందా పిట్టలజంట తుర్రున పైకెగిరి రెక్కసాగి నంవనవనం లోకి ఎగిరిపోయింది నూకరాజుకి ఆనాటి విజయమంతా గుర్తుకొచ్చి, ఆదృశ్యం అంతా కళ్ళకి కట్టినట్టయింది

ఆనాడు అలుగుడులో పిట్టని పట్టుకున్న రవ్వలకొండ ఇప్పుడు పట్నంలో పోలీసు జవానుగా ఉన్నాడు ప్రస్తుతం అప్పాయమ్మ ఇంటిముంగు మంచంమీద తాజుగా రాజులా కూర్చున్నాడు అతని నోట్లోంచి నూటిగా పైకొచ్చే సిగరెట్టు పొగ రంగుల మేఘంగా అల్లుకొని వన్నెలూ చిన్నెలూ తెచ్చుకొని వయ్యారంగా నాట్యంచేస్తోంది రవ్వలకొండ కాలుమీద కాలువేసుకొని, రెండు చేతులూ వనక్కి ఆన్చి, తలపై కెత్తి, సిగరెట్టుని నోట్లో నిల్చోబెట్టి, చూరుకిందకి వారచూపు చూస్తున్నాడు

ఈ కథకి రవ్వలకొండ విలన్ సంగతి వేరే చెప్పనక్కర్లేగు

చూరుకింద గుమ్మంలో దీపపు వెలుగులో మెరిసే నాగరత్నం కళ్ళు కాంతి పుంజాల్ని వెదజల్లుతున్నాయి ఆమె కళ్ళనిండా రవ్వలకొండే ఉన్నాడు ఆమె మనసు అటు ఊగించడానికి పెద్ద తంత్రం ఏమీ అక్కర్లేగు ఆమె గొక్కచూపు చాలు నర్థంతా తెలియడానికి

నూకరాజు మానసికంగా కుప్పకూలిపోయేడు. బంగారు పువ్వుకూడా పురుగుపడుతుందని అతననుకోలేదు.

అతనిరాకని అప్పాయమ్మ చూడలేగు. అతణ్ని రవ్వలకొండ గుర్తించనేలేదు రాకపోకలు గమనించే అవస్థలో నాగరత్నం లేనేలేదు దగ్గేముసలాయన మాత్రం నూకరాజుని చూసి పలకరించేడు. అంతట అప్పాయమ్మ కూడా అతణ్ని చూసి, పోయిన పెన్నిధి తిరిగిలా ఒచ్చిందో జరిగిన సంగతేమిటో అంతా చెప్పింది

మేస్త్రీదగ్గరకి నూకరాజు వెళ్ళొచ్చేలోపున "అంతా రొండు మి నేట్లలో చెటికెల్లాం టయిపోనా"దట "ఈ జవాను బాబు—దరమదాత—దేవుళ్లా ఒచ్చిపడి పేనానికి పేనం ఆడేసి పిల్లని బైటకి లాగేసి"నాట్ట

"ఇనకొన్ పెట్రో ఏటో, ఆమాటే నాకు రాదు. ఆబాబు పేరేటి బాబూ?" అనడిగింది అప్పాయమ్మ కొండబాబుని.

"సబిన్స్పెట్రు" అన్నాడు కొండబాబు

"అవునాబాచే" అంది నాగరత్నం

"అది ఆ బాబుతో ఈ బాబు, సంగతేటో అసలేటి జరిగిందో ఏటో, అంతా టకాల్ టకాల్ మని మూడు ముక్కల్లో సెప్పేసినాడు 'పిల్లచూస్తే ఒట్టి ఎర్రిగొర్రే. తల్లిసూస్తే దిక్కుమాలినముండా, ఆసారా అంటే ఏటో సారాయేపారం అంటే ఏటో ఆళ్ళెగరూ, ఎండాడముండా సూటొగేస పోనాదిగాని ఈ పిల్లకి సారా అంటే సూపేనేదూ" అని ఆ పెద్దబాబుతో సెప్పేసి ఆబాబు నొప్పించి పిల్లనిడిపించుకొచ్చినాడు-ఈ బచే' అని చెప్పి రెండు చేతులూ ఎత్తి జోడించి రవ్వలకొండవైపు తిరిగి "రచ్చించినావు కొండబాబూ! రచ్చించినావు అయ్యా దేవుళ్ళతో సమానం నువ్వు" అంది అప్పాయమ్మ ఒక పోలీసువాడు అయ్యదేవుళ్ళతో సమానమనే సంగతి నూకరాజుకింకా తెలీగు

జరిగిన సంగతంతా చెప్పేక అప్పాయమ్మ ఇంకా ఏమన్నదంటే "నూకరాజుబాబూ, జవాన్గోర్ని ముందే ఎరిగుంటే అప్పుడే ఎళ్ళి ఆబాబు కాళ్ళట్టుకుందును ఎదాం సేత్తో ఈ బాబప్పుడే ఈ సిక్కంతా ఇడదీసేసును అసలప్పుడీ సక్కే నేకపోను" అంది అప్పాయమ్మ

అయితే 'ఈ సిక్కంతా ఎలా ఒచ్చిందో' అప్పాయమ్మకీ తెలీగు, నూకరాజుకీ తెలీగు అధికార్లని సేవాళ్లుంటారని వాళ్ళకి తెలుసు కాని, అధికార్లకి కత్తులుంటాయని గాని అవి రెండు వైపులా పదునుగా ఉంటాయని గాని వాళ్ళకి తెలీదు. కోటేశ్వరన్ గారు నీకంట పడకుండా నిన్ను గుమ్మంలోంచి తరిమికొట్ట గలడు; లేకపోతే, నీచేత పదిరూపాయిలు పెట్టి నీచేత కాళ్ళు పట్టించుకోనూగలడు. మంత్రిపుంగవుడు నిన్ను కొమ్ముల్లో పొడవ గలడు; కాకపోతే, పాలకుల ప్రతినిధి కాబట్టి నీకు పాలిప్పించి సాకనూగలడు న్యాయాధిపతి నీ మీద వచ్చిన పాపాన్ని నమ్మనూగలడు; నమ్మకపోనూ గలడు. రక్షకభటుడు నీమీదలేని నేరాన్ని సృష్టించగలడు; ఉన్న నేరాన్ని మాఫీ చెయ్యగలడు పక్కసందులోని గూండా నీ ఇంటిమీదకి రాళ్లు రువ్వించనూగలడు; రువ్వినవాణ్ని తిప్పి కొట్టనూగలడు వాళ్ళందరూకూడా నిన్ను తహతహ లాడించ గలరు లేకపోతే జేల్ జేలని నీచేత చేయెత్తి దండాలు పెట్టించుకోనూగలగు.

వెర్రిగొర్రెలు నువ్వూ నువ్వూను వాళ్లు కాగు

అందుచేత ఆనాటి ఆ వెన్నెలరేయి రవ్వలకొండకి జేజేలుకొట్టి బాజాలతో వెళ్ళింది

మర్నాడుసాయంకాలం మార్కెట్టునుంచి చేపలు కొనుక్కొని ఒస్తూన్న నాగరత్నం నెత్తిమీద కిరీటం పెట్టుకు నిలుచున్న కొండబాబునిచూసి పకోడీల గుడారం పక్క ఆగి అతనివైపు ఓరగా చూసింది రవ్వలకొండ ఆమె దగ్గరకి వెళ్ళి పలకరించి మొన్నరాత్రి సినీమాలో నాయకుణ్ని నవ్వునవ్వి, ఆ నవ్వులో ఆమెకు కితకితలు పెట్టి చివరకామెని సాగనంపి వచ్చి రావడంతో మరో నెంబరు టోపీ అతణ్ని వీపుమీద సభావమ్మని చరిచి,

"బలేపిట్టని పట్టేవే" అన్నది

"మరి, కిస్సా ఎలాటి కిసా ఏసేవవకున్నావ్?!" అన్నాడు రవ్వలకొం

"ఏటాకిస్సా?" అన్నాడు రెండో జవాను

అంటే అంతా చెప్పేడు రవ్వలకొండ

అప్పుడా మరో నెంబరుగల రెండవ జవాను ఆశ్చర్యపోయి,

"ఎనకనించి గోతులో తోసేయవద్దూ నువ్వే?! గంగుకొచ్చి నెత్తట్టుకు లేగదియ్యాద్దూ నువ్వే?!" అన్నాడు

"గోతులోకి తొయ్యకపోతే సేతిలోకెలా ఒస్తందనుకున్నావ్?" అని ప్రశ్నించేడు రవ్వలకొండ

మరో నెంబరుగల టోపీగలవాడు అంతట ఒక్కక్షణంసేపు గుడ్లు పెద్దవిచేసి అరక్షణం సేపు ఆలోచించి, తలనూపి,

"అన్యాయమైతే అయిందిగాని, గొప్ప రెంజిమెంటు చేయిస్సినావురా! నీ దగ్గర—ఎవడాడు?—శకునిమామ శకునిమామ కూడా నీ దగ్గిర బహాదూర్" అని మెచ్చుకున్నాడు అతనికళ్లు ఆనంద బాష్పాలతో నిండిపోయేయి

మొన్నటి నాయకుడి నవ్వు మళ్ళీ

# ★ అధికారి ★

నవ్వేడు రవ్వలకొండ నవ్వుతూ ఏమన్నా డంటే "అయి మనకి రెల్లోడిచ్చేడ్రా!" అన్నాడు

"రెల్లో ఏటిచ్చేడు మనకి?"

"ఫుల్ పవర్స్—పులిపవర్లిచ్చేడు. అంచేత, పట్టుపట్టడం మనవే. ఇడుపు ఇడవడవూ మనవే. అంతా మనిష్టం మనకత్తె లాటికత్తో ఎరికాకి మనకత్తికి రెండేపులా వాడే! గేపకంవుంచుకో!" అన్నాడు రవ్వలకొండ

మరో నెంబరు జవాను—కొత్తగా సర్వీసులో చేరేడు—గురూపదేశాన్ని గుర్తుంచుకొనే ఉంటాడు

అందుచేత, నాగరత్నం ఆవిధంగా వలలోపడి, గాలిలోపడి చివరకి జవానుగారి వళ్ళోపడింది ఆమె అలా రవ్వలకొండ వళ్ళో పడగలదని అనకున్నాడు కాని పడిపోయిందని తెలుసుకోలేగు నూకరాజు ఆమె తనకి ఎలాగా పోతోందని గ్రహించేడు, కాని ఆమెని తిరిగిదగ్గరకెలా తెచ్చుకోవాలో తెలుసుకో లేకపోతున్నాడతను లోకం నైజం తెలిసినవాడంత కష్టపడడు ఉపాయం ఎరిగినవాడంత కష్టపడడు కపటం తెలిసిన వాడూ అంత కష్టపడడు నూకరాజు మాత్రం చాలా బాధపడ్డాడు. అయితే, ఆబాధ ముసురు ముసురుగానే ఉంది చివరకొరోజున అది తుపానుగా మారింది

రాత్రి డ్యూటీ దిగి ఇంటికొస్తున్నాడు నూకరాజు రెండో ఆట సినీమా విడచిపెట్టేరు జనం చాలా మంది వెళ్ళిపోతున్నారు. అతనూ సినీమా గేటు దాటే సరికి జనం పల్చబడ్డారు గేటుదగ్గరుండే రిక్షాల గుంపు చెదిరిపోయింది అప్పుడు చూసేడు నూకరాజు.

పక్కనున్న ఓ కిల్లీకొట్టు దగ్గర సిగరెట్టు అప్పుడే ముట్టించి చకచక ముందుకి నడిచేడు మఫ్టీలో వున్న రవ్వలకొండ, అతని మెళ్ళో పాములాట మఫ్లరుంది చేతిలో వజ్రాయుధంలా ఓ టార్చిలైటుంది దుకాణానికి పదడుగుల దూరంలో ఓ ఆడమనిషి నిల్చొని అతనికోసం నిరీక్షిస్తోంది ఆమెని చూసి నాగరత్నం అనుకోలేదు నూకరాజు ఆమెని పోల్చగానే అతని వళ్ళంతా గజగజ వణికింది ఆమె పూర్వం ఎలా ఉండేదంటే పొద్దున్నే పూసిన సొగసైన పువ్వులా ఉండేది ఇప్పుడామె దీపాల వెలుగులో వజ్రాల విగ్రహంలా కనిపిస్తోంది

అలా నిల్చుండి పోయేడు నూకరాజు వాళ్ళతణ్ని చూళ్ళేదు ఆమెకి దగ్గరగా వెళ్ళి రవ్వలకొండ ఏదో అన్నాడు ఆమె కూడా ఏదో అంది. రెండడుగులు ఇద్దరూ ముందుకి నడిచేరు. మరో మూడడుగులు ముందుకి నడిచి రిక్షాని కేక వేసేడు రవ్వలకొండ జెబ్బపట్టుకొని నాగరత్నాన్ని రిక్షా ఎక్కించి తనూ అందులో కూర్చున్నాడు రవ్వలకొండ రిక్షా కదిలింది

వాళ్ళిద్దరూ నడుచుకు వెళ్ళిపోయి నా బాధుండేదేమో కాని ఆవిధంగా వాళ్ళిద్దరూ జంటగా రిక్షాలో వెళ్ళడం చూసిన నూకరాజు వాళ్ళిద్దరి సంబంధాన్నీ కళ్ళారా చూసినట్టుగా బాధపడ్డాడు. అతనికడుపులో గేవేసినట్టయింది అతని కాళ్ళకింద భూమి వణికింది నీరసంగా కిల్లీకొట్టుదాకా నడిచి అక్కడ పైనున్న బల్లమీద కూర్చుండి పోయేడు అయిదు నిమిషాలసేపు అలానే ఉండిపోయేడు

నూకరాజుకి తల దిమ్మెక్కిపోయింది. అతను వెలిగించుకున్న జ్యోతులన్నీ అకస్మాత్తుగా అతనికళ్ళెదుటే ఎటోకి దిగిపోయి ఆరిపోతూయి అతను వేసుకున్న రంగుల ఏరా అతని కళ్ళెదుటే నుండి మాడి మసైపోయి మాయమైపోయింది అతను వేసుకున్న పూలతోట అరక్షణంలో పాములపుట్టగా మారిపోయింది అతనికి తూర్పుదిక్కు ఎటో వెళ్ళిపోయి పడమటదిక్కు ఎదురొచ్చింది అతని వళ్ళంతా జలదరించింది. అతని మనసులో తుఫాను రేగి చెలరేగింది

కిల్లీకొట్టువాడు గుకాణం మూసేడానికి ముందు ఆరోజొచ్చిన డబ్బులు లెక్కపెట్టుకొంటూ గబ్బున ఏదో పడ్డ చప్పుడు చెవిని పడేసరికి ఉలిక్కిపడి తలెత్తి చూసేడు. చూస్తే కొట్టుముందర బల్ల తిరగబడిపోయింది పదిగజాల దూరంలో పోర్బరు కళాశి ఒకడు పులిలా పరిగెడుతున్నాడు. పదినిమిషాల తరవాత, లేక పదినిమిషాల్లోపునేనేమో దివాన్జీగారి ప్రహారీగోడపక్క వెన్నెలకూడా చొరలేకుండా పాపంగా పెరిగిన చెట్ల దట్టపు నీడల్లో గోడుమీద ఓ రిక్షా తిరగబడి పోయింది, ఓ రిక్షావాడు బాబో బాబో అనుకొంటూ పరిగెట్టి పారిపోయేడు;

ఆ వెంటనే, ఉక్కళ్ళ కర్రతో కొబ్బరికాయమీద కొట్టినట్టుగా కొద్దిసేపు చప్పుడయింది, ఓ మగవాడి మూలుగూ, ఓ ఆడమనిషి ఆర్తనాదం చెట్లనీడల్లో చిక్కుకుపోయి, చీకట్లో క్షీణించిపోయేయి.

పావుగంట తరవాత ఊరవతల నూకరాజు పాకవతల ఇసక మైదానంలో జంటతాటిచెట్ల దగ్గర కూర్చున్నాడు నూకరాజు అతనిపక్కనే రక్తంతో తడిసిన టార్చిలైటొకటి ఇసకలో పడుంది.

రాత్రి రెండుగంటలు దాటింది చల్లగాలిచేసే సవ్వడితప్ప మిగతా అంతా నిశ్శబ్దంగా ఉంది.

అలిసిపోయిన వాళ్ళూ, అంతా పోయిన వాళ్ళూ, మరింక ఎత్తిలనివాళ్ళూ, దెబ్బతిన్న వాళ్ళూ, దరిద్రులూ, దౌర్భాగ్యులూ ఎలా కూర్చుంటారో అలానే మోకాళ్ళ మీద తలపెట్టు కూర్చున్నాడు నూకరాజు

ఒక్కసారి కొంబోలు తలెత్తి చూసేడు.

అతనిచుట్టూ ఉన్నది ఎడారి కాదు. అక్కడ మండుటెండా లేదు

అది శ్మశానమూ కాదు అక్కడ తుఫానూ లేదు. ఆనాడు నాకు తెలిసిన పెద్దమనిషి చెప్పిన ప్రకారం నేను వర్ణించాలనుకొంటే అది ఆవిధంగా లేనేలేదు

అతనిచుట్టూ అదంతా ఎలా ఉందంటే స్వర్గంలో భాగంలా ఉంది.

వర్షింపడి బంగారుపొడి రాలినట్టుగా మైదానమంతా మిలమిల మెరుస్తోంది పాలరాతి మందిరంలో నీలిరంగు దీపంలా వెన్నెలంతటా నిగనిగలాడుతోంది ఎన్నెన్నో పూలతోటల్ని ముద్దులాడొచ్చినట్టుగా చల్లగాలి కమ్మకమ్మగా వీస్తోంది

అక్కడదంతా విహానంగా దివ్యంగా ఉంది అది నువ్వెప్పుడో చూసిన చక్కని బొమ్మలా ఉంది. అది నువ్విదివరకెన్నడూ చూడని మనోహరమైన చిత్రంలా ఉంది.

ఆ సమయంలో వెన్నెలతో నిండిన నూకరాజు కళ్ళుమాత్రం మరుగునీళ్ళతో నిండేయి. మరుగునీళ్ళతో నిండిన అతనికళ్ళు మంటలతో మండేయి

అవునంటే మరి అలానే జరుగుతుంది.

మెరిసే నీకళ్ళంట చుక్కచుక్కలుగా నెత్తురంతా రాలుంది బంగారు చెలమన్నా బ్రతికే నీ బ్రతుకంతా బూడిదపాలే అవుతుంది

నువ్వు నిలబెట్టుకున్న నీ ఇల్లొకనాటి శీతరాత్రిలో చల్లగాలిలో వెన్నెలతడిలో భగ్గునమండి తగలడుతుంది నీ కాపురమంతా చప్పున కాలిచల్లారుతుంది భగవంతుడు దయతో సృష్టించిన ఈదివ్యలోకంలో నీకాఖరికి దిక్కుమాలినచావుదక్కుతుంది.అవును. మరి అలానే జరుగుతోంది కదా!

# నుడికట్టు 15.

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 2 | | 3 | | 4 | ■ | 5 | ■ |
| ■ | | ■ | | ■ | 6 | 7 | | 8 |
| 9 | | | | 10 | ■ | | ■ | |
| ■ | | ■ | ■ | 11 | | | | |
| 12 | ■ | 13 | ■ | | ■ | | ■ | |
| 14 | | | | | ■ | ■ | 15 | ■ |
| | ■ | | ■ | 16 | 17 | | | |
| 18 | 19 | | 20 | ■ | | ■ | | ■ |
| ■ | | ■ | 21 | | | | | |

## ఆధారాలు

### అడ్డము

1. ఇది చెల్లించితే నిర్వ్యాజము ఉచితము కాబోలు!

6 అస్మదీయము హ్రస్వమైన వివాదము

9 శ్రీ శ్రీ మరో ప్రపంచంలో విరామ మెరుగక మ్రోగేది

11. వర్ణ సంకరమైన రోముగయ ఈ వ్యాధి ఏర్పడడానికి తోడ్పడుతాయి.

14 డొంక తిరిగి జనసంఖ్యలో విష్ణువుకి సంబోధన.

16 నాటకాల కరపత్రాలలో ఎప్పటిలాగునే నిబంధనలు

18 పెదవులు మూసి మూసి చిన్న నవ్వు నవ్వినందువల్ల చేదానికి విశేషణం కాబోలు.

19 పద్యాలలో గణాలు తప్పడాలు.

### నిలువు

2 గూఢచారులలో తారకాబోలు!

3 మీరు చిరాకు పడడంలో నోటికి హితవుగా ఉంది

4 నిఘంటువులో తలకిందులైన సాధువు

5. మీచే దప్పికలో తోడేది.

7 గులాబీ రంగులో ఉండని గులాబీ అరవంలో మంచిది కాబోలు!

8 అద్దంలో ఎవరిని వారు ఇలా కలుసుకుంటారు

10 లంకలోని వాళ్ళంతా మాట్లాడేది.

12. దాచుకున్న పంచగల లోకము.

13 ప్రయోజనము చివరకు బహుదూరము

15 విలువలేనిది

17 పేరాన భంగపాటులో గాడిద.

19 విసిరికొట్టడంలో దొరికే ధనం.

20. వికృతంగా మారిన శిఖ.

## 14-వ నుడికట్టుకుజవాబులు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| ■ | 1 మ | 2 నీ | షి | ■ | 3 ఫ | 4 ర | 5 వా | ■ |
| 6 ఓ | రు | వు | ■ | 7 భా | ■ | 8 వి | డు | 9 పు |
| 10 జా | గు | ■ | 11 మా | ధ | 12 వి | ■ | 13 క | ళ్ల |
| రు | ■ | 14 ఖ | ని | ■ | 15 నా | 16 వ | ■ | రి |
| ■ | 17 ఓజా | జా | ■ | ■ | ■ | 18 ల | త | ■ |
| 19 ప | ■ | 20 నా | 21 నా | ■ | 22 పా | చి | ■ | 23 కో |
| 24 సం | 25 త | ■ | 26 రి | 27 పు | లు | ■ | 28 ఆ | శ |
| 29 దు | ను | 30 ము | ■ | ట్టె | ■ | 31 చి | త్ర | ము |
| ■ | 32 వృ | ర | ఫు | ■ | 33 వి | త్త | ము | ■ |

# శ్రావణ తగువు

( 7 వ పేజీ తరువాయి)

"అప్పుడే చెప్పాడు పంపానని," అని నసిగింది ఆవిడ. సాయంత్రం భర్త యింటికి రాగానే తేల్చుకోవాలి ఎందుకొచ్చిన అబద్ధాలు, తన పేరుచెప్పి, యింకెవరికిచ్చారో! ఇంకెవరికయినా యిష్టముంటే యిచ్చుకోవచ్చు కాని, తనెందుకు మధ్యలో యిరికించి అనుమానించడం. కోపం, వుడుకుమోతు తనం మేళవించి వుండిపోయింది శారద. భర్తపై మొదట్లో వుండే అభిమానం ఆగ్రహంగా మారింది తమాయించుకుని అతనొచ్చేవరకు మాట్లాడకుండా, మారుమాట లేకుండా, పైకి వచ్చేసింది శారద. మనస్సు పరిపరివిధాల పరిగెడుతోంది. ఆలోచించిన కొద్దీ అనుమానం ఎక్కువవుతూంది గాని ఆధారం దొరకటం లేదు. మామూలుగా, సాయంత్రం యింటికి వచ్చాడు గోపాలం. రోజాకన్న వుల్లాసంగా వచ్చాడు చూడగానే, తనాతని సంతోషం పాడుచేస్తున్నానేమో అనుకుంది శారద. లేని నవ్వు, తెచ్చిపెట్టుకుని పేలవంగా నవ్వింది.

"అమ్మగారలా వున్నారేం?" గోపా-

"ఎలాగో వున్నాం లెండి!" అంది వ్యంగ్యంగా. ఏదో రభస జరిగిందేమో అనుకున్నాడు గోపాలం 'మౌనం శరణ్యం' అని ప్రక్కకి తప్పుకున్నాడు, నిశ్శబ్దం భరించలేక శారద

"కానీండి, రెండొందలు నాకు పంపానని ఎవరికిచ్చారు?" సూటిగా అడిగింది. క్షణం నిర్ఘాంతపోయాడు శారదకెలా తెలుసు?

"అమ్మ అడిగిందా?" ముద్దాయి ఎదురు ప్రశ్న

"కావలసినవాళ్ళెవరయినా చెబుతారు. మీ అవసరాలు తీర్చుకుందుకు నన్ను వుపయోగించుకోవడం [illegible] అసలేం చేశారో చెప్పండి," నిలదీసింది శారద. మాట్లాడక యింకోపని [illegible] తప్పించుకున్నాడు గోపాలం. శారద రెట్టించినా, గుచ్చిగుచ్చి అడిగినా సరిగా సమాధానం ఇవ్వలేదు. శారద మనస్సు విలవిలాడింది. అత్తగారి హెచ్చరింపులూ, ఆయనగారి పరాకులు ఆమెనింకా కలవర పెట్టాయి. నాలుగురోజులు భార్యాభర్త లిద్దరూ తప్పించుకుని తిరుగసాగారు. తప్పు చేసిన వానిలా గోపాలం, అతన్ని పట్టుకుందుకుగాను శారదా ప్రయత్నిస్తున్నారే గాని, ఎప్పటి సంతోషం, సరదా లేదు.

ఆవేళ ఆదివారం. హఠాత్తుగా వూడిపడ్డాడు శేఖరం పిడుగులేని వానలా. గోపా[లం] వచ్చిన అలుక అంతా విని ముసిముసిగా నవ్వుకున్నారు మిత్రులు లిద్దరూ. ప్రక్కగదిలో జడల్లుకుంటున్న తనకి వినిపించీ వినిపించనిమాటలు శ్రద్ధగా చెవులొగ్గి వినసాగింది శారద.

"ఎలా వుందిరా క్రొత్తజీవితం" శారద వినేలా అడిగాడు శేఖరం.

"తియ్యగా కారంగా వుంటోందిరా, కారంపాలే ఎక్కువ!" అని గోపాలం జవాబిచ్చాడు వళ్ళుమండింది శారదకి.

"కారంం! శ్రావణ తగువేనా?" అని అడిగిన శేఖరానికి, ఔనని తలూపాడు గోపాలం శారదకి కుతూహలం పెరిగింది. కీలకం తెలుస్తున్నందుకు.

శారదని పిలిచి పరిచయం చేశాడు గోపాలం. శేఖరం లేచి నిల్చున్నాడు

"గోపాలానికి వచ్చిన బోనస్ మూడు వందలు నా అవసరానికి తీసుకున్నాను, కాదనలేక యిచ్చేశాడు మీ మనస్సు కష్ట పెట్టాను క్షమించండి. ఇదిగో మీ శ్రావణ తగువు అంటూ మూడునోట్లూ అందించాడు శారదకి శేఖరం, సిగ్గుతో తలవంపుకుని గదిలోకి వచ్చి వాలింది శారద. శ్రావణ తగువు కివ్వలేక పోయినా, పతీపతుల తగువు తీర్చావురా! ఇవాలికి మూడు రోజులనుండి నిద్దర లేదు"అంటున్నాడు గోపాలం. అద్దంలో చూసి నవ్వుకుంది శారద. అందరి మనసుల

**Regd No. M. 4479 Andhra Patrika Illustrated Weekly.**

# తిరిగి ఆశ్చర్యముగా పూర్తి స్వస్థత చేకూరుతుంది !



వాటర్ బరీస్ కాంపౌండ్ టానిక్కును ప్రపంచములో ఆరోగ్యమును వాంఛించు పిన్నలు పెద్దలు అందరూకూడా ఆరోగ్యము నిచ్చుటలో సాటిలేనిదని పేరొందుటచే విడువక వాడుచున్నారు.

వాటర్ బరీస్ కాంపౌండ్‌లో ముఖ్యమైన పోషక పదార్థములు కలిగియుండుటచే సౌఖ్యప్రదమగు జీవితమును ప్రసాదించి మీ కుటుంబమునకు అవసరమైన అదనపు శక్తిని చేకూర్చును

వాటర్ బరీస్ కాంపౌండ్ ఎడతెగని దగ్గు, పడిశములు, శ్వాసకోశపు రుగ్మతలను నివారించును వ్యాధినుండి త్వరితముగా కోలుకొనుటకు డాక్టర్లు దీనిని సిఫారసు చేయుచున్నారు

పిల్ ఫర్-ప్రూఫ్ మూతతోను, క్రొత్త లేబిల్ తోను యిప్పుడు సరఫరా చేయబడుచున్నది



ఇప్పుడు షాపులలో
[illegible]

## ఆరోగ్యమునకు హితవైన

# వాటర్‌బరీస్ కాంపౌండ్



న వ వ ధు వు